ఉగాది శుభాకాంక్షలు

1993-2013 నడుస్తున్న చరిత్ర



సంపుటి : 2
సంచిక : 2
రు. 20/-లు
తెనాలి

తెలుగుజాతి పత్రిక

# అమ్మనుడి

నుడి నాడు నెనరు

ఏప్రిల్ 2016

- సంస్కృతము తల్లి కొన్ని భాషలకు మటుకు...
- ప్రాథమిక విద్యను మాతృభాషలో తప్పనిసరి చేయాలి
- సక్సెస్ పాఠశాలల నుండి తెలుగుమాధ్యమ విద్యార్థుల గెంటివేత

తెలుగుదనం మచ్చుకైనా కనుపించని అచ్చం సంకరజాతి రాజధాని-అమరావతి





# ఉగాది నాటికల్లా తెలుగు శిలాఫలకాలను పెట్టాలి. తెదేపా ఎన్నికల ప్రణాళికలోని వాగ్దానాలను అమలు చేయాలి. కానిచో...ఉగాది నుండి ఉద్యమం



**రా**జధాని అమరావతి నిర్మాణానికి వేసిన శంకుస్థాపన శిలాఫలకంలో గాని, తాత్కాలిక సచివాలయ నిర్మాణానికి వేసిన శిలాఫలకంలో గాని తెలుగు ఒక్క అక్షరం కూడా లేదని, అంతా ఇంగ్లీషులోనే ఉన్నదని అమ్మనుడి పత్రిక నవంబరు 2015, మార్చి 2016 సంచికలలో ఫొటోలతో సహా ప్రకటించింది. ఇది తెలుగు ప్రజలకు అవమానంగా అభివర్ణించింది. ప్రభుత్వమే తెలుగును పట్టించుకోకుండా వ్యవహరించడాన్ని అనేక ఉదాహరణలతో దుయ్యబట్టింది. ఈ అంశంపై భాషాభిమానులు కదిలారు.

పద్మభూషణ డా॥యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ తనదైన శైలిలో నిరసన కార్యక్రమాన్ని చేపట్టారు. తెలుగులో శిలాఫలకాలను తయారు చేయించి వాటిని మార్చి 2న విజయవాడలో ప్రెస్‌క్లబ్ నుండి ఊరేగింపుగా తీసుకువెళ్ళి సి.ఆర్.డి.ఏ.కమీషనర్ గారికి అప్పగించి వినతిపత్రాన్ని ఇచ్చారు. ఆయనకు సమర్థనగా తెలుగు భాషోద్యమ సమాఖ్య అధ్యక్షుడు డా॥సామల రమేష్‌బాబు, కాంగ్రెసుపార్టీ నేతలు డా॥తులసిరెడ్డి; కొలనుకొండ శివాజీ; తూమాటి ప్రేమనాథ్ తదితర రాజకీయ నాయకులు, రచయితలు గుమ్మా సాంబశివరావు, వెన్నా వల్లభరావు, మందరపు హైమవతి, చలపాక ప్రకాష్, కలిమిశ్రీ, శర్మ, కళారంగ ప్రతినిధులు గోళ్ల నారాయణరావు (ఆంధ్రా ఆర్ట్స్ అకాడమీ), చింతకాయల చిట్టిబాబు (తెలుగు కళావాహిని), పలువురు తెలుగు భాషాభిమానులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

తర్వాత మార్చి 30న ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు గారిని డా॥లక్ష్మీప్రసాద్ హైదరాబాదులో స్వయంగా కలిసి ఒక వినతిపత్రాన్ని ఇచ్చారు. తెలుగుదేశం పార్టీ ఎన్నికల ప్రణాళికలో తెలుగుభాష, తెలుగు సాంస్కృతిక రంగాల అభివృద్ధికై చేసిన వాగ్దానాలను నెరవేర్చాలని, అవి ఈ ఉగాది నుంచే ఆచరణ మొదలవ్వాలని కోరారు. అమరావతికి శంకుస్థాపనలో, తాత్కాలిక సచివాలయ శంకుస్థాపనలో తెలుగుకు స్థానం లేకుండా చేసిన తప్పును ఉగాది నాటికి సవరించుకొనేందుకు ఉద్యమకారులు తెలుగులో చెక్కించి ఇచ్చిన శిలాఫలకాలను ఇంగ్లీషు ఫలకాల పక్కనే స్థాపించాలని అందులో కోరారు. దానితోపాటు ప్రభుత్వ పాలనా వ్యవహారాలు తెలుగులోనే జరిగేలా చర్యలు తీసుకోవాలని, రాజమండ్రిలో తెలుగు విశ్వవిద్యాలయాన్ని స్థాపించాలని, 1 నుండి 10వ తరగతి వరకు తెలుగును ఒక సబ్జెక్టుగా తప్పనిసరి చేస్తామని ముఖ్యమంత్రి గారు చేసిన వాగ్దానాలను వెంటనే అమలు చేయాలని అందులో కోరారు. చెన్నయ్‌లోని పొట్టి శ్రీరాములు స్మారక భవన నిర్వహణకు, కార్యక్రమాలకు మూడు సంవత్సరాలుగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం బాకీ పడిన 10 లక్షల రూపాయలను వెంటనే వారికి చెల్లించాలని కూడా అందులో కోరారు.

మార్చి 31న విజయవాడ ప్రెస్‌క్లబ్‌లో జరిగిన పత్రికా ప్రసార మాధ్యమాల సమావేశంలో పై వివరాలన్నిటినీ డా॥యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ తెలియజేశారు. 2014 ఆగస్టు 29న గిడుగు జయంతి సభలో ముఖ్యమంత్రి చేసిన ప్రసంగం వివరాలను, తెలుగుదేశం పార్టీ ఎన్నికల ప్రణాళికలో తెలుగుకోసం చేసిన వాగ్దానాల నకలును కూడా అందరికీ అందించారు.

ఆయనతో పాటు సమావేశంలో తెలుగు భాషోద్యమ సమాఖ్య అధ్యక్షుడు డా॥సామల రమేష్‌బాబు ప్రసంగించారు. 1 నుండి 10వ తరగతి వరకు తెలుగును తప్పనిసరి చేస్తూ, జి.వో.నెం.86/2003ను సరిగా అమలు చేయాలని కోరారు. తెలుగు కోసం చేసిన వాగ్దానాలను నెవవేర్చకపోతే ఉగాది నుంచి దీక్షలు మొదలవుతాయని, రాష్ట్రమంతటా తెలుగు భాషోద్యమ సమాఖ్య ఇతర సంఘాలు, రచయితల సంఘాలతో కలిసి ఉద్యమిస్తామని ప్రకటించారు.




వడ్రంగం పిట్టలలో ఒకరకం ఇది. పర్యావరణ సంక్షోభంలో ఎన్నో రకాల పక్షిజాతులు నశించిపోతున్నాయి. అరుదుగా వుండే ఈ పక్షిజాతి (lesser golden-backed woodpecker) నశించిపోవడానికి అవకాశం వున్న వాటిలో ఒకటి. నేచర్ ఫొటోగ్రఫీలో నిపుణుడైన టి.శ్రీనివాసరెడ్డి గురించి 'పక్షులకు పుట్టినిల్లు భారతదేశమే...' (పుట నెం.30) వ్యాసంలో చదవండి.



## శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

"మొదట మనం ఆంధ్రులం కనక తరవాత భారతీయులం ఇంత సుస్పష్టమైన ఈ విషయం తికమకలు చేస్తున్నారు కొందరిప్పుడు. అనుమానాలు కలిగిస్తున్నారు. అపనమ్మకాలు పుట్టిస్తున్నారు. అపాయకరమైన ప్రయత్నం ఇది. నా భారత జాతీయత సుస్థితికోసం తెనుగు వాణ్ణిగా నేనిది దృఢంగా గర్విస్తున్నాను. మళ్ళీ చెబుతున్నాను. మొదట మనం ఆంధ్రులం, వెంటనే మనం భారతీయులం అని స్ఫురిస్తుందెవరికైనా. ఆంధ్రభాష మన మాతృభాష కనక–మనం ఆంధ్రజాతిలో పుట్టాం కనక–ఆంధ్రదేశం మన కాణాచి కనక–మొదట మనం ఆంధ్రులం. మన ఆంధ్రదేశం భరతఖండంలో వొక భాగం కనక, వెంటనే భారతీయత మనకు సహజంగానే సిద్ధిస్తోంది. ఇలా కాక మొదట మనం భారతీయులం అయితే? మనం ఆంధ్రులమే అన్న స్ఫురణ యెలా కలుగుతుంది? మనం గుజరాతీలం అని యెందుకు అనుకోకూడదు యెవరైనా? తమిళులం అని యెందుకనుకోగూడదు? మరొకళ్ళమనిన్నీ యెందుకనుకోగూడదు? మొదట మనం ఆంధ్రులం అనుకుంటే భారతీయులం కాక, ఆఫ్రికన్లమవుతామా? అమెరికన్లమవుతామా? కనక మనకు భారతీయత మొదటిదనడం అవివేకం"

*–కీ.శే.శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి ఆత్మకథ 'అనుభవాలూ–జ్ఞాపకాలూను' నుండి. (భాషా రాష్ట్రాలూ, హద్దులూ ఏర్పడని రోజుల్లో వ్రాసినది. ఇందులో ఆంధ్రులం అంటే తెలుగువాళ్ళం అనీ, ఆంధ్రభాష అంటే తెలుగు అనీ గ్రహించాలి).*

## లోపలి పుటలలో....




ముఖచిత్రం ఫొటో : **కె.వెంకటేశ్వర్లు (బొమ్మల వెంకన్న),** కోదాడ

తక్కిన ఫొటోలు : **తమ్మా శ్రీనివాసరెడ్డి**

కైసేత–ముఖచిత్రం : **కలిమిశ్రీ**

రేఖాచిత్రాలు : **బాలి** పకపకలు : **సరసి, శేఖర్**

తెలుగుజాతి పత్రిక

# అమ్మనుడి

మాసపత్రిక

• నుడి • నాడు • నెనరు

సంపాదకుడు డా॥ సామల రమేష్‌బాబు

శాలివాహన శకం 1938 : మన్మథనామ సంవత్సర ఫాల్గుణ *(వేగాపి) బహుళ అష్టమి శుక్రవారం మొదలు దుర్ముఖి నామ సంవత్సర చైత్ర *(ముత్తాపి) బహుళ అష్టమి శనివారం వరకు

* వేగాపి * ముత్తాపి : తెలుగు నెలలు


## చందా వివరాలు

| | వ్యక్తులకు | సంస్థలకు | విదేశీయులకు |
|---|---|---|---|
| శాశ్వత చందా : | రూ.5000 | రూ.7500 | -- |
| 5 సం॥ : | రూ.1000 | రూ.1500 | 150 డాలర్లు |
| 3 సం॥ : | రూ. 700 | రూ.1000 | 75 డాలర్లు |
| 1 సం॥ : | రూ. 240 | రూ. 400 | 25 డాలర్లు |

ఎం.ఓ. లేదా తెనాలిలో చెల్లునట్లు బ్యాంకు డి.డి.ని **'అమ్మనుడి'** పేర పంపాలి. చెక్కు పంపేట్లయితే దయచేసి అదనంగా రు.30 లు చేర్చి పంపండి.

ఆన్‌లైన్ ద్వారా చందాను పంపేవారు NEFT / RTGS ద్వారా **'అమ్మనుడి'**-యాక్సిస్ బ్యాంకు, తెనాలి శాఖకు పంపాలి.

**AMMA NUDI - AXIS BANK, TENALI**

అక్కౌంట్ నెం. **915020010550189**

**IFSC Code : UTIB0000556**

ఆన్‌లైన్‌లో చందాను పంపినవారు, ఆ వెంటనే దయతో - చిరునామా, ఫోన్ నెం. తదితర వివరాలను జాబుద్వారాగాని, ఫోన్ మెసేజి ద్వారాగాని తెలుపగలరు.

చందాలు పంపడం, దానికి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలకు చిరునామా


**డా॥ సామల లక్ష్మణబాబు,** ప్రచురణకర్త, 'అమ్మనుడి'
8-386, జీవక భవనం, అంగలకుదురు పోస్టు, **తెనాలి**
గుంటూరు జిల్లా - 522 211. ఫోన్ : 9440448244
ఇ-మెయిల్ : ammanudi@gmail.com


**చందాదారులు కోరినట్లయితే ఆన్‌లైన్‌లో కూడా పత్రికను పంప గలము. ఇందుకోసం మీ ఇ-మెయిల్ ఐడిని తప్పక తెలుపగలరు.**

## చందాదారులకు సూచనలు

1. చందా కాలం ముగింపు తేదీ - పత్రిక కవరుమీద మీ చిరునామా పై భాగంలోనే ఉంటుంది. గమనించండి.
2. చందా పూర్తయ్యేందుకు ఒక నెల ముందే దయచేసి మీ చందాను పంపించండి.
3. మీ ఇంటి నెంబరుతో పూర్తి చిరునామాను, పిన్‌కోడ్ నెంబరుతో సహా తెలియపరచాలి. మీ ఫోన్ నెంబరును, వుంటే మీ మెయిల్ ఐడి ని తెలపాలి.
4. మీ చిరునామా మారినట్లయితే దయచేసి వెంటనే తెలియజేయండి.

## రచయితలకు సూచనలు

1. విభిన్న అంశాలపై వ్యాసాలను పంపవచ్చు. ముద్రణలో 1 నుండి 3 పుటలకు మించకుండా ఉండాలి. అన్నిరంగాలలో తెలుగువారి శ్రేయస్సుకు సంబంధించిన రచనలను పంపండి. విమర్శలు విషయం పైనే ఉండాలి గాని వ్యక్తులపై గురిపెట్టి చేయరాదు. అప్రజాస్వామిక రచనలను తీసుకోలేము. సరళమైన తెలుగులో వ్రాయాలి. 2. రచనలను యూనికోడ్‌లో గాని, అను ఫాంట్స్ లో గాని టైప్ చేసి లేదా ఎ4 సైజు కాగితంపై వ్రాసి, స్కాన్ చేసి ammanudi@gmail.com కు పంపాలి. లేదా కొరియర్ / రిజిష్టర్డ్ / సాధారణ పోస్టులో పంపవచ్చు. 3. రచనతోపాటు రచన స్వంతమేనని, ఇతర పత్రికలకు గాని, ఇంటర్నెట్ పత్రికలకు గాని పంపలేదని, పరిశీలనలో లేదని, ఇంతవరకు ఎక్కడా ప్రచురణ కాలేదని హామీపత్రాన్ని స్పష్టంగా వ్రాసి పంపాలి. పోస్టల్ చిరునామా, ఫోన్ నెం., ఇ-మెయిల్ కూడా ఇవ్వాలి. ఈ వివరాలు లేని రచనల్ని తీసుకోలేము. 4. మాకు పంపే రచన నకలును మీ వద్ద ఉంచుకోండి. ప్రచురణకు ఎంపిక చేయని రచనలను తిప్పి పంపడం వీలుకాదు.

## కథారచయితలకు, కవులకు విన్నపం

1. మాట్లాడుకొనే తెలుగులో వ్రాసిన కథల్ని **'నడుస్తున్న చరిత్ర'** ప్రచురించిన సంగతి చదువరులకు, రచయితలకు తెలిసిందే. ఈ సంప్రదాయాన్ని **'అమ్మనుడి'** పత్రిక కొనసాగిస్తున్నది. పాత్రల సంభాషణలు తప్పనిసరిగా మీ ప్రాంతంలో మాట్లాడుకొనే తెలుగు తీరులో ఉండాలి. కథాచిత్రణ కూడా మీ తెలుగు తీరులోనే ఉంటే మంచిది. కఠినమైన సమాసాలను ఉపయోగించవద్దు. తేలికైన తెలుగు మాటలు కుదరకపోతే జనం వాడుకలోని ఇతర ప్రాంతాల తెలుగు మాటల్ని వ్రాయవచ్చు. తప్పనిసరి అయితే తప్ప ఏ ఇతర భాషల మాటలను ఉపయోగించవద్దు. ఈ సూచనలే కవితలకూ వర్తిస్తాయి.

2. **'అమ్మనుడి'**లో ప్రచురణకు తీసుకొనే కథలు, కవితలు తెలుగువారి సామాజిక, భాషాసంస్కృతుల వికాసానికి తోడ్పడేవిగా ఉండాలి.

3. ప్రతినెలా ఒకటి లేక రెండు కథలను మాత్రమే ప్రచురించగలం. ముద్రణలో 2 లేక 3 పుటలకు మించకుండా ఉండేవాటినే తొలి ఎంపికకు తీసుకుంటాము. కవితలు 20 నుంచి 30 వరుస (లైను)లకు మించకూడదు. ప్రతినెలా 4 లేక 5 కవితలకు మించి పత్రికలో చోటుండదు.

రచనలు, ఉత్తరాలు పంపుటకు చిరునామా


**డాక్టర్ సామల రమేష్‌బాబు,**
సంపాదకుడు, **అమ్మనుడి,**
జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి,
మాచవరం, విజయవాడ-520004.
e-mail : ammanudi@gmail.com
దూరవాణి: కార్యాలయం : 0866-2439466
సంపాదకుడు : 9848016136



**డా॥ఎస్.వసంత్,** హోసూరు, తమిళనాడు సెల్ : 94883 30209

"తెలుగుభాషా పరిరక్షణలో అమ్మనుడి పత్రిక గురించి చదువరులకు చెప్పనవసరం లేదు. రాష్ట్రేతర తెలుగు ప్రాంతాల్లో మరీ ముఖ్యంగా తమిళనాడు తెలుగువారి గోడు పట్టించుకునే ఏకైక పత్రిక అమ్మనుడి అంటే అతిశయోక్తి కాదు. పత్రిక ఎదుగుదలను కోరుకుంటూ మొదటి విడతగా రు.10,000/-లు పంపుతున్నాను. కృష్ణగిరి జిల్లా తెలుగు రచయితల సంఘం కార్యదర్శిగా వున్నాను. తెల్లకొక్కర్ల తెప్పం, వెండిమొయిళ్ళు-బండబతుకులు, ఆటాడుకుందాం రా కథా సంకలనాలతోపాటు పలు పత్రికల్లో కవితలు, వ్యాసాలు వ్రాశాను".

# తెలుగుజాతి (ట్రస్టు) విన్నపం

'నడుస్తున్న చరిత్ర' ప్రోత్సాహంతో ఆంధ్రప్రదేశ్‌లోనే కాక, పొరుగు రాష్ట్రాల్లోనూ నివసిస్తున్న తెలుగువారి శ్రేయస్సుకు, తెలుగు భాషోద్యమ నిర్మాణానికి కృషి జరిగింది. దక్షిణ భారతదేశమంతటా చిక్కగా అల్లుకొని, మొత్తం దేశంలోనేకాక, అనేక ఇతర దేశాల్లో కూడా భాషా సాంస్కృతిక మూలాలను విస్తరించుకొనివున్న తెలుగుజాతిలో చైతన్యాన్ని పెంపొందించి, వారిలో సంఘీభావాన్ని, భావసమైక్యతను బలపరచవలసిన అక్కరను గుర్తించిన కొందరు కార్యకర్తలు అందుకోసం పనిచేస్తున్నారు. అయితే, అనివార్య కారణాల వల్ల నడుస్తున్న చరిత్ర పత్రికను 2013 నవంబరు నుంచి నిలిపి వేయవలసి వచ్చింది. మళ్ళీ పత్రికను ప్రచురించడంతోపాటు తెలుగు నుడి, చరిత్ర, జాతి ముందడుగుకు అవసరమైన పుస్తకాల ప్రచురణను, ప్రచార కార్యక్రమాలను చేపట్టాలని తలపెట్టాము. ఇందుకోసం 'తెలుగుజాతి' పేరిట ఒక ట్రస్టును నమోదు చేయించాము. (92/ 2014). తెలుగు 'అమ్మనుడి"గా కలిగినవారు ఎక్కడ నివసిస్తున్నా, వారి శ్రేయస్సు కోసం ఈ సంస్థ పనిచేస్తుంది.

2015 మార్చి నుంచి **అమ్మనుడి** పత్రికను ప్రచురిస్తున్నాము. పుస్తకాల ప్రచురణ కార్యక్రమంలో భాగంగా తొలుత స.వెం.రమేశ్ వ్యాసాల సంకలనం **'ఎల్లలు లేని తెలుగు'**ను విడుదల చేశాము. త్వరలోనే మరికొన్ని ప్రత్యేకమైన పుస్తకాలను వెలువరించ బోతున్నాము. ఈ ట్రస్టును బలమైన పునాదులపై, తగినన్ని వనరులతో బలపరచటానికి మీ అందరి చేయూత కావాలి. ట్రస్టు నిర్మాణంలో తోడ్పడాలని విన్నవిస్తున్నాము.



| | | |
|---|---|---|
| **ట్రస్టుకు విరాళాలనిచ్చి తోడ్పడ గోరుతున్నాము.** | రాజ పోషకులురు. 1,00,000/-లు | పోషకులు రు. 25,000/-లు |
| | విశిష్ట పోషకులు రు. 50,000/-లు | ప్రోత్సాహకులు రు. 10,000/-లు |

దాత ఫోటోను, క్లుప్తంగా పరిచయాన్ని **'అమ్మనుడి'** పత్రికలో ప్రచురిస్తాము. పత్రికను, ట్రస్టు ప్రచురించే పుస్తకాలను ఉచితంగా పంపిస్తాము.

సొమ్మును చెక్ / డ్రాఫ్టుగా / ఆన్‌లైన్‌లో 'TELUGUJAATHI' పేర పంపాలి. యాక్సిస్ బ్యాంక్, సికిందరాబాదు.

అక్కౌంట్ నెం. 914020020387880 I.F.C.Code : UTIB0000068

**డా॥ సామల రమేష్‌బాబు,** మేనేజింగ్ ట్రస్టీ, 9848016136 ట్రస్టీలు : **పారుపల్లి కోదండరామయ్య** 9505298565, **డా॥వెన్నిసెట్టి సింగారావు** 9393015584, **స.వెం.రమేశ్** 8500548142, **సామల లక్ష్మణబాబు** 9440448244

# ప్రాథమిక విద్యను మాతృభాషలో తప్పనిసరి చేయాలి
# తెలుగు రాష్ట్రాలు తమ భాషావిధానాన్ని ప్రకటించాలి
# తెలుగుభాషా శాస్త్రజ్ఞుల వేదిక తీర్మానం

తెలుగు భాషాశాస్త్రజ్ఞుల వేదిక నిర్వహించే 7వ జాతీయ సదస్సు ఈ నెల 11, 12 తేదీలలో హైదరాబాదు విశ్వవిద్యాలయంలో మైసూరు లోని సిఐఐఎల్ వారి సహకారంతో జరిగింది. తెలుగుభాష (ప్రాచీనం–అర్వాచీనం) అనే అంశంపై తెలుగు భాషాభివృద్ధిని కేంద్రంగా తీసుకొని సుప్రసిద్ధ ఆచార్యులు, భాషాశాస్త్రవేత్తలు, విద్యార్థులు, పరిశోధకులు ఈ సదస్సులో పాల్గొని పరిశోధక పత్రాలను సమర్పించారు. ఒకరోజు ఆధునిక తెలుగుభాషపై జరిగిన పరిశోధనలపై పలువురు గోష్ఠీపత్రా లను సమర్పించారు. ఆధునిక తెలుగు, వ్యావహారిక తెలుగు, మాండ లిక తెలుగు, అనువాదం, ప్రాచీన సాహిత్యం, శైలీశాస్త్రం, భాషా అనువర్తనాలు, పదాంశ విజ్ఞానం, ధ్వనిశాస్త్రం, వర్ణవిజ్ఞానం, వాక్య విజ్ఞానం, అర్థ విపరిణామం, ఆదాన ప్రదానాలు, భాషా సంసర్గం, నిఘంటు నిర్మాణం మొదలైన అనేక అంశాలపై ఈ పత్రాలు అందరినీ ఆలోచింపజేశాయి. ఈ సదస్సు ప్రారంభ సమావేశంలో అతిథులుగా స్కూల్ ఆఫ్ హ్యూమానిటీస్ డీన్ డా॥పంచానన్ మొహంతి, డా॥విజయ సారధి (సిఐఐఎల్), డా॥సామల రమేష్‌బాబు (అమ్మనుడి పత్రికా సంపాదకులు, తెలుగు భాషోద్యమ సమాఖ్య అధ్యక్షులు) డా.బి.రామ కృష్ణారెడ్డి, డా॥హరిబండి లక్ష్మి పాల్గొన్నారు. తెలుగుభాషా శాస్త్రజ్ఞుల వేదిక ఆశయాలను తెలియజేశారు. భాషా పరిశోధనలు క్రియాశీలం గానూ, ఆలోచనాభరితంగానూ ఉండాలన్న ఉద్దేశంతో రెండోరోజు జరిగిన రెండు ప్రధానమైన విభాగాలు ఈ సదస్సులో అందరినీ ఆలో చింపజేశాయి. అందులో మొదటిది ప్రాచీన తెలుగుపై చర్చాసదస్సు. ఈ సదస్సును డా॥అద్దంకి శ్రీనివాస్ అధ్యక్షులుగా చేసిన సమన్వయ గోష్ఠిలో కీ.శే.పి.యస్.సుబ్రహ్మణ్యం, ఆచార్య బేతవోలు రామబ్రహ్మం, ఆచార్య పరిమి రామనరసింహం, వెన్నెలకంటి ప్రకాశం, ఆచార్య జి.ఉమామహేశ్వరరావు, కస్తూరి విశ్వనాథం, ఆచార్య ఎ.ఉషాదేవి, ఆచార్య బి.రామకృష్ణారెడ్డి ప్రసంగించి ప్రాచీన భాషలో జరగవలసిన పరిశోధన రంగాలను సమీక్షించారు. ఆ తరువాత తెలుగును సాంకేతి కంగా పరిపుష్టం చేయాలనే ఉద్దేశంతో–హైదరాబాదు విశ్వవిద్యాలయం వారు అనువర్తిత భాషాశాస్త్ర అధ్యయన శాఖలో రూపొందించిన పదవిశ్లేషిణి (Morphological Analyser) అనే ఉపకరణాన్ని తయారుచేసే విధానంపై ఆచార్య జి.ఉమామహేశ్వరరావు, డా॥అద్దంకి శ్రీనివాస్, డా॥కె.రాజ్యరమ కార్యశాలను నిర్వహించారు. ఆధునిక భాషకు 90 శాతం పనిచేసే ఈ పదవిశ్లేషిదని ప్రాచీనభాషకు తయారు చేస్తే ప్రాచీన గ్రంథాలన్నింటినీ సులభంగా అర్థం చేసుకొనే వీలు ఏర్పడుతుందని వీరు చెప్పారు. అనంతరం రెండోరోజు సాయంత్రం ఆచార్య జె.ప్రభాకరరావు గారి నిర్వహణలో 'భారతదేశంలో భాషా సంక్షోభం' అనే అంశంపై చర్చావేదిక జరిగింది. మాతృభాషకు దూర మౌతున్న భాషా సమూహాలు సహజత్వానికి దూరంగా జీవించవలసి వస్తోందనీ, ఎంతో ప్రతిభ ఉన్నా ఆంగ్లంలో అత్యుత్తమస్థాయిలో రాయలేక ప్రతిభ మొత్తం నిర్వీర్యమౌతోందని ఆవేదన వ్యక్తం చేశారు. డా॥సామల రమేష్‌బాబు భాషాభివృద్ధి కోసం అటు ప్రభుత్వంలోనూ ఇటు ప్రజలలోనూ సత్వరం తీసుకురావలసిన మార్పులను సూచిం చారు. వారి సూచన మేరకు కొన్ని తీర్మానాలను కూడా ఆమోదించి వాటిని ప్రభుత్వం దృష్టికి, ప్రజల దృష్టికి తీసుకువెళ్ళేందుకు నిర్ణయిం చారు. తెలుగుభాష చుట్టూ కమ్ముకొన్న చీకట్లను తరిమికొట్టడానికి పలువురు భాషావేత్తలూ, భాషా ప్రియులు ఒక వేదికను ఏర్పాటు చేసుకొని ఇలా సమీక్షించుకోవడం భాషాభివృద్ధికి ఎంతో దోహదం చేస్తుందనీ భావితరాలకు స్ఫూర్తిదాయకంగా వుంటుందనీ అందరూ ఆనందం వ్యక్తం చేశారు.

**ఆమోదించిన తీర్మానాలు**

1. దేశీయ విజ్ఞానాన్ని, వారసత్వ సంపదను రక్షించుకోవడానికి, భారతీయ సంస్కృతిని, సృజనాత్మకతను పెంపొందించుకోవ డానికి మాతృభాషల్లో పాఠశాల విద్యను బోధించాలని, కనీసం ప్రాథమికవిద్యను దేశమంతటా మాతృభాషలోనే బోధించాలని సదస్సు అభిప్రాయపడింది. రాజ్యాంగం ప్రకారం 'విద్య' కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల ఉమ్మడి జాబితాలో ఉన్నందున–కేంద్ర ప్రభుత్వ నేతలే ఈ అంశంపై పూనిక వహించి, రాష్ట్రాల సమ్మతితో తమ జాతీయ భాషావిధానంలో భాగంగా దేశమంతటా ప్రాథమిక విద్యను మాతృభాషల్లో తప్పనిసరి చెయ్యాలని ఈ సదస్సు కోరింది. ఇందుకోసం రాజ్యాంగానికి తగు సవరణ చెయ్యాలని కూడా ఈ సదస్సు కేంద్ర ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించింది.
2. వివిధ రాష్ట్రాల్లోని భాషాల్పసంఖ్యాకులకు ప్రాథమిక విద్యను వారి మాతృభాషలో బోధించుటకు రాజ్యాంగంలోని 350(ఎ) అధికరణం అవకాశం కల్పిస్తున్నా, అది ఎక్కడా అమలు కావడం లేదనీ, అందువల్ల ఆ అధికరణాన్ని తగువిధంగా సవరించి, మాతృభాషలో ప్రాథమిక విద్య బోధనను భాషాల్ప సంఖ్యాకులకు కూడా తప్పనిసరి చేయడానికి చర్యలు గైకొనాలని కేంద్ర ప్రభు త్వాన్ని కోరుతూ ఈ సదస్సు తీర్మానించింది.
3. రెండు తెలుగు రాష్ట్రాల్లోనూ భాషా మంత్రిత్వ (భాషా సాంస్కృతిక మంత్రిత్వ) శాఖలున్నందున వాటిని వినియోగించుకొని తెలుగు భాషను వికసింపజేసుకోవలసి వున్నదని, అందువల్ల రెండు తెలుగు రాష్ట్రాలూ తమ భాషా విధానాన్ని స్పష్టంగా ప్రకటించడం అవసరం అని ఈ సదస్సు అభిప్రాయపడింది. విద్యాబోధన, పరిపాలనా రంగాల్లో తెలుగుకు ప్రాధాన్యతనిస్తూ రెండు తెలుగు ప్రభుత్వాలూ తమ భాషా విధానాన్ని వెంటనే ప్రకటించాలని ఈ సదస్సు కోరుతూ తీర్మానించింది.
4. రెండు తెలుగు రాష్ట్రాల్లోనూ భాషా మంత్రిత్వ శాఖల క్రింద తెలుగు భాషాభివృద్ధికై ఒక తెలుగు అభివృద్ధి ప్రాధికార సంఘాన్ని (తెలుగు డెవలప్‌మెంట్ అథారిటీ) ఏర్పరచి తెలుగుని ఆధునిక భాషగా పెంపొందించేందుకు కృషి చేయాలని కోరుతూ తీర్మానించింది.

సంపుటి : 2 సంచిక : 2
**అమ్మనుడి**
ఏప్రిల్ 2016

సంపాదకీయం

# దేశభక్తి సరే, దేశభాషల సంగతేమిటి?

ఇప్పుడు రాజకీయ నాయకుల దేశభక్తి గురించి, జాతీయవాదం గురించి వాదోపవాదాలు, చర్చలు, జరుగుతున్నాయి. చివరికి ఇదంతా అధికారపార్టీకి ప్రతిపక్షాలకు మధ్య ఒక పెద్ద రాజకీయ యుద్ధంగా మారింది. స్వాతంత్ర్యోద్యమరోజుల్లో బ్రిటీషు వలసపాలకులను వ్యతిరేకించడమే దేశభక్తి. బ్రిటీషు వారు ఈ దేశాన్ని ఆక్రమించుకొనకముందు మనదేశాన్ని పాలించిన ముస్లిమ్ పాలకులకు వ్యతిరేకంగా పోరాడటమే దేశభక్తి. తర్వాతి కాలంలో ఉమ్మడి శత్రువైన బ్రిటీషు వారిపైన హిందువులు ముస్లిములు కలిసే పోరాడారు. దేశం నుంచి తమను తరిమివేసే రోజులు దగ్గరపడ్డాయని బ్రిటీషు పాలకులు తెలుసుకొని మనకు స్వతంత్రాన్ని ప్రకటించి వాళ్ళు తోకముడిచారు. ఈ లోపుగా హిందువులకు ముస్లిములకు మధ్య వైమనస్యాన్ని పెంచి పోషించి, దేశాన్ని ముక్కలు చేసి, పాకిస్తాన్‌ను ఏర్పాటు చేశారు. మిగిలిన దేశాన్ని కూడా ముక్కచెక్కలు చేయాలనే కుట్రతో హైదరాబాద్, కాశ్మీర్ లాంటి సంస్థానాలను రెచ్చగొట్టి మరీ వెళ్ళారు. ఆ రెండింటినీ విముక్తం చేసుకోగలిగినా అక్కడి ముస్లిమ్ జాతీయవాద రాజకీయాలు బలంగా తయారయ్యాయి. ఆ రెండుచోట్లా భారత వ్యతిరేక ముస్లిం రాజకీయ నాయకులు ఆధిపత్యం వహిస్తూనే వున్నారు. వారు తప్ప, తక్కిన దేశమంతా వున్న ముస్లిములు ఈ నేలతల్లి బిడ్డలే. చరిత్ర క్రమంలో ఇస్లాం మతంలో పుట్టినా వారి జీవితాలు ఈ నేలతోనే ముడిపడివున్నాయి. దేశభక్తి విషయంలో వాళ్లెవరూ వెనుకబడి లేరు. దేశభక్తికి ప్రతీకలుగా చరిత్రలో నిలిచిపోయినవారు వారిలో ఎందరో వున్నారు.

ఇప్పుడు రాజకీయాలు కులమతాలను అడ్డంగా వాడుకుంటున్నాయి. కులరాజకీయాలు చిమ్మే విషం ఆధిపత్యవాదులకు అధికారాన్నందిస్తున్నది. కులబలాన్ని ఆధారం చేసుకొని చెలగాటమాడుతూ సమాజ విఘటనకు దారితీసే కుల రాజకీయాలు దేశ వ్యతిరేక చర్యలే అవుతాయి. కులం వలెనే మతం చేసే రాజకీయాలు కూడా దేశసమైక్యతను నాశనం చేసేవే. ప్రపంచంలోనే అత్యధిక సంఖ్యలో ముస్లిములున్న దేశం భారత్ అనే సంగతిని మరవకూడదు. మతం పేరుతో రాజకీయాలు చేస్తున్నదంతా ఓట్లకోసం, అధికారం కోసం. ప్రపంచంలో ఇప్పుడు ఉగ్రవాదం విలయతాండవం చేస్తున్నది. ఉగ్రవాదులకు భారతదేశం కూడా ఒక ప్రధాన శత్రువు. పైగా జీహాదీవాదం ఆధారంగా పని చేస్తున్న ఉగ్రవాదం తమ లక్ష్యాల సాధన కోసం ఎంతకైనా తెగిస్తున్నది.

మన రాజకీయ పార్టీలు ఇప్పుడు దేశభక్తిని రాజకీయాలకు వాడుకుంటున్నాయి. హిందూత్వవాదులంతా దేశభక్తులుగా ముద్రవేసుకున్నందున వారిని వ్యతిరేకించేవారంతా ఇస్లామిక్ అతివాదులను, ఉగ్రవాదానికి ఊతమిచ్చేవాళ్ళను సమర్థించాలా? దేశద్రోహ నినాదాలు చేసేవారిని వెనకేసుకు రావడం సరైనదేనా?వాళ్లు ఆలోచించుకోవాలి. ఇప్పుడు దేశభక్తిని రాజకీయ అంశం చేయడం వల్ల ఉన్న సమస్యలు పరిష్కారం కాకపోవడంతోపాటు మళ్ళీ సమాజం ఈ పేరుతో చీలిపోతుంది. మన రాజకీయాలు ఇంత విషపూరితం కావాలా?

భారత సామాజికవ్యవస్థ నుండి కులాలు, మతాలు పూర్తిగా కనుమరుగవ్వాలని కోరుకోవడం ఒక అందమైన కల కావచ్చు. కానీ వాస్తవం మాత్రం కాదు. అందుకే– సోషలిస్టు రాజ్యం ఏర్పడితే కులాల, మతాల భేదాలు, తగాదాలు నశించిపోతాయనుకున్నా, హిందూత్వ రాజ్యం ఏర్పడగానే పతితులు లేని దరిద్రులు లేని ఆర్య సమాజం రూపొందుతుందని అనుకున్నా అదంతా ఒట్టి భ్రమ.

అదే విధంగా– మనదేశంలో వున్న వందలాది అమ్మనుడుల(మాతృభాషల) స్థానంలో హిందీ ఏకైక జాతీయ భాష ఏర్పడుతుందనో, అంతర్జాతీయ భాషగా పెరుగుతున్న ఆంగ్లాన్ని మన భాషగా చేసుకుంటే క్రమంగా ఈ భాషలన్నీ కనుమరుగవుతాయనో అనుకుంటే అంతకంటే అమాయకత్వం, తెలివితక్కువతనం వేరే వుండవు.

కులాలు, మతాలు, భాషలు నాటి అనేక సామాజిక సాంస్కృతిక రాజకీయ అవసరాలను తీర్చిదిద్దటానికి

## సంపాదకీయం

ఆయా సమాజాల్లో ఏర్పడినవే. ఒక ప్రాంతానికి మరొక ప్రాంతం తెలియని, చరిత్రకందని రోజుల్లోంచి ఇప్పుడు ప్రపంచాన్నంతా కంటితో చూడగలిగి, చెవులతో వినగలిగి, గ్రహాంతరయానం చెయ్యగలిగిన కాలంలోకి వచ్చాం. అయినా, కులాల్లో కలబోతలు, వెలివేతలు జరిగి వుండవచ్చు గానీ అవి రోజురోజుకు బిగుసుకుపోతున్నాయి. మతాలు ఆచరణలో శాంతికి బదులు అశాంతినే పంచుతున్నాయి.భాషల సంగతికొస్తే ఆధిపత్య భాషల తాకిడికి చిన్నచిన్న భాషలు కకావికలైపోయి, ఉనికి పోరాటాలకు పూనుకోవలసిన పరిస్థితి నెదుర్కొంటున్నాయి. జీవవైవిధ్యాన్ని కాపాడుకోవడానికి అమ్మనుడుల రక్షణ కీలకం అని యునెస్కో పదేపదే చెప్తున్నా భారత ప్రభుత్వానికి గాని, నేతలకు గాని అదేమీ పట్టినట్లు లేదు.

ఆధిపత్య వాదానికి సాధనంగా భాషను ఉపయోగించుకున్న ఘనత మన రాజకీయ నాయకులదే. హిందీని జాతీయభాషగా కీర్తించాలనేవారికి సంఖ్యాపరమైన ఆధిక్యత ఒక సాకుగా నిలిచింది. త్రిభాషా సూత్రాన్ని జాతీయ విధానంగా ప్రకటించినప్పుడు బలమైన జనసంఖ్య చరిత్ర, సంస్కృతి కలిగిన ద్రావిడ భాషలకు అన్యాయం జరిగింది. హిందీ భాషా రాష్ట్రాల్లో వాస్తవానికి రెండు భాషల సూత్రమే నడుస్తున్నది. అక్కడ హిందీ, దానితోపాటు ఇంగ్లీషే. కానీ ద్రావిడ భాషా రాష్ట్రాల్లో మాత్రం తమ అమ్మనుడులతోపాటు ఇంగ్లీషును, హిందీని కూడా నేర్చుకోవాల్సి వస్తున్నది. ఈ సిద్ధాంతాన్ని తమిళనాడు ప్రశ్నించింది. హిందీ ఆధిపత్యాన్ని వ్యతిరేకించి 'తమిళ్-ఇంగ్లీషు' అనే రెండు భాషల సిద్ధాంతానికే కట్టుబడిపోయింది.

భారతదేశంలో ప్రజలంతా ఒకేజాతికి చెందినవారు కాదు. ద్రావిడ భాషామూలాలకు చెందిన తెలుగు, తమిళ, మలయాళ, కన్నడ భాషలకు, ఇండో ఆర్యన్ భాషా మూలాలకు చెందిన ఉత్తర భారతదేశ భాషలకు ఎన్నో తేడాలున్నాయి. ఈ వైవిధ్యభరిత సమాజంలోంచి భారత ప్రజలను ఒక జాతిగా రూపొందించాలనే ప్రయత్నం స్వాతంత్ర్యం వచ్చినప్పటినుండి జరుగుతూనే వుంది. ఈ క్రమంలో తమను తాము రక్షించుకోలేని భాషాజాతులు క్రమంగా కనుమరుగయ్యే వీలుంది.

మన రాజ్యాంగం భాషా జాతుల ఉనికిని పరోక్షంగా ఆమోదించింది. ప్రత్యేకించి 8వ షెడ్యూలు ఇవ్వడమే దీనికి సాక్ష్యం. భాషా ప్రయుక్త రాష్ట్రాల రూపకల్పన చేయడమంటేనే అర్థమిది. కేవలం భాషే కాకుండా దానితోపాటు ఇతర అనేక విషయాలు కూడా రాష్ట్రాల ఏర్పాటుకు దోహదం చేస్తాయి. అందువల్ల కేంద్రం రాష్ట్రాలమీద ఆధిపత్యం చెలాయించగలుగుతున్నది గాని, రాజ్యాంగం ఆ భాషల రక్షణకు ఎటువంటి హామీని ఇవ్వడం లేదు. అందువల్ల 17వ విభాగంలోని మొత్తం 4 అధ్యాయాలను, దానితోపాటు మత, సాంస్కృతిక, విద్యా హక్కులకు సంబంధించిన 25-30 అధికరణలను సమీక్షించవలసిన సమయం వచ్చింది. 60 ఏళ్ళకు పైగా పొందిన అనుభవాలను పరిగణనలోకి తీసుకుని వివరమైన చర్చ జరగడం అవసరం. అన్ని భాషల, భాషాజాతుల రక్షణను, వికాసాన్ని దృష్టిలో పెట్టుకొని ఈ చర్చ జరగవలసి వున్నది.

ఇప్పుడు మాతృభాషలు సంక్షోభంలో వున్నాయి. దేశ ఐక్యతకు, చీలికకు మరొక కారణంగా భాషా సమస్య కూడా తయారు కాకూడదనుకుంటే మాతృభాషలకు పూర్తి రక్షణ ఇచ్చే రాజ్యాంగం కావాలి. ప్రజల భాషలను, విద్యా సాంస్కృతిక వారసత్వ సంపదను రక్షించగలిగేదిగా మన రాజ్యాంగాన్ని సరిదిద్దుకోవాలి. దీనిపై చర్చను చేపట్టాలని మేధావులకు, ప్రజాహిత సంస్థలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

తెలుగుజాతికి సంబంధించినంతవరకు- రెండు తెలుగు రాష్ట్రాల్లో వున్న 9 కోట్ల ప్రజలు గాక ఇతర రాష్ట్రాలలో మరి 9 కోట్లమంది తెలుగువారున్నారు. భాషారాష్ట్రాల ఏర్పాటు వారికి అశనిపాతమే అయింది. ఇతర రాష్ట్రాలకు, దేశాలకు వలసపోయిన వారు కాదు. వాళ్ళంతా అక్కడి నేలతల్లి బిడ్డలు. వారంతా తమ భాషా సంస్కృతులను కోల్పోతూ సామాజిక అనాథలవుతున్నారు. రాజ్యాంగం గాని, కేంద్రం గాని, రాష్ట్రాలు గాని వీరికి ఎటువంటి రక్షణనివ్వలేకపోతున్నాయి. కనుక మాతృభాషల సంక్షోభంలో అందరికంటే ఎక్కువగా తెలుగు భాషాజాతీయులు కూరుకుపోయారు. భాషల సంక్షోభం దేశద్రోహం ముద్రను వేయించుకోకముందే పరిష్కారాన్ని సాధించాలి. ఇందుకు రెండు తెలుగు రాష్ట్రాల నేతలు, మేధావులు, బాధ్యత గల పౌరులు ముందుకు రావాలి.

సామల రమేష్‌బాబు

**1-4-2016**

ప్రత్యేక వ్యాసం

-ప్రయాగ కృష్ణమూర్తి
81790 63842

# సంస్కృతము తల్లి కొన్ని భాషలకు మటుకు...

**"సంస్కృతము తల్లి కొన్ని భాషలకు మటుకు**
**అన్ని భాషల కది తల్లి యనుట తప్పు**
**ద్రవిడ భాషల కసలది తల్లి కాదు**
**కారణము వాటి మూలాలు వేరుగనుక"**

సంస్కృతం ఒక గొప్ప భాష. అంతులేని పదజాలం ఆ భాషకు సొంతం. సాంకేతిక పదసృష్టికి అనువైన భాష. ఊహ ఎంత చేయగలమో అంతటినీ అరటి పండు ఒలిచి చేతిలో పెట్టినంత సుఖంగా చెప్పగల భాష. అందుకే ఎంత క్లిష్టమైన భావాన్నైనా సులభంగా వివరించి చెప్ప టానికి పండితులు ఈ భాషనే ఎన్నుకుంటారు. కొత్త భావం మదిలో మెదిలినప్పుడు దాన్ని సునాయాసంగా శ్లోకంలో నిక్షిప్తం చేసి దాచుకోటా నికి వీలైన భాష. కంప్యూటరైజేషన్‌కు పనికి వచ్చే ప్రపంచ భాషల్లో సంస్కృతానికే మొదటిస్థానం దక్కుతుందని శాస్త్రజ్ఞుల ఉవాచ. సంస్కృత వాఙ్మయం చాలా పెద్దది. పురాతనమైనది. సత్సంకల్పంతో భారతీయ ఋషులు చేసిన కృషి అంతా ఈ భాషలోనే, ఇందులో గొప్ప సాహిత్యం వున్నది. మన వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, ఇతిహాసాలు, వ్యాక రణాది శాస్త్రాలు, శంకరాచార్య స్తోత్రాలు, గ్రంథాలు కవికుల గురువు మహాకవి కాళిదాసు, మాఘుడు, భవభూతి, దండి మొదలగు వారి ప్రసిద్ధమైన కావ్యాలు, నాటకాలు అన్నీ సంస్కృతంలోనే వున్నాయి. పంచతంత్రం, హితోపదేశం, భర్తృహరి సుభాషితాలు, ధర్మవివేకం, భావశతకం, కవితామృతకూపం, సదుక్తి కర్ణామృతం ఇత్యాదులు ఎన్నో వున్నవి. చివరకు నిత్యపూజకు పనికి వచ్చే మంత్రాలు కూడ సంస్కృతం లోనే వున్నవి. అందుకే దీన్ని దేవభాష అన్నారు. దేవతలను కొలిచే భాష కావచ్చు. దేవతలంటే ఊర్ధ్వలోకవాసులని పురాణాలలో చెప్పబడిన మాట. కానీ మనకేదైనా కష్టం కలిగినపుడు హఠాత్తుగా తటస్థించిన ఒక వ్యక్తి ఉపాయం చెప్పి ఆ కష్టాన్ని తొలగించినప్పుడు దేవుడిలాగా వచ్చి నా కష్టాన్ని తీర్చాడు అంటాము. కృతజ్ఞతలు చెపుతాము. అందు వల్ల లౌకికంగా చూస్తే దేవతలంటే దయార్ద్రహృదయులని, సత్పురుషు లని, సజ్జనులని, సదాచారసంపన్నులని, విజ్ఞులని మనం నిర్వచించుకో వచ్చు. దివ్య భావాలు గల వారెవరైనా దేవతలే. దేవభాషంటే దైవదత్త మైన భాష అనీ అనుకోవచ్చు.

సాక్షాత్తు దేవతలు మాట్లాడిన భాషనుకున్నారు గనుక, దేవతలు ఎప్పటినుంచో వున్నారు గనుక సంస్కృతం అత్యంత ప్రాచీనమైన భాషనీ, అందువల్ల అన్ని భాషలు దాని నుంచే పుట్టినవనీ భావించి "జనని సంస్కృతంబు సకల భాషలకును" "తల్లి సంస్కృతంబు ఎల్లభాషలకును, సకల భాషల ప్రముఖంబు సంస్కృతంబు" అని ఎందరో తెలుగు కవులు పద్యాలు వ్రాశారు, కానీ భాషాశాస్త్ర పరిశోధనల రీత్యా ఆ భాష ఆర్యుల ద్వారా భారతదేశంలోనికి క్రీ.పూ. 2000 ప్రాంతంలో ప్రవేశించిందని చరిత్రకారులు చెప్పినమాట.

వేద సాహిత్యం ప్రకారం క్రీ.పూ. 2000 సంవత్సరానికి పూర్వం భారతదేశ చరిత్ర, సంస్కృతి ఉన్నట్లు ఆధారాలు లేవు. కానీ 1921 లో రాయబహద్దూర్ దయారామ్ సహానీ హరప్పా నగరాన్ని రావి నది ఒడ్డున కనుక్కొన్నాడు. 1922లో ఆర్.డి. బెనర్జీ సింధూ నది కుడి ఒడ్డున ఉన్న మొహంజొదారోను వెలికితీశాడు. ఈ పరిశోధనల వల్ల క్రీ.పూ. 3200 ఏళ్ళ నాటికే భారతదేశంలో సుమేరియా, అక్కడ్, బాబిలోనియా, ఈజిప్టు, అస్సీరియా లాంటి గొప్ప ప్రాచీన నాగరికతలకు ఏమాత్రం తీసిపోని నాగరికత హరప్పా ప్రాంతంలో వున్నట్లు పరి శోధకులు నిర్ధారించారు. ఈ నాగరికతను పురావస్తు శాస్త్రజ్ఞులు ఇండో-సుమేరియా నాగరికత అని, హరప్పా నాగరికత అనీ (సర్ జాన్ మార్షల్) సరస్వతీ- సింధు నాగరికత అనీ, హక్ర-ఘగ్గర్ నాగరికత అనీ పిలు స్తారు. కనుక ఆర్యులు మన దేశంలోకి ప్రవేశించేనాటికే ఇక్కడ అనేక భాషలు ఉన్నాయి, అనేక సంస్కృతులూ ఉన్నాయి.

మన భారతీయులకు ఇప్పటిలాగా చారిత్రక దృష్టి లేకపోవడం వలన, ప్రతి విషయాన్ని, ప్రతి సంఘటననూ, తిథులూ, వారాలతో వ్రాసే అలవాటు లేకపోవడం వలన, మన భాషలు ఎప్పటివో, ఎక్కడివో మనకు తెలియవు. పాశ్చాత్య శాస్త్రవేత్తలు ఫ్రాన్సిస్ వైల్ ఎల్లిస్, రాస్మస్ క్రిస్టియన్ రాస్క్, రాబర్ట్ కాల్డ్‌వెల్, సర్ జార్జిగ్రియర్‌సన్, స్టెన్‌కోనోద్ పరిశోధనలు చేసి సంస్కృతం నుంచి దేశ భాషలు పుట్టలేదని రుజువు చేశారు. ఇది మన భాషల గొప్పతనాన్ని, పవిత్రతను మంట కలపడానికి బ్రిటీషు వారు చేసిన కుట్ర తప్ప మరొకటి కాదనే సనాతన వాదులూ ఉన్నారు. కానీ మన శాస్త్రవేత్తలు కోరాడ రామకృష్ణయ్య, గంటి జోగి సోమయాజులు, వఝల చిన సీతారామశాస్త్రి, మారేపల్లి రామ చంద్రయ్య, భద్రిరాజు కృష్ణమూర్తి, పి.ఎస్. సుబ్రహ్మణ్యం, శశికుమార్ దాస్, బి.పి మహాపాత్ర, ఎస్. అగస్త్యలింగం, పేరి భాస్కరరావు, కె.వి. సుబ్బయ్య, స్ఫూర్తిశ్రీ మొదలైన ప్రముఖులు కూడా పాశ్చాత్య శాస్త్రవేత్తల మార్గాన్ననుసరించి వారు చేసి నిగ్గు తేల్చిన పరిశోధనలు సజావైనవేనని అంగీకరించారు. కనుక సంస్కృతం వేరు, దేశ భాషలు వేరు.

శ్రీకృష్ణ దేవరాయలు "దేశ భాషలందు తెలుగు లెస్స" అన్నాడు. ఆయనకు సంస్కృతం ఒకటున్నదని తెలియదా! దాని గొప్పదనం తెలి యదా! లేక అది దేశ భాష కాదనుకున్నాడా? ఏదీ కాదు, సంస్కృతం విదేశ భాష అనే విషయం అప్పటివారికి తెలియదు. అప్పుడు సంస్కృతం దేశ భాషే అనుకునేవారు.

నిజానికి అది ఆర్యభాష, ఆర్యులు మధ్య ఆసియా నుంచి వలస వచ్చి ఇచ్చట స్థిరనివాసాలేర్పరచుకొని, రాజ్యములేని, ఆధిపత్యం చలాయించటం వల్ల, వారి భాషైన సంస్కృతం చదువుకుంటే గౌరవం దక్కుతుందని, అందలం ఎక్కవచ్చని, తలచి కొంత మంది పండితులై రాజాస్థానాలలో చోటు సంపాదించి సంస్కృతంలోనే కార్యకలాపాలు

సాగించటం, చర్చించటం చేసి వినోదించేవారు. అంతేగానీ బైటికి వచ్చిన తరువాత ఎవరి మాతృభాషలో వారు మాట్లాడుకునేవారు. ఇంకోరకంగా చెప్పాలంటే ఏ ప్రాంత వారు ఆ ప్రాంతంలో వారి వారి భాషలలో మాట్లాడుకునేవారు. ఆంధ్రం మాట్లాడేవారిని ఆంధ్రులని, కన్నడం మాట్లాడేవారిని కన్నడిగులని, మలయాళం మాట్లాడేవారిని మలయాళీలని, బెంగాలీలని, మరాఠీలని, సింధీలని, గుజరాతీలని ప్రాంతాన్నిబట్టి, భాషను బట్టి ఆయా పేర్లతో పిలిచేవారు. ప్రాకృతం మాట్లాడేవారిని ప్రాకృతులు అన్నారు. సంస్కృతం మాట్లాడేవారు ఉంటే వారిని సంస్కృతులు అనే వారు గదా! అటువంటి పద ప్రయోగం ఎక్కడా కనబడదు. రాయల కాలానికి ముందే తమిళం తప్ప మిగిలిన నాగరిక, ద్రావిడ భాషలు చాలా వరకు సంస్కృత మయములయి పొయినై. శ్రీకృష్ణ దేవరాయలు మాట్లాడిన తెలుగులో కూడా సగ భాగం సంస్కృత పదాలున్నై. ఆ భాషను ఆంధ్రము అన్నారు. అప్పటివారు సంస్కృత మిళితమైన తెలుగునే తెలుగనుకోవడం వల్ల 'దేశ భాషలందు తెలుగులెస్స' అన్నారు. అది మిగిలిన అన్ని భాషలకన్నా అందంగా ఉంది. దానికి కారణం నన్నయభట్టు.

వ్యాసభారతం సంస్కృతంలో ఉండటం వల్ల, సంస్కృత పాండిత్యం లేని తెలుగువారికది అందుబాటులో లేదని రాజరాజ నరేంద్రుడు వైదిక కుల బ్రాహ్మణుడు, అనురక్తుడు, సుపరిచితుడు ఆత్మీయుడు అయిన నన్నయభట్టును తెలుగులోకి ఆంధ్రీకరించమని కోరాడు. నన్నయ గొప్ప సంస్కృత పండితుడు. అతడు తెలుగు వాడు అవునో కాదో కూడా అనుమానమే. అటువంటి పేరుతో ఇంకో వ్యక్తి తెలుగు గడ్డపై లేక పోవడం వల్ల, ఇతని ఇంటి పేరుగానీ తల్లిదండ్రులుగానీ తెలియక పోవటం వల్ల, నన్ని అంటే కన్నడంలో మంచి, అందమైన అనే అర్థాలుండటం వల్లా, కన్నడ బ్రాహ్మణుల పేర్ల చివరలో భట్టు అనే పదం సహజంగా ఉండటం వల్లా ఇతడు కన్నడిగుడై ఉండవచ్చు.

నాకు తెలిసి ఒక్క నన్నయాఖ్యుడు కూడ
పుట్టలేదు తెలుగు పుడమి మీద
'నన్న' యన్న పదమునకు 'నన్ని' మూలంబు
కనుక నిజమతండు కన్నడిగుడు

తెలుగువాడైన పంప కన్నడ భారతం వ్రాసినట్లు, నన్నయ తెలుగు భారతం వ్రాశాడేమో. నన్నయభట్టు శ్రోత్రియ బ్రాహ్మణుడవటం వల్ల, పండితుడవటం వల్ల రాజాస్థానాలకే పరిమితమవటం వల్ల ఆయన ప్రజావాహినితో మమేకం అవటం అరుదైన విషయం. ఆ కారణం చేత ఆయనకు జానుతెనుగుతో పరిచయం తక్కువే అయి వుండవచ్చు. భారతాంధ్రీకరణం ఒక బృహత్కార్యం గనుక అప్పుడు తెలుగుభాషలో కావ్య రచనకు తగిన పదజాలం కూడా తక్కువే గనుక ఆయన ప్రాణ స్నేహితుడైన నారాయణభట్టు సహకారం అర్థించి వుండవచ్చు. మొత్తం మీద నారాయణభట్టు సహాయంతో నన్నయ భారత రచనకు పూనుకున్నాడనేది ఆయనే చెప్పిన విషయం. కాని అప్పుడు తెలుగు భాషకు వ్యాకరణం లేదు. అదీ ఆయనే తయారు చేసుకున్నాడు. నన్నయ సంస్కృత పండితుడు గనుక సంస్కృతమూ, తెలుగూ కలిపితే రచన సుగమమవుతుందని భావించి ఒక మిశ్రమ భాషను తయారుచేసుకొని ఉండవచ్చు. సాధారణంగా సంబంధం లేని జాతుల మధ్య సంకరణం నిలవదు. సజాతుల మధ్య సంకరణం మాత్రమే నిలుస్తుంది. శాస్త్రజ్ఞుడు పులిని, సింహాన్ని కలిపి ఒక సంకరజాతిని, బంగాళదుంప, రామములగ (టమాటా)ను కలిపి ఒక సంకరజాతిని తయారుచేసినా అవి నిలువలేదు. కానీ ఆశ్చర్యకరంగా నన్నయ తయారు చేసింది విజాతి సంకరమైనా అది శాశ్వతమైపోయింది. పాఠకుల కానందాన్ని కలిగించింది. తెలుగు భాషకు అందాన్ని, పరిపుష్టిని తెచ్చింది. ఆయన సంస్కృత పండితుడు గనుక ఆ భాషపై తనకున్న మక్కువను పురస్కరించుకొని అప్పటి పండితుల మెప్పుకోసం తన రచనను పద్యంతో కాక శ్లోకంతో ప్రారంభించాడు.

శ్రీ వాణీ గిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే
లోకానాం స్థితి మావహన్త్యవిహతాం స్త్రీ పుంస యోగోద్భవం
తే వేదత్రయ మూర్తయ స్త్రిపురుషా స్సంపూజితావ స్సురై
ర్భూయాసః పురుషోత్త మాంబుజభవ శ్రీకంధరాః శ్రేయసే

నిజంగా నన్నయభట్టు వ్రాసిన ఈ శ్లోకం ఆంధ్రభారతానికి తిలకం వంటిది.

వేదాలు సత్వగుణం, రజోగుణం, తమోగుణాలనే విష్ణువుగా, బ్రహ్మగా, శివునిగా రూపకల్పన చేశాయి. వీరికి ఆయా కార్యాలలో సహకారాన్ని అందించే శక్తి స్వరూపాలనే స్త్రీమూర్తులుగా భావించి లక్ష్మీ, సరస్వతి, పార్వతి అనే పేర్లు పెట్టడం జరిగింది. సృష్టి, స్థితి, లయములకు వీరే కారకులు. విశ్వంలో ఎక్కడ ఏది జరిగినా దానికి కారణం ఈ మూడు జంటలే. అటువంటి వీరు మీ అందరికి పరమ సుఖాన్ని ప్రసాదించుగాక అని ఈ శ్లోకానికి అర్థం. భారతం అంటే పంచమవేదం గనుక, అది సంస్కృతం లోనే వున్నది గనుక, కృత్యాది మంగళ శ్లోకాన్ని సంస్కృతం లోనే రచించటం సమంజసంగానే ఉన్నది. మొత్తంమీద రెండున్నర పర్వాల ఆంధ్రీకరణం తర్వాత భారత రచన ఆగిపోయింది. కారణం ఇతమిత్థంగా తెలియదు. ఈ పనికి నడుం కట్టి నన్నయభట్టు పండితులను, పామరులను కూడా మెప్పించ గలిగాడు. ఒక గొప్ప సాహిత్య మార్గాన్ని సృజించాడు. ఒక శైలీ సంప్రదాయానికి శ్రీకారం చుట్టి మార్గ కవితకు మార్గదర్శకుడయినాడు, అందుకే ఆయన్ను ఆదికవి అన్నారు.

ఈయన వాడిన మిశ్రభాష మూడు పూలు, ఆరు కాయలుగా అభివృద్ధి చెందటంవల్ల, దానికి సంస్కృత భాషతో ఎంతో సామ్యం ఉండటం వల్ల "తల్లి సంస్కృతంబె ఎల్లభాషలకును" అని మూలఘటిక కేతన (ఆంధ్రభాషా భూషణము) "జనని సంస్కృతంబు సర్వ భాషలకును" అని వినుకొండ వల్లభామాత్యుడు (క్రీడాభిరామము) పద్యాలు వ్రాశారు. కాని అది నిజం కాదు. తెలుగు వేరు, సంస్కృతం వేరు. ఈ రెండు భాషలకు ఎటువంటి సంబంధం లేదు. తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం, తుళు, కొడగు మొదలైన 27 భాషలు మూల ద్రావిడ భాష నుంచి వచ్చినై. సంస్కృతానికి, తెలుగుకు ప్రస్తుతం ఎన్ని పోలికలున్నా అవి మౌలికంగా వేరువేరు మూలాల నుంచి వచ్చినవి. ఆర్యులు, ద్రావిడులు కలిసిమెలిసి జీవిచటం వల్ల (పెళ్ళిళ్ళు కూడ చేసుకున్నారు) వారి భాషలు కూడ కలిసిపోయినై. ఆర్యులు ఆధిపత్యం చెలాయించటం వల్ల వారి భాషా ప్రభావం మన భాషలపై పడింది. అందువల్లనే తెలుగు భాషలో 50% సంస్కృత పదాలున్నై. అంతేగాని తెలుగు సంస్కృతం నుంచి పుట్టటం వల్ల కాదు.

సంస్కృతమూ, తెలుగూ రెండూ సంబంధంలేని భాషలుగనుక వాటి స్వభావాలుకూడా వేరువేరుగా వుంటై. అవి ఏమిటో చూద్దాం.

భాషా శాస్త్రజ్ఞులు ప్రపంచంలో వున్న మొత్తం భాషలను 5000

అని లెక్కించి వాటిని 10 విభాగాలుగా (కుటుంబాలు) విభజించారు. అందులో మొదటిది ఇండో యూరోపియన్ విభాగం. సంస్కృతం ఈ విభాగానికి చెందుతుంది. చివరది ద్రావిడ భాషా విభాగం. తెలుగు ఈ విభాగానికి చెందుతుంది. ఆర్యులు మన దేశంలోనికి రాక పూర్వం 1000 సం.ల క్రితమే అనగా క్రీ.పూ. 3000 సంవత్సరం (ఎం.ఎస్. ఆండ్రొనోవ్) మన దేశంలో చాల భాషలుండేవి. అందులో తెలుగు ఒక్కటి. మహెంజొదారొ– హరప్పా నాగరికతలో కనుగొన్న చిత్ర లిపి తెలుగు లిపిని పోలివున్నదని శాస్త్రవేత్తలు తేల్చారు.

1. మొదటగా ఈ రెండు భాషలకు **లిపిభేదం** కొట్టవచ్చినట్టు కనపడు తుంది. సంస్కృత లిపి జిలుగుగా వుంటుంది. తెలుగు లిపి గుండ్రంగా, అందంగా వుంటుంది.

2. ద్రవిడ భాషలలో **అర్థ భేదం సూచించటానికి** ఒక పదంపై మరొక పదం చేరుతుంది. తెలుగులో కొను, తెచ్చు అనేవి రెండూ విడివిడి పదాలు. కొనితెచ్చు, కను+కట్టు= కనికట్టు, అందు+ఇచ్చు=అందిచ్చు; పరుగు+ఎత్తు=పరుగెత్తు మొ॥వి. తఱి=సమయం, కొను=గ్రహించు కాని తఱిగొను అంటే యత్నించు.

3. ద్రవిడ భాషలలో **ద్విత్వాక్షరాలు ఎక్కువ. సంయుక్తాక్షరాలు** తక్కువ. ఉ॥కట్టు, ఇచ్చు, ఎత్తు, అన్న, అయ్య మొ॥.

**4.** తెలుగు, కన్నడం లాంటి ద్రావిడ భాషలు మొదట్లో హలంతాలే, కాని **అజంత పరిణామం** జరిగి పూర్తిగా మారిపోయినై. తమిళం, మలయాళంలో ఇంకా అక్కడక్కడా హలంతాలున్నై. కాని సంస్కృతంతో సహా అన్ని ఆర్యభాషలు ఇప్పటికీ హలంతాలే. ఇది తెలుగు, సంస్కృ తానికి ఉన్న ముఖ్య భేదాల్లో ఒకటి.

**5.** తెలుగులో **పరుష, సరళాలకు ముందే బిందువుంటుంది.** ఉ॥ వంకర, బెంగ, మంచి, గంప మొ॥. కంసాలిలో 'స' కారం ముందు బిందువుండటం ఉచ్చారణ వేగం వల్ల ఏర్పడ్డది. అసలు రూపం కమ సాలి. తెలుగులో దీర్ఘాక్షరం తర్వాత సున్నా ఉండదు. గోంగూర, ఆంబోతు, రాంగానే అన్నవి ఉచ్చారణ వేగం వల్ల ఏర్పడ్డవే. కాంతి, శాంతి అన్నవి సంస్కృత పదాలు, సాంబార్ తమిళ పదం.

**6. సంధుల విషయంలో** చాలా వైవిధ్యం కనబడుతుంది. యడాగమం ద్రావిడ భాషల సొంతం. ఆర్య భాషైన సంస్కృతంలో సవర్ణ, గుణ, వృద్ధి, అనునాసిక, జస్త్వ సంధులుంటై. ఇవి ద్రావిడ భాషల్లో లేవు. తెలుగులో ఉకార, అకార, ఇకార సంధులు,ఆమ్రేడిత, గసడదవాదేశ, సరళాదేశ సంధులు, టుగాగమ, నుగాగమ, రుగాగమ సంధులు, ప్రాతాది, త్రిక సంధులుంటై. యడా గమం సంస్కృతంలో లేదు. ఉ॥ మా+ఇల్లు= మాయిల్లు, మా+అమ్మ=మాయమ్మ, మా+ఊరు=మాయూరు. ఉచ్చారణలో మావూరు అవుతుంది.

**7. ధాతువుల విషయానికి** వస్తే ద్రావిడ భాషల్లో అవి నామవాచకాలుగాను, క్రియావాచకాలుగాను ఉపయోగ పడతై.

ఉ॥పండు పండెను, కట్టు కట్టెను, పలుకు పలికెను.

**8. లింగ భేదం ద్రావిడ భాషల్లో అర్థాన్ని** బట్టి వుంటుంది. సంస్కృతంలో శబ్దాన్ని బట్టి వుంటుంది. తొద, బ్రాహుయి భాషల్లో లింగ భేదం లేదు.

సంస్కృతంలో 'కళత్రం' స్త్రీ అయినా నపుంసకలింగం. 'లతా' జడపదార్థమయినా స్త్రీ లింగం. 'వృక్షః' జడపదార్థమయినా పుంలింగం. తెలుగులో అతడు పుంలింగం, ఆమె స్త్రీలింగం, మగడు పుంలింగం, మగువ స్త్రీలింగం, పుంజు (పుం) పెట్ట (స్త్రీ) గుడ్డు (నపుం)

**9. వచనం విషయంలో భేదం** కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. గ్రీకు, సంస్కృత భాషల్లో ఏకవచనం, ద్వివచనం, బహువచనం అని వచనాలు మూడు రకాలు. ద్రావిడ భాషల్లో ఏకవచనం, బహువచనం రెండే వుంటై.

**10. విభక్తి ప్రణాళిక** కూడ రెండు భాషలకు భిన్నంగా వుంటుంది. సంస్కృత విభక్తులకు విడిగా వున్నప్పుడు అర్థాలుండవు. తెలుగులో కు,న,డు, ము, వు, లు తప్ప మిగిలినవి విడిగా వున్నప్పుడు అర్థాలుంటై. కంటె, కొఱకు, వలన మొ॥వి.

**11. వ్యతిరేకార్థాన్ని తెలియజేయటానికి** సంస్కృతంలో 'న' అనే ప్రత్యేక అక్షరాన్ని వాడతారు. ఉ॥ న+కరోతి. ద్రావిడ భాషల్లో ఇట్లా వుండదు. వస్తాను×రాను. అది పుస్తకం×అది పుస్తకం కాదు. సంస్కృ తంలో 'న్యాయం' వ్యతిరేకం చెప్పాలంటే అన్యాయం అనవచ్చు. 'సత్యం' వ్యతిరేకం అసత్యం. తెలుగులో ఇట్లా కుదరదు. నిజం వ్యతిరేకం అనిజం అనలేము. కల్ల అనాలి.

**12. ఔపవిభక్తికాల** విషయంలో ద్రావిడ భాషల్లో ప్రత్యేక లక్షణం కనబడుతుంది. ఇ–టి–తి లాంటివి చేరతై. కాలికి, తాటిని, నూతిలో, ఇట్లాంటివి సంస్కృతంలో లేవు.

**13.** ద్రావిడ భాషల్లో **విశేషణాలకు లింగ, వచన భేదం లేదు.** నామవాచకం యొక్క లింగ, వచనము బట్టి మార్పు చెందవు.

ఉ॥ కొత్త కుర్చీ ; కొత్త కుర్చీలు.

మంచి బాలుడు; మంచి బాలురు.

లింగ, వచన విభక్తులననుసరించి సంస్కృతంలో విశేషణాలుంటై. సుందరః పురుషః సుందరీ స్త్రీ; సుందరం పుస్తకం.

**14. ఎక్కువ తక్కువలు చెప్పవలసివచ్చినపుడు** సంస్కృతంలో తర, తమ ప్రత్యయాలు విశేషణానికి చేరతై.

ఉ॥ రామః సుందరః రామః లక్ష్మణాత్ సుందర తరః రామః నృషు సుందరతమః

ద్రావిడ భాషల్లో ఈ విధంగా చెప్పటానికి ప్రత్యేక ప్రత్యయాలు లేవు. విభక్తి ప్రత్యయాన్నే వాడతారు. దానికంటె ఇది పెద్దది అంటారు.



15. ద్రావిడ భాషల్లో **సంఖ్యావాచక విషయంలో** ఒక విశిష్ట లక్షణం సుస్పష్టంగా కనపడుతుంది. సంఖ్యావాచకం చెప్పేటప్పుడు మొదట పదులు చెప్పి తరువాత ఒకట్లు చెపుతారు.

ఉ॥ పదకొండు, పన్నెండు, డెబ్బది ఏడు, తొంభై నాలుగు, సంస్కృతంలో ఇట్లా కాదు ఏకాదశ, ద్వాదశ, అష్టాదశ మొ॥ ఒక విశేషం ఏమిటంటే తెలుగులో ఒకటి నుంచి పది వరకు, తర్వాత పది చొప్పున నూరు వరకు అంకెలున్నై. మిగిలినవి సంస్కృతం నుంచి అరువు తెచ్చుకున్నవే. వంద అనే పదం ఎట్లా పుట్టిందో తెలియదని భాషాశాస్త్ర గ్రంథాలలో వున్నది. సహస్ర అనే సంస్కృత పదానికి సమానార్థకంగా వాడే 'వేయి' కూడ తెలుగుమాట కాదంటారు. సంస్కృతమూ కాదు. మిగిలిన ద్రావిడ భాషల్లోనూ లేదు. ఇటువంటి వాటిని స్వతంత్ర శబ్దాలంటారు. కాని శబ్దరత్నాకరంలో ఈ రెండు శబ్దాలు దేశ్య పదాలే అని వున్నది. ఇంకొక విశేషం సహస్రం అనే పదం సంస్కృతంలో మనం అనుకున్నట్లు పది నూర్లు కాక అనేకం అనే అర్థంలో వాడతారు.

**16. వాక్య నిర్మాణం–**

ద్రావిడ భాషల్లోని వాక్య నిర్మాణంలో కర్మణి ప్రయోగం వుండదు. ఇది ఆర్య భాషలకు సహజం. సంస్కృత భాషకు భిన్నమైన వాక్యనిర్మాణం తెలుగులో కనిపిస్తుంది. ఆమాటకు వస్తే ద్రావిడ భాలన్నింటిలోనూ కర్త, కర్మ, క్రియ అనే వరుస క్రమంలో వాక్యరచన వుంటుంది. కర్తకు విశేషణం వుంటే వుండవచ్చు. వాక్యాంతంలో క్రియ వుంటుంది. ఉదా॥ అతడు చెల్లిని కొట్టాడు. అతడు పండును తిన్నాడు. మల్లి చెట్టును తాకాదు. సంస్కృతంలో ఈ నియమం లేదు. ఉదా॥ గచ్ఛతి వనం రామః లేక రామః గచ్ఛతి వనం. తెలుగులో కూడా అరటి పండు నాతడారగించె అని వుంటుంది. కాని అది పద్యంలో, 'కనియెన్ గోమల నీలమేఘ సుభగాకారున్' భారతంలోని ఎఱ్ఱాప్రగడ పద్యం. ఇది సంస్కృత మిళితమైనది. అందువల్ల దాని లక్షణం వచ్చింది. నా చేత పాఠం చెప్పబడింది అనే వాక్య ప్రయోగం తెలుగులో వుండదు. నేను పాఠం చెప్పాను అంటాం. నేను బుట్టను పక్కకు నెట్టాను అంటాం. నా చేత అన్నం తినబడింది అనం. నేను అన్నం తిన్నాననే అంటాం. ఆర్య భాషల్లో ఎవడు బాగా వ్రాశాడో వాడు కృతార్థుడౌతాడు అంటారు. అదే ద్రావిడ భాషల్లో బాగా వ్రాసినవాడు కృతార్థుడౌతాడు అంటారు. ఎవడు పాపం చేస్తాడో వాడు అనుభవిస్తాడు. ఆర్యభాష పాపం చేసిన వాడు అనుభవిస్తాడు. ద్రావిడ భాష దొంగిలించబడిన ఆవును గల బ్రాహ్మణుడు గంట కొట్టాడు. ఇట్లాంటి వాక్య నిర్మాణం ద్రావిడ భాషల్లో వుండదు. The woman who is writing there is my sister ఇంగ్లీషు కూడా ఆర్యభాషా కుటుంబానికి చెందినదేగనుక వాక్య నిర్మాణం సంస్కృతాన్ని పోలి వుంటుంది.

**17. బంధుత్వాలు :–**

అన్న, తమ్ముడు, అక్క, చెల్లెలు, తనకన్నా పెద్ద, చిన్న తారతమ్యాన్ని తెలిపే పదాలు తెలుగులో వున్నవి. సంస్కృతంలో అగ్రజుడు, అనుజుడు అనాలి. అయితే తెలుగులో తాత అంటే ఎవరో స్పష్టంగా తెలియదు. సంస్కృతంలో మాతామహుడు. పితామహుడు అనే ప్రత్యేకపదాలున్నై. అట్లాగే దౌహిత్రుడు, పౌత్రుడు. తెలుగులో ఇద్దరూ మనుమలే.

18. సంయుక్తాక్షరం పదాదిన వుండటం సంస్కృత లక్షణం. స్మేరము, స్థానము, శ్లోకము, జ్యోత్స్న మొ॥ తెలుగులో ఇట్లా వుండవు. కొన్ని పదాలు మాత్రం క్రొవ్వు, మ్రాను, ప్రోలు లాంటివి వర్ణ వ్యత్యాసం వలన ఏర్పడినవి.

19. మహద్విశేషణాలు– పురుషుణ్ణి బోధించే పదాలను మహత్తులని, తక్కిన వాటిని అమహత్తులని అంటారు. సంస్కృతంలో పుంలింగం అయివుండీ పురుషుణ్ణి బోధించని మాట అయితే అది అమహత్తే అవుతుంది. సంస్కృతంలో నపుంసకలింగమయినా పురుషుణ్ణి బోధించేమాట తెలుగులో మహత్తు అవుతుంది. సంస్కృతం నుండి తెలుగులోకి వచ్చిన పురుషవాచక శబ్దాల చివర 'డు' ప్రత్యయం చేరుతుంది. ఇది అకారాంత శబ్దాలలో ఉదాహరణకు 'రామ'కు 'డు' చేరి రామలో మకారం మీది అత్వం ఉత్వం అవటంవల్ల రాముడు ఏర్పడుతుంది. కృష్ణుడు, భీముడు కూడా ఇంతే. ఇకారాంత శబ్దాలు మాత్రం అట్లాగే వుంటవి. హరి, గిరి లాంటివి. దీర్ఘాంతాలు మాత్రం హ్రస్వాంతాలౌతై. రామా– రామ, గౌరీ, గౌరి, వనితా– వనిత మొదలైనవి. సంస్కృతంలో నపుంసకలింగ శబ్దాలు సాధారణంగా మకారాంతాలుగా వుంటై, ఈ 'మ' కారము లోపించి తెలుగులో 'ము' ప్రత్యయం చేరుతుంది. నపుంసకలింగ శబ్దం కాకపోయినా తెలుగులో అమహత్తు అవుతే (పురుషేతరమయినవి) చివర 'ము' చేరుతుంది. ఖడ్గః అనేది సంస్కృతంలో పుంలింగం. తెలుగులో అమహత్తు, అందుకే అది తెలుగులో ఖడ్గము అయింది. ఇక వీటిమీది విశేషణాలయితే అమహత్తులకు రెండు చెట్లు, మూడు పక్షులు అనాలి. మహత్తు లయితే ఇద్దరు పిల్లలు, ముగ్గురు పురుషులు అని వ్రాయాలి. వ్యవహారంలో మహద్విశేషణం చెప్పేట్లయితే సంఖ్యా వాచకానికి 'మంది' కలుపుతాము. తొమ్మిదిమంది, పదిమంది లాంటివి. ప్రాచీన కాలంలో 'గురు' వాడేవారు. ముగ్గురు, నలుగురు, తొమ్మండుగురు, 'గురు'కు పూర్వ రూపం 'వురు' ముప్వురు, నలువురు మొదలైనవి. ఈ విధమైన విశేషణాల సరళి సంస్కృతంలో లేదు.

20. సంస్కృతంలో ఉపసర్గలుంటై. ఒక ధాతువు మీద వివిధ ఉపసర్గలు చేరటం వల్ల వేరువేరు మాటలేర్పడతై. ఈ భాషలో మొత్తం ఇరువది రెండు ఉపసర్గలున్నై. ప్ర అనేది ఒక ఉపసర్గ. దీనితో ప్రవాదం, ప్రయోగం, ప్రకంపనం లాంటి పదాలు ఏర్పడతై. ప్ర అంటే మిక్కిలి అని అర్థం. 'హృ' అనే ధాతువు మీద వివిధ ఉపసర్గలు చేరటం వల్ల ఎన్నో మాటలు ఏర్పడ్డై. సంహారం, విహారం, ఆహారం, ప్రహారం, పరిహారం మొదలైనవి. ఈ విధంగా పరా, అప, అను, దుర్, దుస్, వి, ఉత్ అనేవి అన్నీ ఉపసర్గలే. వీటితో ఎన్ని పదాలైనా చెప్పవచ్చు. 'వి'తో కొన్ని పదాలు చూద్దాం. విజ్ఞానం (బ్రహ్మజ్ఞానం. లౌకిక జ్ఞానం అనికూడా) వియోగం (ఎడబాటు) విక్రయం (అమ్మటం) విపణి (మార్కెట్). వినిర్మించు, విరచించు అన్నప్పుడు అధికమనీ, విరహం, విక్రయం, వితంతువు అన్నప్పుడు వ్యతిరేకార్థంలో 'వి'ని వాడతారు. క్రయం అంటే కొనటం. విక్రయం అంటే అమ్మటం. ఇంకో ఉపసర్గ ఉత్. దీనితో ఏర్పడ్డ పదం ఉత్తరం, అంటే ఉత్తర దిక్కని, సమాధానం అని కూడా. ఈ ఉపసర్గతోనే ఏర్పడ్డ ఇంకో మాట ఉద్ధృతం. కొన్ని నిఘంటువులలో ఉధృతం, ఉద్ధృతానికి రూపాంతరంగా చూపించారు. ఉద్ధృతం అంటే పైకెత్తబడినది, చేదబడినది, అనుభవించి విడువబడినది అని. వరద చాలా ఉధృతంగా వున్నది అన్నా ఒప్పేనని తెలుగు ఎకాడమీ వారి నిఘంటువులో వున్నది. కాని కొన్ని నిఘంటువులలో (శబ్దరత్నాకరము) ఈ అర్థం ఇవ్వలేదు. ఇది తప్పని కొన్ని పుస్తకాలలో వున్నది. (డా. చంద్రశేఖరరెడ్డి 'మన భాష') ఇట్లా తప్పుగా ఉపయోగించే పదాలు తెలుగులో చాలా వున్నై. ఈ వాక్యం మహా భారతోద్ధృతం అన్నప్పుడు

అక్కడి నుంచి తీసుకున్నది. చేయబడింది అని అర్థం, ఇంకో పదం ఉద్దేశం. కానీ చాలామంది (తెలియని తెలుగువారు) ఉద్దేశ్యం అని వాడుతుంటారు. ఉద్దేశం అంటే లక్ష్యం. ఉద్దేశ్యం అంటే ఆ అభిప్రాయానికి విషయమైన వస్తువు. ఇది సంస్కృతం చదువుకోకుండా సంస్కృత పదాలు ఉపయోగించటం వల్ల జరుగుతున్నది. ఉచిత అంటే తగిన అని అర్థం కాని ఫ్రీ అనే అర్థంలో వాడుతున్నాము. ఊరక అనే అర్థం కూడా కొన్ని నిఘంటువులలో వున్నది. ఆగ్రహం అంటే పట్టుదల అని అసలర్థం కాని కోపం అనుకుంటున్నాము. అనుమానం అంటే ఊహ కాని శంక అనే అర్థంలో వాడుతున్నాము. ఉద్యోగం అంటే ప్రయత్నం కాని కొలువు చేయు లేక ఎక్కడన్నా డబ్బుకు సేవ చేయు అని అనుకుంటున్నాము. అభ్యంతరం అంటే లోపలి భాగం. కాని 'అబ్జెక్షన్' అనే అర్థంలో వాడుతున్నాము. కృష్ణ శబ్దానికి దున్నిన భూమి అని అర్థం. ప్రకృష్టం అంటే బాగా దున్నిన భూమి అన్నమాట. కాని తెలుగులో శ్రేష్ఠమైన అనే అర్థంలో వాడుతున్నాము. ఇంతకూ తెలుగులో ఉపసర్గలు లేక పోవటం వల్ల అవి కలిగిన పదాలను తప్పుగానో, అర్థ చ్ఛాయా భేదంతోనో వాడటం జరుగుతున్నది. కానీ ఇవి చలామణీలో ఉండటమే ఆశ్చర్యకరం. ఉపసర్గల వల్ల సంస్కృత భాషకు ఎంతో ప్రయోజనం చేకూరుతున్నది.'సం' అనే ఉపసర్గతో సంకటం, సంకుచితం, సంకలనం, సంగీతం, సందర్భం, సంయుక్తం, సంస్కృతం, సంతోషం, సమ్మతం ఇట్లా ఎన్నో పదాలు తయారౌతై, 'అను' అనే ఉపసర్గతో అనుజుడు, అనువాదం, అనుకంప, అనుకూలం, అనుప్రాస, అనునాసిక, అనుక్రమణిక, అనుశ్రుతం మొదలైనవి. 'అవ' అనే ఉపసర్గతో అవతంసం (తసి అంటే అలంకారం), అవధానం, అవక్షేపం, అవగతం, అవకాశం, అవగ్రహం, అవరోధం లాంటివి ఎన్నో. దుర్, దుస్‌లు కూడ ఉపసర్గలే. దుర్యోధనుడు, దుశ్శాసనుడు ఇట్లాంటి పేర్లు ఇప్పుడు ఎవ్వరూ పెట్టుకోరు. కాని వీటికి మంచి అర్థాలే వున్నై. ఆయోధనము అంటే యుద్ధము. దుర్యోధనుడు అంటే యుద్ధము చేయశక్యము కానివాడు అని. దుశ్శాసనుడు అంటే శాసింప వీలులేనివాడు అని. ఢిల్లీ నిర్భయ దురంతం అందరికీ గుర్తు వుండేవుంటుంది. దురంతం అంటే చెడుగా అంతమయినది అని. దుర్దినం అంటే చెడ్డరోజు, మబ్బు కమ్మినరోజు అని కూడా, దురోదరం అంటే కడుపునిండా చెడే అనుకుంటాం. కాని జూదం అని అర్థం. దుర్ మిత్రుడు అంటే శత్రువనే అర్థం. దుర్గతి అంటే దారిద్ర్యం అని, దౌర్భాగ్యం అని రెండర్థాలు, ఉపసర్గల వల్ల ఏర్పడే పదాలకు అంతులేదని చెప్పటానికే ఇవన్నీ చెప్పాను. కాని కొన్ని పదాలకు ప్రత్యక్షార్థం ఒకటి వుంటే పరోక్షార్థం ఇంకొకటి కూడ కనపడుతున్నది. అక్కడ సంస్కృత భాష రానివారికి గందరగోళంగా వుంటుంది. విచారం అనే పదం వున్నదనుకోండి. దుఃఖం అని అర్థం. పరిశీలించటం అని కూడ. గతంలో కూడ ఇట్లాంటివి చాల చూశాం. కారణం 'చెర' అనే పదానికి రెండర్థాలు వుండటమేకాని 'వి' అనే ఉపసర్గ చేర్చటం వల్ల కాదు. చర అంటే గతి అనీ, చెర అంటే సంశయం అని రెండర్థాలు. చివరగా ఒక్క విషయం చెప్పి ఈ ఉపశీర్షిక ముగిస్తాను. విపణి అనే పదం చాల తమాషా అయినది. పణం అంటే డబ్బు అని అర్థం. అరవంలో 'పణ మెన్రాల్ పిణముం వాయితెరక్కుం' అని సామెత. డబ్బంటే శవం కూడా నోరు తెరుస్తుందని దీని అర్థం. పణం అంటే వ్యవహారం అని అసలర్థం. కొనుగోలు అనే వ్యవహారంలో డబ్బు వినియోగం వుంటుంది గనుక విపణి అయిందేమో ననిపిస్తుంది. వివాహం అనే ఇంకో పదం వున్నది. దీనికి పెళ్ళి అని అర్థం, 'వి' ఉపసర్గ, సంస్కృతంలో వహి అనే ధాతువుకు పొందిక అని అర్థం. అందువల్ల వివాహం అంటే విశిష్ట మయిన పొందిక అనవచ్చు. కాని ప్రవాహము, వాహకము, వాహనము అనే పదాలు చూచినప్పుడు ఒకచోట నుంచి మరొక చోటికిపోవు అనే అర్థం స్ఫురిస్తుంది. ఆడపిల్ల పుట్టింటి నుంచి అత్తింటికి పోతుంది గనుక కూడ వివాహం అని వుంటారు. స్వాగతం (సు+ఆగతం) సుస్వాగతం అని కూడా వాడుతూ వుంటారు. కాని ఒకేపదం మీద రెండు ఉపసర్గలు వాడటం ఎక్కడా లేదు.

## 21. సంస్కృతంలో అవగ్రహాలుంటై

సంధి కలిసినచోట్ల అ, ఆ లు లోపించినప్పుడు వాటి ఉనికిని చాటటానికి అవగ్రహం లేక అవగ్రహాలు ఉపయోగపడతై. సంస్కృత భాషకు ఇది అత్యంత కీలకం. కారణం అనేక పదాలకు ముందు 'అ' చేరిస్తే వ్యతిరేకార్థం వస్తుంది. అందువల్ల పదం ముందు 'అ' వున్నదా? లేదా తెలియాలి. లోపించినది 'అ' అయితే ఒక అవగ్రహం 'ఆ' అయితే రెండు అవగ్రహాలు వరుసగా లుప్తమైన స్థానాలలో వుంచుతారు. ఉదాహరణకు విష్ణు సహస్ర నామాలలో 'వేదస్వాఙ్గో జితఃకృష్ణో' అన్నచోట వేదాః స్వాంగః (స్వ+అంగః) అజితః అని విడదీసుకోవాలి. అజితఃలో 'అ' లోపించింది గనుక దాని స్థానంలో ఒక అవగ్రహం వాడారు. 'భగవాన్ భగహాZ నందీ వనమాలీ హలాయుధః' అన్నచోట భగవాన్, భగహా, ఆనందీ అని చదువుకోవాలి. ఆనందీలో 'ఆ' అక్షరం సంధి వల్ల లుప్తమైంది గనుక రెండు అవగ్రహాలు వాడవలసి వచ్చింది. ఆదిత్య హృదయంలో కూడా 'అగ్నిగర్భోZ దితేః పుత్రః' అన్నచోట అగ్నిగర్భః +అదితే పుత్రః అని పద విభజన. దితే పుత్రః అని చదువుకుంటే దితి యొక్క కుమారుడు రాక్షసుడు అని అర్థం వస్తుంది. అదితే పుత్రః అంటే అదితి యొక్క కుమారుడు సూర్యుడు (దేవత) అని అర్థం. తెలుగులో అవగ్రహాలు లేవు. అరసున్నలుండేవి. ప్రథమా విభక్తి ప్రత్యయం 'డు' చేర్చినప్పుడు, దృతప్రకృతికము మీది పరుషములకు సరళములు వచ్చినప్పుడు, క్రియా రూపం నామవాచకంగా మారినప్పుడు అరసున్నలు వాడేవారు. రాముఁడు, కృష్ణుఁడు, పూచెఁగలువలు, చిగురుఁగైదువు, సింహపుఁగోదమ, సొగసుఁదనము, కాయు–కాఁత, నేయి–నేఁత లాంటివి, కాని ఇప్పుడు గ్రంథాలలో తప్ప విడిగా అవగ్రహాలు వాడటం లేదు, విద్యాలయం అనే వ్రాస్తున్నాము, విద్యా.... లయమ్ అని వ్రాయటం లేదు. తెలుగులో అరసున్నలు, ఋఋూలు, బండిఱ లు తీసివేశారు, ఇప్పుడెవరూ వాడటం లేదు.

## 22. మహా ప్రాణాలు, అల్ప ప్రాణాలు

తెలుగులో మహాప్రాణాలు లేవు. అనగా ఒత్తక్షరాలు లేవు. సంస్కృత మహాప్రాణాన్ని తెలుగులోనికి మార్చినప్పుడు అల్పప్రాణమవుతుంది. ఖ–క గ, ఘ–గ గ, ఛ–చ గ, ఝ–జ గ అన్నమాట. ఖండ–కండగా, కంధరం–కందరంగా, గ్రంథి–కంతిగా, గృధ–గద్దగా, ఘంట–గంటగా, ఘూకం–గూబగా, భక్తి–బత్తిగా, పక్షి–పక్కిగా మారినవి. కాని అన్నిటికీ ఇట్లా కుదరదు. ఖరము అంటే గాడిద. తెలుగులో ఖరము, కరము కావాలి. కాని తెలుగులో కరము అంటే మిక్కిలి అని అర్థం. అందువల్ల ఖరము కరము కాలేదు. శృంఖలలో శకారము, ఖకారము రెండూ తెలుగులో లేవు. అందువల్ల అది సంకెలగా మారింది, కాష్ఠ–కట్టెగా, లాక్ష–లక్కగా మారినవి. ఇది సంస్కృత పదాలు తెలుగులోకి వచ్చిన ఒక పద్ధతి. కొందరు సంస్కృత పదాన్ని యథాతథంగా వాడటం

ఇష్టంలేక ఒత్తులు తీసేసి వ్రాస్తున్నారు. కాని అర్థం మారే ప్రమాదం వున్నది. సుఖము, సుకము అయితే పరవాలేదుగాని ప్రధానం-ప్రదానం అయితే ప్రమాదమే. ఎందుకంటే ప్రధానం అంటే ముఖ్యం అని. ప్రదానం అంటే ఇవ్వటం అని. ఆదాన ప్రదానాలంటారు. పుచ్చుకోటం, ఇచ్చుకోటం అని అర్థం. ప్రభలను ప్రబలగా వ్రాస్తే అర్థం మారిపోతుంది. ప్రభల అంటే వెలుగుల, ప్రబల అంటే బలమైన అని. అట్లాగే విధిత అని వ్రాయవలసినచోట విదిత అని వ్రాస్తే కష్టమే. విధిత అంటే విధింపబడినది. విదిత అంటే తెలిసినవి. అట్లాగే రోధనను రోదనగా వ్రాయకూడదు. రోధన అంటే అడ్డుపెట్టు, నిరోధించు, రోదన అంటే ఏడుపు, ధవుడుకు దౌడు వ్రాసినా అర్థం మారిపోతుంది. ఇంకోరకం అల్ప ప్రాణాలకు తెలియక మహాప్రాణాలు వ్రాస్తూవుంటారు. వదాన్యుడు అనే పదాన్ని వధాన్యుడుగా, అంటే దాతృత్యము కలవాడని, వధాన్యుడు- వధ అంటే చంపటం గనుక (వధకుడు) హత్యలు చేసేవాడు అనుకో వచ్చు. శాకము అంటే కూర. శాఖ అంటే కొమ్మ, ఒక స్థలములో ఇల్లు కట్టదలచుకుంటే మంచి ముహూర్తంలో ఆ ఇంటి ఈశాన్య మూలలో (ఆంధ్రదేశంలో) పునాదిలో శంకువును వుంచుతారు. శంకువు అంటే క్రింద చదరంగా వుండి పైకి పోయిన కొద్దీ కొనదేలిన ఒక చెక్క వస్తువు. కిరీటాకృతి అన్నమాట. ఈ ఉత్సవాన్ని శంకుస్థాపన అంటారు. శంఖానికి ఏమీ సంబంధం లేదు. ఈ గొడవంతా సంస్కృత పదాలను తెలుగులోకి మార్చుకోవటం వల్ల వచ్చినదే. ఆర్యులు, ద్రావిడులు కలిసి బ్రతుకుతున్నపుడు ఇటువంటివి తప్పవు. కనుక కష్టపడి తెలుసుకోవటం తప్ప వేరే మార్గం లేదు.

**23. తెలుగులో ఐ,ఔలు ప్రత్యేక వర్ణాలు కావు**

అంటే వాటిని అట్లాగే వ్రాయాలని లేదు. ఐదును అయిదు అన వచ్చు. ఐరేనిని అయిరేని అనవచ్చు. అసలు రూపం అహిరేని- అహిరేడు నుంచి వచ్చింది. నాగరాజు అని అర్థం. అహిరేణి కుండ- అయిరేని యై ఐరేని అయింది. ఐతే ను అయితే అని, కై ని కయి అని, పైకం ను పయికం అనీ, ఔను ను అవును అని, కౌను ను కవును అని, చౌకగా ను చవుకగా, తౌడు ను తవుడుగా వ్రాయవచ్చు. ఇట్లా సంస్కృత పదాలతో కుదరదు. కారణం ఆ భాషలో మొదట వున్న అచ్చుకు వృద్ధి వస్తుంది. అంటే ఇ, ఈ లు ఐ అవుతై. ఉ,ఊ లు ఔ అవుతై. ఉదాహరణ : కుంతి కొడుకులు కౌంతేయులు, పురుషునికి వుండేది పౌరుషం, విమానంతో దాటేవాడు వైమానికుడు, ఇంద్రజాలం చేసేవాడు ఐంద్ర జాలికుడు, ఇట్లాగే మూల-మౌలిక, చేతన-చైతన్య, చిత్ర-చైత్ర, తిల-తైల, దితి-దైత్య అవుతై. వీటిని మవులిక, చయిత్య, చయిత్ర, తయిల అని వ్రాయటం కుదరదు. ఎందుకంటే సంస్కృతంలో ఐ, ఔలు ప్రత్యేక వర్ణాలు, సంస్కృతంలో అయ్, అవ్ లతో మొదలయ్యే పదాలను ఐ,ఔలతో వ్రాయకూడదు. అయస్కాంతమును ఐస్కాంతము అనలేము. అవసరంను ఔసరం అనకూడదు.

**24. ఙ, ళ, య అనే అక్షరాలు తెలుగులో పదాదిన వుండవు**

వు, వూ, వొ, వో లు కూడ వుండవు, యమున, యజ్ఞం, యతి లాంటి పదాలు సంస్కృత పదాలు, యవ్వనం తెలుగు పదం అనుకుం టారు, కాదు. యౌవనం అనే సంస్కృత పదాన్ని తప్పుగా వ్రాయటం వల్ల ఏర్పడింది. ఇట్లా ఎందుకు జరుగుతోందంటే ఊయెలను ఉయ్యా లని, నేయిని నెయ్యి గాను వ్రాస్తున్నాము. ఈ ప్రభావం యౌవనం మీద పడి యవ్వనంగా వ్రాయటం జరిగింది. అంతేగాని 'వ'ను ద్విరుక్తం చేయటం వల్ల తెలుగుదనాన్ని సంతరించుకోదు. య మొదట వున్నది గనుక అది సంస్కృత పదమే. కాకపోతే వ ద్విత్వమై ఈ రూపం వచ్చింది. ఇదే రీతిలో కొంతమంది నీవు అనటానికి నువ్వు అంటారు. కాని అనకూడదు. తిల అనే అర్థం వస్తుంది. తెలుగులో రెండచ్చులు వరుసగా వుండవు. అఉను, అఇతే అని వ్రాయకూడదు.

**25. తెలుగులో పదాదిన సంయుక్తాక్షరంగాని, సంశ్లిష్టాక్షరంగాని వుండదు.**

ఒకవేళ వుంటే రెండు ప్రత్యేక హల్లుల సంయుక్తాలు మాత్రమే వుంటై. ఆ రెండు హల్లులలో రెండవది రకారమే అయి వుంటుంది. మొదటి హల్లు క, గ, త, ద, ప, బ, మ లో ఒకటై వుంటుంది. ఇంకే హల్లు రాదు. దీన్ని బట్టి స్థితి, స్నేహం, క్లేశం, స్పందన, స్మరణం ఇత్యాదులు తెలుగు మాటలు కావని తెలుసుకోవచ్చు. తెలుగులో కూడ పదాది సంయుక్తం ఒక అచ్చు లోపించటం వల్ల ఏర్పడినదే, మ్రోగు, మ్రాను, ప్రోలు అన్న తెలుగు పదాలు మొరగు, మరమ్, పురల్ అన్న మూల ద్రావిడ పదాల నుంచి ఏర్పడ్డవే. మొరగులో రెండవ హల్లయిన రకారం ముందుకు వచ్చి మొదటి హల్లు మీది ఒ, ఓ గా మారింది, అప్పుడు మ్రోగు అనే పదం వచ్చింది. మరమ్‌లో రకారం ముందుకు వచ్చి మకారం మీది అకారం ఆకారం అయ్యింది. పురల్ లో రకారం ముందుకు వచ్చి పకారం మీది ఉకారం ఓకారం అయ్యింది. ఇలా తెలుగులో కొన్ని పదాలు మాత్రమే సంయుక్తాక్షరాలతో మొదలవుతై. కాని సంస్కృతంలో ఇవి కోకొల్లలు.

**26. దీర్ఘ సమాసాలు**

వేరు వేరు అర్థములు గల రెండుగాని అంతకన్నా ఎక్కువగాని పదములు ఒక పదంగా మారటం సమాసం. సంస్కృతంలో దీర్ఘసమా సాలుంటై. అచ్చం సంస్కృత పదాలతో ఏర్పడ సమాసం సిద్ధ సమాసం. నన్నయ సిద్ధ సమాస నిర్మాణములో సిద్ధహస్తుడు. అందుకని ఆయన సమాసాలనే ఉదాహరణగా తీసుకుందాం.

మదమాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్య సంపద లన్నాడు

శారద రాత్రు లుజ్వల లసత్తర తారక హారపంక్తు లన్నాడు

సాగర సార వారిరుహ శౌక్తిక మౌక్తిక విద్రువ ద్రుమైలాగురు చందనాదు లన్నాడు

వివిధోత్తుంగ తరంగ ఘట్టన చలద్వేలావనైలావళీ లవలీ లుంగ లవంగ సంగత లతాలాస్యా లన్నాడు.

ఈ విధంగా సంస్కృతాన్ని ఒక పద్ధతి ప్రకారం తెలుగులోకి జొప్పించాడు. పండితులు ఈ భాషను సంస్కృత భూయిష్ఠం అని చెపుతూనే అక్లిష్ట మనోహర సంస్కృత పద భూయిష్ఠంగా వర్ణిస్తారు (వర్ణించారు)

సంస్కృత సమాసాల విషయంలో ఆధునిక కవులేం పూర్వ కవులకు తీసిపోరు. వేదాంత కవి పద్యం ఒకటి చూద్దాం.

ఇదిరా నీ రసికత్వమౌర ! రసరాజెవ్వండు నీ కళ్ళు పో
నిదె నీ గుమ్మము తొక్కడింక, మృదువాణీ గానమాధుర్య ది
వ్య దశానంత దిగంత సౌఖ్య బహు బ్రహ్మానంద సౌందర్యపు
ష్టిది ముద్దాడెడి చక్కనయ్యను కిలాడీ! ఎట్లు హింసించితో.

ఇది శివుణ్ణి సంబోధిస్తూ చేసిన వ్యాజ రచన. రతి దేవికి వేసిన విశేషణాల తోరణమే సమాసమై కూర్చున్నది. చదవటానికి బాగుంటై

కాని అర్థం చేసుకోవటం కొంత కష్టం. తెలుగులో కూడ సమాసాలుంటై. వాటిని ఆచ్చిక సమాసాలంటారు. రెండు లేక మూడు పదాలకు మించి కలవవు. పసిడి గిన్నె, వెండి పళ్ళెము, అన్నదమ్ములు, తల్లిదండ్రులు, జంటతల్లుల బిడ్డడు, చిగురుటాకు సౌరు, నల్లకల్వగమి మొదలైనవి. ఇంతకుమించి పదాలు కలిసి సమాసం ఏర్పడినా అది కృతకంగా వుండటమే కాదు వినసొంపుగానూ వుండదు. సంస్కృతంలో చక్రం గలవాడు చక్రి, బలం గలవాడు బలి. శృంగం గలవాడు శృంగి, మాల గలవాడు మాలి, వాలం గలవాడు వాలి, మానం గలవాడు మాని. తెలుగులో ఇట్లా కుదరదు. తొండం గలవాడు తొండి కాదు, పొట్ట గలవాడు పొట్టి కాదు, ముక్కు గలవాడు ముక్కి, కాలు గలవాడు కాలి అవడు. కారణం రెండు భాషలకు వ్యాకరణాలు వేరుకావటమే.

**27. శ్లోకము-పద్యము**

సంస్కృతంలో శ్లోకాలుంటై. ఇవి గణబద్ధమైనవే. యతి, ప్రాస నియమాలు లేవు. పాదాలు నింపటానికి (గతితప్పకుండా వుండటానికి) తు, హి, చ, స్మ, హ, వై లాంటి అక్షరాలు ఒకటిగాని, ఎక్కువగాని ఒకేసారి కూడ వాడుతూవుంటారు. (అమరసింహుడు) కొంతమంది ఈ అక్షరాలకు అర్థం కూడ చెపుతూవుంటారు. కాని నిఘంటువు చూస్తే ఆ అర్థం వుండదు. మనం ప్రతిపదార్థం చెప్పుకునేటప్పుడు ఈ అక్షరాలను వదిలి వేయటమే సమంజసం. తెలుగులో పద్యాలుంటై. ఎన్నో రకాలు. అన్నిటికి గణ, ప్రాస, యతి నియమాలుంటై. అనవసరాక్షరాలు అనగా పాదం పూరించటానికి ఎటువంటి వ్యర్థాక్షరాలను ఉపయోగించరు. అట్లా చేసిన కవి అప్రతిష్ఠపాలౌతాడు. కుకవి అనిపించుకుంటాడు. తెలివిగల కవులు పాద పూరణ కోసం కొన్ని పదాలు చేర్చినా అవి అర్థవంతంగా వుండి పద్యానికి అందాన్ని తెస్తై. అంతేగాని ఒకటి రెండక్షరాలను చేర్చటం, తరువాత వదిలివేయటం వుండదు. శృతి సుభగంగా, అర్థవంతంగా, అలంకారయుతంగా పద్యాన్ని నడిపించగల కవికే గౌరవం దక్కుతుంది. అతడే మంచి కవి అనిపించుకుంటాడు.

**28. అవధాన ప్రక్రియ**

ఏ భాషకు లేని గొప్పదనం తెలుగుభాషకు సొంతం. అది అవధాన ప్రక్రియ వల్ల, ఇందులో అష్టావధానం, శతావధానం, సహస్రావధానాలని వున్నై. ఇది యొక వినోద, విజ్ఞానాత్మకమైన కవన క్రీడ. కవి మేధాశక్తికి, ఏకాగ్రతకు, సమయస్ఫూర్తికి, చమత్కారానికి, పాండిత్యానికి, లౌకిక జ్ఞానానికి, ఆశుకవితాధారకు నిదర్శనం, అంశాలవారీగా పృచ్ఛకులు అడిగిన ప్రశ్నలకు అడిగినట్లుగా సమాధానాలు యుక్తియుక్తంగా చెప్పటమే అవధాని చేయవలసిన పని, ముఖ్యంగా సమస్యాపూరణం అనే అంశంలో పొందికలేని పదాలతోనో, విరుద్ధభావంతోనో, అర్థ రహితంగానో, అసహజంగానో, అతిశయోక్తి యుతంగానో ఒక పద్య పాదం తయారుచేసి, మిగిలిన పాదాలను పూరించమని అడుగుతారు. అర్థవంతంగా మిగిలిన పాదాలు చెప్పి, ఆ నాల్గవ పాదంలోని వైరుధ్యాన్ని లేక అర్థరాహిత్యాన్ని తొలగించగలిగిన అవధాని ప్రశంసా పాత్రుడౌతాడు.

మోచర్ల వెంకన్న అనే కవికి పృచ్ఛకుడు సంధించిన సమస్య చూడండి.

"గుఱ్ఱానికి ఐదు కాళ్ళు కోడికి వలెనే" ఇది కందపద్యపాదం. కోడికి ఐదు కాళ్ళుండటం సహజమే అయినట్లు, గుఱ్ఱానికి కూడ ఆ విధంగానే వున్నైయ్యని ఈ పాదానికి అర్థం. గుఱ్ఱానికి నాలుగు కాళ్ళుంటై. కోడికి రెండు కాళ్ళు మాత్రమే వుంటై. ఈ వైరుధ్యాన్ని కవి ఏ విధంగా తొలగించాడో తెలిస్తే అద్భుతానందం కలుగుతుంది. ఆనంద సంద్రంలో మునిగి తేలతాము.

మఱ్ఱాకు పాన్పుగా గొని<br>
బొఱ్ఱున్ బ్రహ్మాండ పంక్తి బూనిన ముద్దుం<br>
గుఱ్ఱడ ! విను, వన్నెలు గుహు<br>
గుఱ్ఱానికి ఐదు, కాళ్ళు కోడికి వలెనే.

వినవయ్యా! కుమారస్వామి వాహనమైన నెమలికి ఐదు రంగులుంటై. కాళ్ళు కోడికివలె రెండే వుంటై అది దీనర్థం.

భోజరాజు ఆస్థానంలో కాళిదాసాది కవులు కొన్ని శ్లోక పాదాలు ఈ రకంగా పూరించినట్లు మనకు తెలుసు కాని వాటిలో ఇంత వైవిధ్యం లేదు. మన అవధాన ప్రక్రియలో వున్న ఇతర అంశాలు అక్కడ వున్నట్లు కనపడవు. చెదురుమదురుగా అక్కడక్కడా వర్ణనలు, దత్తపది లాంటివి వున్నా అన్నీ కలిపి ఒకే చోట అవధానం చేసిన దాఖలాలు లేవు. బహుశా మన అవధాన ప్రక్రియకు అవి ప్రాతిపదికలు కావచ్చు.

**29. భావార్థ ప్రయోగాలు**

ఏ భాషలో నయినా వ్రాయటానికి ఒక భాష. మాట్లాడటానికి ఒక భాష ఉపయోగిస్తాము. పండితులు వ్రాసే భాషను గ్రాంథికం అంటాం. గ్రథించటానికి ఉపయోగపడుతున్నది గనుక, ఇందులో మళ్ళీ రెండు రకాలున్నాయి. గద్యకు తగిన భాష- గద్య భాష. కావ్యములకు తగిన భాష- కావ్య భాష. మాట్లాడే భాషను వ్యవహారికం అంటాం. ఇందులో శిష్ట వ్యవహారికం, శుద్ధ వ్యవహారికం అని రెండు రకాలు. వ్యవహార భాషలో మాండలికాలుంటై. యాస కూడ వుంటుంది. సంస్కృతంలో మాండలికాలు లేవు. ఔత్తరాహులు శ్లోకాలను ఒక రకంగా చదువుతారు. అది యాస కాదు, వారి మాతృభాషా ప్రభావం వల్ల. కొంతమంది తెలుగువారు ఇంగ్లీషును కూడ తెలుగు మాట్లాడినట్లే మాట్లాడుతారు. ఆ విధంగా అన్నమాట. సామాన్య జనులకు పద స్వరూపమేదో తెలియకపోవటం వల్ల ప్రసాద్ అనటానకి పరసాద్ అంటారు. స్కూల్ అనటానికి ఇస్కూల్ అంటారు. శ్రీవాత్సవకు శ్రీవాస్తవగా పలుకుతారు. నిజంగా సంస్కృతం ఏ ప్రాంతం వారికైనా మాతృభాషగా ఎప్పుడైనా వుండివుంటే మాండలికాలు ఏర్పడివుండేవి. యాస కూడ కొట్టవచ్చినట్లు కనపడేది. కాని ఆసేతు హిమాచల పర్యంతం సంస్కృత భాషను ఒకేరకంగా మాట్లాడటం అది జనుల నోళ్ళలో నానకపోవటమే. సామాన్య జనం మాట్లాడివుంటే, వారి మాటలకు వాచ్యార్థం, భావార్థం, వ్యంగార్థాలు స్ఫురించబడేవి. ఉదాహరణకు తెలుగులో ఏదైనా బాగుండలేదని చెప్పటానికి 'నా మొహంలా వుంది' అంటాం. 'నా బొంద వాడేం చేస్తాడు' అంటే వాడేం చేయలేడని అర్థం. 'మా నాన్న ఇంట్లో లేనట్టున్నాడండి' అంటే లేడనే నా కనిపిస్తోందని అర్థం, 'బియ్యం నిండుకున్నవి' అంటే అయిపోయినవని అర్థం, 'నీవు రాక చాలా రోజులయింది' అంటే నీవు మా ఇంటికి వచ్చి చాల రోజులయిందనే అర్థం. ఇటువంటి భావార్థ ప్రయోగాలు సంస్కృతంలో వుండవు. వ్యంగార్థ ప్రయోగాలు మాత్రం సంస్కృతంలో బహుళంగా వున్నై.

**30. వ్యుత్పత్తి**

సంస్కృతంలో ప్రతి పదానికి వ్యుత్పత్తి చెప్పవచ్చు. అండజము- అండము వలన పుట్టినది, అచలము- చలనము నొందనిది. అతిథి-

కాల నిర్ణయము లేక భోజనమునకు వచ్చువాడు. కళత్రము- సుఖమును తెచ్చిన రక్షించునది. జలము-పుట్టునది, నశించునది, వర్జ్యము-వర్జించు అనగా వదలివేయు- కనుక విడవదగినది అనగా దోష కాలము. వితరణము-విశేషముగా తరించుటకు వీలైనది. అనగా దానముచే నరకమును దాటవచ్చు. ఈ రకంగా ఏ పదానికైనా వ్యుత్పత్తి చెప్పవచ్చు. కారణం **సంస్కృతం ధాతుజన్యమైన భాష. తెలుగు ధాతుజన్యమైన భాష కాదు.** కనుక తెలుగులో ప్రతి పదానికి వ్యుత్పత్త్యర్థం చెప్పటం కుదరదు. డా.భద్రిరాజు కృష్ణమూర్తి గారి వద్ద ఈ విషయం ప్రస్తావించినప్పుడు **తెలుగులో కూడ వ్యుత్పత్తులుంటై. పరిశోధన సరిగా జరగకపోవటం వల్ల మనకు కొన్ని మాత్రమే తెలుసు.** కుందేలు-కుందు అంటే దూకు, ఏలు-జంతువు, తోడేలు-తోడు అంటే తవ్వు, తాబేలు-తాపు=తన్ను. దున్నుటకు పనికివచ్చే జంతువు గనుక దున్న అని వుంటారు. తాపీ ధర్మారావు గారు కోడలు అంటే కోడెలకు పనికి వచ్చేది అని సరదా నిర్వచనం చెప్పారు. నిజానికి కొడుకు+ఆలు =కొడుకాలు -కోడాలు-కోడలు అయివుంటుంది.

### 31. సంస్కృతం పండితుల భాష

సంస్కృత సమాసాలను విడదీయవలసి వచ్చినపుడు, అతుల శ్శరభో భీమః అని వుంటే అతులః శరభః భీమః అని విడదీయవచ్చు. లేక అభీమః అని కూడ విడదీయవచ్చు. అప్పుడు భీమః ముందు ఒక అవగ్రహం వేసుకుంటే సరిపోతుంది. ఇక అర్థం చూద్దాం. అతులః అంటే సమానమైన వాడు ఇంకొకడు లేడని, శర+భః అంటే శరీరంలో ఆత్మగా ప్రకాశించేవాడని, భీమః అంటే భయము కలిగించువాడని, అభీమః అన్నప్పుడు సౌమ్యుడని అర్థం. ఒకడే రెండర్థాలకు పొసగడు గనుక భీమః అని వున్నప్పుడు అందరకూ భయము కలిగించువాడని, అభీమః అన్నప్పుడు భయము తొలగించువాడని లేక సజ్జనులకు సౌమ్యుడని చెప్పుకోవాలి. సమయజ్ఞః అన్నప్పుడు సమయ+జ్ఞః అని విడదీయవచ్చు. కాలములు తెలిసిన వాడని, సమ+యజ్ఞః అని కూడ విడదీయవచ్చు. సమమైన యజనము కలవాడని. అంటే సర్వభూతముల యందు సమభావం కలవాడని అర్థం. విలక్షణః అంటే విశిష్టమైన లక్షణములు కలవాడని, విక్షరః అంటే నాశనము లేనివాడని అర్థం. 'వి' అనే ఉపసర్గ అటూ, ఇటూ కూడ అర్థాన్నిస్తుంది. ఇది కాక ఒకే పదానికి సంస్కృతంలో అనేకార్థాలుంటై. హరి అంటే విష్ణువు, ఇంద్రుడు, సూర్యుడు, చంద్రుడు, యముడు, సింహము, గుఱ్ఱము, కోతి, కప్ప, కిరణము, పాము, గాలి, చిలుక, పుండరీకం అంటే తెల్లతామర, తెల్లగొడుగు, పుణ్యతీర్థము, ఆగ్నేయ దిక్కునందలి ఏనుగు, పెద్దపులి, కప్ప, పుష్కరం అంటే నీరు, ఆకాశం, నక్షత్రం, మృదంగం, ముఖం, మదం, కత్తివాటు, ఒక ద్వీపం, ఒకరకమైన ఓషధి, కమలం, తీర్థ విశేషం, సర్పం, ఏనుగు, తొండపుకొన అని అర్థాలు చెపుతారు. వినాయ కుడంటే రూఢియైన అర్థం. విఘ్నేశ్వరుడనే. కాని బుద్ధుడని, గరుత్మం తుడని, గురువని అర్థాలు చెప్పుకోవచ్చు. అరిష్టం అంటే కీడు, పురిటిల్లు, మజ్జిగ, చావు గురుతు, కల్లు, మేలు, కాకి, రాపులుగు, వెల్లుల్లి, కుంకుడు, వేము అనే అర్థాలున్నాయి. ఇంకో తమాషా ఏమిటంటే సంస్కృతంలో రిష్టం అన్నా, అరిష్టం అన్నా ఒకటే, శుభం అని అర్థం. కాని వాడుకలో అశుభం లేక ఆపద అనే అర్థంలో వాడుతున్నాము. శిష్టం అంటే మిగిలినది అని. పరిశిష్టం అన్నా అదే. వతంసం అన్నా అవతంసం అన్నా ఒకటే. తసి అనే పదానికి అలంకారం అని అర్థం. రామానుజుడు అన్నప్పుడు అనుజుడు అంటే రాముని తరువాత పుట్టినవాడని. అనురాధ (అనూరాధ అని కూడ వ్రాస్తారు) అంటే రాధ తరువాతది అని, రాధ నక్షత్రానికి విశాఖ అని పేరు. అనగా విశాఖ తరువాతది అని. కాని అనుకంప అంటే అట్లా అర్థం చెప్పకూడదు. కొంచెం కదలింపజేసేది. దయ అని అర్థం. ఇది ఆ భాషా సంప్రదాయం లేక లక్షణం అంటారు పెద్దలు. ఇట్లా తెలుగు భాషలో ఇవ్వవచ్చు. ఒకవేళ వున్నా అది నామవాచకంగా ఒక అర్థాన్ని, క్రియగా మరొక అర్థాన్ని ఇవ్వవచ్చు. అది సందర్భాన్నిబట్టి తెలుసుకోదగినట్లుగానే వుంటుంది, పెరుగు-పెరుగు, ఆనక-ఆనక, కాలు-కాలు, వాగు-వాగు, ఇగురు-ఇగురు, కొట్టు-కొట్టు, కట్టు-కట్టు, కోరు-కోరు లాంటివి. పప్పుకట్టు చారులో పోస్తారు. కాలు విరిగితే కట్టు కట్టారు. రెండు వాక్యాలలో కట్టు అనే పదానికి అర్థ భేదం వున్నా అది సువిదితమే. ఇక శ్లోకాల కయితే కొన్నిటికి రెండర్థాలు, మూడర్థాలు, నాలుగర్థాలు కూడ పండి తులు వారి వారి ప్రతిభా వ్యుత్పత్తులను బట్టి చెపుతారు. శ్లోకం దాకా ఎందుకు ఒక పద బంధానికి అర్థం చూద్దాం. 'అప్రమేయుడు' అని ఒక పద బంధం వున్నది. సంస్కృతంలో అప్రమేయః అంటే విష్ణువని అర్థం. నిఘంటువు చూస్తే మితిలేనివాడు, ఇంత అంత అని చెప్ప లేనంతవాడు అని వుంటుంది. పెద్దలు చెప్పే అర్థం చూద్దాం. ప్రత్యక్షాది ప్రమాణములకు అందనివాడు. శబ్ద, స్పర్శ, రూపాదులు లేనందువల్ల ప్రత్యక్షముగా తెలియబడడు. పొగ వుంటే నిప్పు వుందని ఊహిస్తాం. అట్లా ఊహించుటకు పొగ వంటి గుర్తులేమి లేవు గనుక అనుమాన ప్రమాణం పొసగదు. అతని వంటివాడు ఇంకొకడు లేడు గనుక ఉపమాన ప్రమాణానికి అందడు. ఈ విధముగా ఏ ప్రమాణమునకు అందడు గనుక అప్రమేయుడు అని. మరీపెద్దలు చెప్పే ఇంకొక అర్థం చూద్దాం. భ్రమ అంటే భ్రాంతి లేక పొరపాటు. ఒకదాన్ని చూచి మరొక టనుకోవటం. తాడును చూచి పామనుకోవటం భ్రమ. దూరంగా వున్న మోడును చూచి మనిషనుకోవటం భ్రమ. అందుకోలేని దానిని అందుకో గలననుకోవటం భ్రమ. దీనికి వ్యతిరేకం ప్రమ, తాడుని తాడని, పాముని పామని గ్రహించటం. అంటే వస్తువు యొక్క తత్త్వమును గ్రహించి అది అదే అనే యథార్థ జ్ఞానమును కలిగివుండటం, ఇంకోరకంగా చెప్పాలంటే ఏ వస్తువును ఆ వస్తువుగా గుర్తించటం. అలా గుర్తించ గలగటం ప్రమేయం అవుతుంది. కానిది అప్రమేయం. విష్ణువు అప్రమే యుడు, ఆయనకు జ్ఞానేంద్రియముల అవసరం లేదు. ఆయనయే జ్ఞానం. ఆయన జ్ఞానస్వరూపుడు. అందువల్ల ఆయన జ్ఞానేంద్రియముల చేత వస్తుతత్త్వ యథార్థ జ్ఞానమును తెలిసికోవలసిన అవసరం లేదు. అందుకే ఆయన అప్రమేయుడు. కనకధారా స్తవమ్‌లో ఒక పదం వున్నది. 'అప్రమేయం' అని. సామవేదం షణ్ముఖశర్మ గారు చెప్పిన అర్థం. మేయం అంటే కొలవటం. ప్రమేయం అంటే బాగా కొలవటం. అప్రమేయం అంటే 'అసలు కొలవలేనిది' అని. 'అలవిమాలిన తల్లి ఆకాశమంత' అని కొలిచే సాధనం ఏదీ లేనిది అని అర్థం చెప్పారు. అనంతమైన తల్లిని విగ్రహ రూపంలో పరిమితికి తెచ్చి కొలుస్తున్నాము. కొలవటం అంటే పూజించటం అని కూడ. కొలువులు అంటాం. ఆ అంటే బ్రహ్మ గనుక బ్రహ్మాది దేవతలచే పూజించబడేది అని కూడ అర్థం చెప్పుకోవచ్చు. దీన్ని బట్టి మనకు ఏం తెలుస్తున్నది? మనిషి తెలివినిబట్టి అతనికున్న భాషా జ్ఞానాన్నిబట్టి ఎంత రాబట్టుకోగలిగితే అంత అర్థాన్ని ఆకళింపు చేసుకోవచ్చని, ఇదంతా ఆ భాష యొక్క

గొప్పతనమనీ, చమత్కారమని చెపుతారు. కాని మిగిలిన వారికి ఎంతో అసౌకర్యాన్ని కలుగజేస్తుంది. **తెలుగులో ఎప్పుడూ ఇట్లా వుండదు,** ప్రత్యేకంగా కష్టపడి రెండర్థాలు (శ్లేష) రావాలని ఒక వాక్యమును నిర్మిస్తేనే తప్ప లేకపోతే ఎవరికైనా ఒకే అర్థం స్ఫురించే వాక్యాలే వుంటై. నేను చెప్పేది వాచ్యార్థం సంగతి. **దీన్ని బట్టి చూస్తే సంస్కృతం పండితుల భాష కానీ ప్రజల భాష కాదని తెలుస్తుంది. తెలుగుభాష ఎంతో మృదువుగా, అందంగా, తియ్యగా వుంటుంది.**

మధురమైన భాష సుధలు చిల్కెడిభాష
తేనెలొలుకు భాష తెనుగు భాష
అందమైన భాష ఆనందమిదు భాష
ద్రవిడ భాషలందు రాణి భాష

సంస్కృతం క్లిష్టంగా, వివిధార్థాలకు తావిచ్చే విధంగా వుంటుంది. తెలుగు సులభంగా అందరికీ అర్థం అయ్యేవిధంగా వుంటుంది. కనుక ఇది ప్రజల భాష.

ఇన్ని భేదములున్నప్పుడే విధాన
సంస్కృతము నుండి ద్రవిడ భాషలు జనించు?
తెలుగు, కన్నడ, మలయాళములను సొంత
తల్లివలె సాకుటన్ మారుతల్లి యగును

సంస్కృతం ఒక గొప్ప భాషని, ఇది చదువుకున్న వారికి ఏ ఇతర భాషైనా సులభంగా వశమౌతుందని చెపుతారు. ఇది నిజమే. అంతేగాదు ఈ భాషను క్షుణ్ణంగా అభ్యసించినవారు పుస్తకాపేక్ష లేకుండా అనర్గళంగా, అనాయాసంగా, ఏ విషయంమీద నైనా, ఎన్ని గంటలైనా మాట్లాడ గలుగుతారు. నీతి సూత్రాలకుగాని, సామెతలకు గాని, జాతీయాలకుగాని ఈ భాష ఒక పెద్ద భాండాగారం. ప్రస్తుతం ఎవరూ సంస్కృతం మాట్లాడటం లేదు గనుక అది మృత భాష అనే వాళ్ళు కూడ వున్నారు. కాని అది నిజం కాదు. సంస్కృతం అన్ని భాషల్లో చేరి అక్కడ సజీవంగానే వున్నది. ఉత్తరదేశ భాషలు సంస్కృతం నుంచే పుట్టినవిగనుక వాటిలో కుప్పలు తెప్పలుగా తల్లి భాషా పదాలుండటంలో ఆశ్చర్యం లేదు. కాని ద్రావిడ భాషలైన తెలుగు, కన్నడ, మలయాళ భాషల్లో కూడ ఏబది నుంచి డెబ్బదిఐదు శాతము సంస్కృత పదాలుండటం ఆ భాష యొక్క ఔన్నత్యాన్ని, స్వీకరించిన భాషల కలుపుగోలుతనాన్ని చాటుతుంది. ఇప్పుడు మనం సంస్కృత పదం రాకుండా కాసేపు కూడ తెలుగులో మాట్లాడలేము. అన్నం తిన్నామన్నా, ఆలోచన చేశామన్నా, అర్థం అయిందన్నా, అరోగ్యంగా వున్నామన్నా అంతా సంస్కృతమే, ఉద్యోగంలో చేరామన్నా, నానాగడ్డీ తిన్నాడన్నా, బహుదూరపు బాటసారన్నా నిర్మొహమాటంగా మాట్లాడారన్నా, అతి తక్కువధరకు దొరుకుతోందన్నా, దురలవాట్లు సామాన్యంగా పోవన్నా చెల్లుబాటవుతూనే వున్నాయి. కరకంఠుడన్నా, రక్తకన్నీరన్నా, దర్భముడన్నా, గర్భగుడన్నా, బికిరాశనుడన్నా, ఇసుకాసురులన్నా ఎవరూ అభ్యంతరపెట్టటం లేదు. ఇవన్నీ తెలుగు మాటల కిందే చెలామణి అవుతున్నై. ఇటువంటి మిశ్రభాషను ఆంధ్రము అన్నారు. శ్రీకృష్ణదేవరాయలు **'దేశ భాషలందు తెలుగులెస్స'** అన్నాడు. ఆయన ఉద్దేశం ఆంధ్రమనే, **'అందమైన భాష ఆంధ్రభాష' అంటే బాగుండేది.** ఆయనే దూర్జటి కవిత్వాన్ని గురించి చెపుతూ 'స్తుతమతియైన ఆంధ్రకవి ధూర్జటి పల్కుల కేలగల్గెనో అతులిత మాధురీమహిమ' అన్నాడు. అందువల్ల అప్పటివారు (ఇప్పటివారు కూడ) తెలుగన్నా, ఆంధ్రమన్నా ఒకటిగానే భావించారు. తెలుగు గొప్పదనాన్ని ఆయన ఒకడే గాదు తెలుగేతరులు కూడ ఎంతోమంది కీర్తించారు–సి.పి బ్రౌన్ (ఇంగ్లాండు దేశస్తుడు) తెలుగు నేర్చుకొని, ఒక నిఘంటువును తయారు చేసి, వేమన పద్యాలకు అర్థాలు చెప్పి మన భాషకు ఎనలేని సేవ చేశాడు. నికొలె కాంటి (ఇటలీ దేశస్తుడు) తెలుగు భాషకు ఆకర్షితుడై 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్' అని పొగిడాడు. తమిళుడైన సుబ్రహ్మణ్య భారతి "సుందర తెలుంగు" అన్నాడు. జె.బి.ఎస్. హాల్‌డేన్ (భాషా శాస్త్రవేత్త) 'తెలుగు ఒక పరిపూర్ణమైన భాష' అన్నాడు. శబ్ద సంపదలోను, శబ్ద సౌష్టవంలోనూ, భావవ్యక్తీకరణలోనూ, శ్రావ్యములోనూ, తెనుగు భాషకు అత్యంత సమన్వయశక్తి వున్నది. దీనికి విభిన్న స్రవంతులను తనలో లీనం చేసుకునే సమర్థత వున్నది. అని కూడా అన్నాడు.

బెంగాలీ భాషా శాస్త్రవేత్త సునీత్‌కుమార్ సేన్ కూడ తెలుగు భాషకు భారతీయ భాషల్లో అగ్రస్థానం ఇచ్చాడు.

సంస్కృతం తెలుగును పెంచి పోషించింది. గనుక అన్య భాషా వేత్తలచే కూడా పొగడబడే స్థాయికి ఎదిగేట్లు చేసింది గనుక నిజంగా తల్లి కాకపోయినా తల్లి వంటిదే. సంస్కృతం లేకపోతే మన దేశ భాషలకు ఈ గౌరవం దక్కేదిగాదు. అందుకే సంస్కృతాన్ని గౌరవించక తప్పదు.

**సంస్కృతం గొప్ప భాషైనంతమాత్రాన, ఆ భాషా పదాలు ఎక్కువ శాతం దేశ భాషలలో కలిసిపోయిన మాత్రాన, అన్ని భాషలు సంస్కృత జన్యములే అనటం సమజసం కాదు. నిజంగా తెలుగు సంస్కృతానికే పుట్టివుంటే రెంటికీ పోలికలే ఎక్కువ వుండాలి. కాని ముప్పది పైచిలుకు భేదములే కనపడుతున్నై. తరచి చూస్తే మరికొన్ని భేదములు కూడ వుండవచ్చు. దీనిని బట్టి తెలుగు భాషకు, మిగిలిన ద్రావిడ భాషలకు సంస్కృతం తల్లి కాదని తేలిపోయింది. తల్లి వంటిది లేక మారు తల్లి అనటం సబబు.**

పోలికలు లేని భాషలన్ పొందుపరచి
భేదములు పెక్కులున్నను విస్మరించి
పదములన్నియు చక్కగా కుదురుకొనగ
తల్లి యది, పిల్ల యిది యన ధర్మమగునె

*ఈ నా వ్యాస రచనకు డా॥ భద్రరాజు కృష్ణమూర్తి, డా॥సలాక రఘునాథశర్మ, డా॥తూమాటి దొణప్ప, డా॥బొడ్డుపల్లి పురుషోత్తం, డా॥వెలమల సిమ్మన్న, డా॥డి.చంద్రశేఖరరెడ్డి, డా॥పి.ఎస్.సుబ్రహ్మణ్యం గార్ల గ్రంథాలు నాకెంతో ఉపకరించినవి. వారికి నా కృతజ్ఞతాభి వందనములు.*

❋

శిశువు శారీరక వికాసానికి తల్లిపాలు
మానసిక వికాసానికి తల్లి భాష

గుండెలోతుల్లోంచి వచ్చేదీ, మనసు
విప్పి చెప్పగలిగేది అమ్మనుడిలోనే

జాతి సాంస్కృతిక పతాక –
మాతృభాష

-డా॥ బొర్రా గోవర్ధన్

# ఆధునిక యుగ తెలుగు
# బౌద్ధ ఉషస్సు-లక్ష్మీనరుసు



"ప్రొ॥నరుసు ఐరోపావారి అహంకారాన్ని ధీరోదాత్తంగా ఎదిరించిన దేశభక్తుడు. సనాతన హైందవాన్ని బ్రాహ్మిణిజాన్ని ఎదురొడ్డి పోరాడిన ధీశాలి. అలాగే...బుద్ధుని బోధనలపట్ల ఎంతో విశ్వాసం కలిగిన మహోన్నతుడు" ఈ మాటలు ప్రొ॥లక్ష్మీనరుసు గురించి, డా॥బాబా సాహెబ్ అన్న మాటలు.

భారతదేశంలో బౌద్ధపునరుద్ధానంలో కొండంతవాడు డా॥అంబేద్కర్. అలాంటి అంబేద్కర్‌ని ఎవరన్నావెళ్ళి "బాబాసాహెబ్! బౌద్ధ ధర్మం గురించి తెలుసుకోవాలని వుంది. ఏ పుస్తకం చదివితే బాగుంటుంది?" అని సలహా అడిగితే-

"మీరు ప్రొ॥లక్ష్మీనరుసు రాసిన బౌద్ధ ధర్మసారం (ఎస్సెన్స్ ఆఫ్ బుద్ధిజం) చదవండి" అని ఠక్కున చెప్పేస్తాడు. అంబేద్కర్ లాంటి ప్రపంచ మేధావిని ప్రభావితం చేసిన ఆ గ్రంథ రచయిత ప్రొ॥లక్ష్మీనరుసు ఎవరో తెలుసా?

మనం మరచిన, మనకు తెలిసినా ఇంకా తగినంతగా గుర్తింపు నీయని తెలుగువాడు ప్రొ॥పోకల లక్ష్మీనరుసు.

నిజం చెప్పాలంటే...డా॥అంబేద్కర్ అభిమానించిన ఏకైక ఆధునిక బౌద్ధ రచయిత.

మొన్న మంగళగిరిలో జరిగిన బౌద్ధ సదస్సులో ఆధునిక బౌద్ధ పునరుద్ధారకుల గురించి మాట్లాడాను. అదే సభలో వున్న మాన్యులు డా॥సామల రమేష్‌బాబు గారు సభానంతరం 'ఈ ప్రసంగాన్ని ఒక వ్యాసంగా మలచండి. మన అమ్మనుడి కోసం' అన్నారు.

"సరేనండీ. ఐతే ఆ పునరుద్ధారకులందరి గురించి కాదు. పోకల లక్ష్మీనరుసు గారి గురించి రాస్తాను. నేను గతంలో కొద్దిగా వారి గురించి చదివాను. ఈ సభకోసం కాస్త విస్తృతంగా చదివాను. వారి గురించి తెలుసుకున్నాక ఒక తెలుగు బౌద్ధ రచయితగా ఎంతో మనోవేదన పడ్డాను. ఒకింత సిగ్గు పడ్డాను కూడా. ఇంత గొప్ప వ్యక్తి గురించి బౌద్ధులమైన మేము కూడా తగినంత ప్రచారం ఇవ్వలేకపోయాం. ఈ చారిత్రక తప్పిదంలో నాకూ భాగముంది. దాన్ని సరిచేసుకోవడానికి మీరు నాకు ఈ అవకాశాన్నివ్వండి. ఆయన గురించి కొద్దో గొప్పో రాసి, నా బాధ తీర్చుకుంటాను" అన్నాను.

వారు అంగీకరించారు. అందుకే ఈ వ్యాసం ఇలా....మీతో...

---

**మ**నం లక్ష్మీనరుసుగా చెప్పుకునే వారి పూర్తి పేరు పోకల లక్ష్మీ నరుసు నాయుడు. వీరు 1860లో పుట్టారు. పుట్టినతేదీ ఇంకా తెలియ లేదు. తెలుగువాడనేది నిర్వివాదాంశం. ఏ ప్రాంతంవారో, ఏ ఊరివారో కూడా తెలియలేదు.

అంబేద్కర్ గాని వీరి గురించి చెప్పకపోతే లక్ష్మీనరుసు అనే పేరు కూడా చరిత్రలో ఓ నలుసులా ఏ మూలనో పడి వుండేది.

కానీ ఆ కాలం చారిత్రక పునరుద్ధానకాలం. పందొమ్మిదో శతాబ్దమే ప్రపంచ పునరుద్ధాన శతాబ్దం. ప్రపంచంలో ఎన్నో దేశాలు, ఎన్నో జాతులు స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం వెల్లువలా ఎలుగెత్తుతున్న కాలం. ప్రతి దేశం తన సాంస్కృతిక వికాసాన్ని చాటింపు వేసు కుంటున్న కాలం.

కాలం కప్పేసిన మధ్యయుగాల ఆటవిక, అనాగరిక మత మౌఢ్యాలు మింగేసిన ఎన్నెన్నో ప్రగతిశీల వాదాలు, ఆ మౌఢ్యాల పొట్టలు చీల్చుకుని నూతన శోభతో మొలకెత్తుతున్న కాలం.

ప్రపంచ వ్యాపితంగా వెల్లువలా పెల్లుబికి వస్తున్న ఈ మార్పుల్లో భాగంగా మన దేశంలో బౌద్ధం కూడా తిరిగి తలపైకెత్తింది. దురహం కార వైదిక మధ్యయుగాల ఆటవిక దుమారానికి నేలలో కప్పేసుకు పోయి కనుమరుగైపోయిన బౌద్ధ బీజాలు, ఈ శతాబ్దం తొలినాళ్ళలో తిరిగి భూమిని చీల్చుకుని మొలకెత్తడం మొదలెట్టాయి.

ఈ బౌద్ధ పునరుద్ధాన కార్యక్రమంలో ఎందరెందరో పాలుపంచు కున్నారు. అనాగరిక ధర్మపాల, రాహుల్ సాంకృత్యాయన్, భదంత ఆనంద కౌసల్యాయన్, ధర్మానంద కోశాంబి, సత్యనారాయణ గోయంకా, జగదీశ్ కాశ్యప్...ఇలా ఎందరెందరో ఎవరెవరి రంగాల్లో వారు బౌద్ధానికి ఊపిరులు ఊదారు. వీరిలో అనాగరిక ధర్మపాల బౌద్ధ క్షేత్రాల పునరుద్ధరణకు కంకణం కట్టుకుని 'మహాబోధి సొసైటీ'ని స్థాపించారు. అలాగే మార్క్సిస్టు మహామేధావి, మహోపాధ్యాయ, మహా పండిత, రాహుల్ సాంకృత్యాయన్ దేశ విదేశాల్లో వున్న మన బౌద్ధ వాఙ్మయ సంపదని తిరిగి ఈ దేశానికి తెచ్చి, వాటిని మన భాషల్లోకి అనువదించి అందించారు.

బుద్ధుడు ఆవిష్కరించిన ధ్యానమార్గాన్ని బర్మా నుండి తిరిగి తెచ్చి, ఆ మార్గ సాధనకు ఎన్నో శిక్షణాకేంద్రాల్ని స్థాపించడమే కాకుండా, మొత్తం బౌద్ధ త్రిపిటకాల్ని మూల పాళీ భాషలో దాదాపు 200 పుస్త కాలుగా ముద్రించి అందించారు.

అలాగే...డా॥అంబేద్కర్ బౌద్ధాన్ని అసలు దుఃఖార్తులైన నిమ్నవర్గా

లకు అందేలా చేసి, బౌద్ధానికి ఒక సామాజిక ప్రయోజనాన్ని చే కూర్చారు.

మనుషుల్ని పశువులకంటే హీనంగా అంటరానివారిగా వేరు చేసి చూసే వైదిక విధానానికి ప్రత్యామ్నాయంగా బౌద్ధాన్ని స్వీకరిం చారు. పీడిత ప్రజల దుఃఖ నివారణామార్గం బౌద్ధమేనని నిరూ పించారు.

ఇన్ని దారుల్లో బౌద్ధ పునరుద్ధానం పందొమ్మిదో శతాబ్దం తొలి నాళ్ళలో ఒకేసారిగా ముందుకు వచ్చింది.

**అంబేద్కర్ కంటే రెండు దశాబ్దాలకు ముందే బౌద్ధాన్ని సామాజీ కరించాలని సూచించిన వ్యక్తి లక్ష్మీనరుసు. ఈ దేశంలో కులనిర్మూలన బౌద్ధం ద్వారానే సాధ్యం అని చెప్పిన మేధావి ఆయన.**

**అందుకే లక్ష్మీనరుసు అంటే అంబేద్కర్‌కి అంత గౌరవం.**

## చదువు-ఉద్యోగం

లక్ష్మీనరుసు మద్రాస్ క్రైస్తవ కళాశాలలో బి.ఏ. చదివాడు. అదే కళాశాలలో ట్యూటర్‌గా చేరాడు. ఆ తర్వాత 1897లో అదే కళా శాలలో అసిస్టెంట్ ప్రొఫెసర్ అయ్యాడు. దాదాపు ఆ పదవిలో పదిహే నేళ్ళు పని చేశాడు. ప్రొ॥నరుసు భౌతిక శాస్త్ర ఆచార్యుడు. శాస్త్రవేత్త. గతిశాస్త్రంలో గొప్ప పరిశోధనలు చేశాడు. వైర్‌లెస్ టెలీగ్రఫీలో పేరు పొందాడు. కొంతకాలం ఒక ఆంగ్ల ప్రొఫెసర్ సెలవు మీద వెళ్ళడంతో ఇటు భౌతికశాస్త్ర విభాగంతోపాటు అటు రసాయనశాస్త్ర విభాగాన్ని కూడా తానే నడిపించాడు. ఆ సంవత్సరం (1898-99) గతి శాస్త్ర విషయంలో ప్రొ॥విల్సన్ అనే ఆంగ్లశాస్త్రవేత్తతో వివాదం తలెత్తింది.

"మిస్టర్ నరుసు! నీవు నాకే చెప్పేంత గొప్పోడివా? నాకే పాఠాలు నేర్పాలనుకుంటున్నావా?" అని అహంకారాన్ని ప్రదర్శించాడు.

అతని తలబిరుసును తగ్గిస్తూ-

"ప్రొ॥విల్సన్‌కు గతిశాస్త్రంలో నూతన విషయాన్ని బోధిస్తున్నం దుకు చాలా సంతోషంగా వుంది" అని ధైర్యంగా జవాబిచ్చాడు లక్ష్మీనరుసు.

అంతటి ప్రజ్ఞానవంతుడు, పండితుడు, పరిశోధకుడు, భాష్య కారుడు-

ఆనాటి క్రైస్తవ కళాశాలల నియమాల ప్రకారం కళాశాలల్లో ప్రొఫెసర్ పదవుల్లో ఆంగ్లేయులే వుండాలి. అసిస్టెంటు ప్రొఫెసర్లుగా భారతీయులు వుండొచ్చు. ఇక,ఇక్కడ వుంటే ఎన్నాళ్లయినా పదోన్నతి కలగదని భావించి అక్కడి నుండి పచ్చాయప్పన్ కళాశాలకు మారి, ప్రొఫెసర్‌గా పదవి పొంది, ఆ తర్వాత ఆ కళాశాల ప్రిన్సిపాల్‌గా పని చేశారు లక్ష్మీనరుసు.

ప్రముఖ స్వాతంత్ర్యసమరయోధుడు జాతీయ కాంగ్రెస్ పార్టీ అధ్యక్ష పదవి నలంకరించిన తెలుగువాడు, ఆంధ్రా బ్యాంక్ వ్యవస్థాపకుడు, కాంగ్రెస్ చరిత్ర గ్రంథ రచయిత డా॥భోగరాజు పట్టాభిరామయ్య ప్రొ॥లక్ష్మీనరుసు శిష్యుడే.

## కులవ్యవస్థపై తిరుగుబాటు

భారతదేశ మూలుగుల్ని పట్టి పీల్చే కులం, అంటరానితనం మీద లక్ష్మీనరుసు ఎన్నో ఉద్యమాలు నడిపాడు. కులం వివక్షత మీద తిరగ బడ్డాడు. ఊళ్ళూళ్లూ తిరుగుతూ దక్షిణ భారతదేశంలో ఎన్నో సభలు నిర్వహించాడు. దేశంలో వచ్చే ఎన్నో ప్రాంతీయ, జాతీయ ఆంగ్ల పత్రికలకు ఎన్నో వ్యాసాలు రాశాడు.

'నేషనల్ ఫండ్ అంటే ఇండస్ట్రియల్ అసోసియేషన్' అనే సంస్థను స్థాపించాడు. ఆ సంస్థకు విరాళాలుగా వచ్చే డబ్బుతో నిర్వాహకులు యువకుల్ని, ఆర్థిక వెసులుబాటు లేని విద్యార్థుల్ని సాంకేతిక విద్యనభ్య సించడానికి విదేశాలకు పంపాడు.

అలాగే..1890 ప్రాంతంలో ఆనాటి మద్రాసు రాష్ట్రంలో 4 బౌద్ధ సంస్థలు నిర్వహించాడు. కుల నిర్మూలనకు బౌద్ధం చూపిన మార్గాన్ని వివరించాడు.

## ధర్మపాలతో స్నేహం

భారతదేశంలో బౌద్ధక్షేత్రాల పునరుద్ధరణకు, బౌద్ధవ్యాప్తికి నడుం కట్టిన అనగారిక ధర్మపాలతో ప్రొ॥నరుసుకు 1920లో స్నేహం కుదిరింది. ధర్మపాల స్థాపించిన 'మద్రాస్ మహాబోధిసొసైటీ'కి 20 ఏళ్ళపాటు 1928 వరకూ అధ్యక్షుడిగా ఉండి, సొసైటీ కార్యక్రమాల్ని నడిపించాడు. ఆ తర్వాత 1914లో దక్షిణ భారత బౌద్ధ సంఘానికి అధ్యక్షునిగా ఉండి, 1934లో మరణించేవరకు ఆ పదవిలో కొన సాగాడు.

అంటే..దాదాపు మూడు దశాబ్దాలు దక్షిణ భారత బౌద్ధానికి వెన్నెముకగా నిలిచాడన్నమాట.

## బడుగువర్గాలకు బౌద్ధం

ప్రొ॥ లక్ష్మీనరుసు గొప్ప మేధావి. శాస్త్రవేత్త. దక్షిణభారత మహా బోధి సొసైటీకి వెన్నుదన్ను. తిరుగులేని నాయకుడు. ఆ సొసైటీని స్థాపించిన అనగారిక ధర్మపాలకు ఆప్తమిత్రుడు. అయినా, ఆనాటి మహాబోధి సొసైటీ వారి బౌద్ధ కార్యక్రమాలు అప్పటి సమాజంలోని మేధావులకు, ధనిక వర్గాలకే పరిమితమయ్యాయి. (బహుశా ఇప్పటికి కూడా...)

దుఃఖాన్ని అనుభవించే బడుగువర్గాలకి చేరేది కాదు. ముఖ్యంగా అంటరాని కులాల చెంతకు వెళ్ళేది కాదు. ఇలా చేరకపోవడాన్ని లక్ష్మీనరుసు సహించలేకపోయాడు. మహాబోధి సొసైటీవారితో ఇదే విషయం మీద చర్చించాడు. వారెవరూ అతని దారిలోకి రాకపోయినా పండిత అయోతీదాస్ సహకారంతో నిమ్నవర్గాల్లోకి బౌద్ధాన్ని తీసుకు పోవటానికి బాటలు వేశాడు.

అయితే అనాగరిక ధర్మపాలగానీ, మిగిలిన సభ్యులు గానీ ప్రొ॥లక్ష్మీనరుసుతో కలిసిరాకపోయినా విభేదించలేదు. అడ్డు చెప్పలేదు. గొప్పపండితునిగా, గొప్ప బౌద్ధునిగా శ్లాఘించేవారు. ప్రొ॥లక్ష్మీనరుసు కూడా వారు తన వెంట రాలేదని మహాబోధి సొసైటీని వదిలి వేరే సొసైటీని స్థాపించలేదు. ఈ భిన్న అభిప్రాయాలు ఒకే సంస్థలో ఉండి కూడా సంస్థను మరింత ముందుకు నడిపించాయే తప్ప సంస్థ వినాశ నానికి పాల్పడలేదు.

అందుకే ఇటు అనాగరిక ధర్మపాల, అటు లక్ష్మీనరుసు ఇరువురూ మహోన్నత బౌద్ధులుగా రాణించారు. మార్గదర్శులయ్యారు.

బుద్ధుడు వినయపిటకంలో చెప్పినట్లు "ఒక సంఘంలో అభిప్రాయ భేదాలకు తావు వుంటుంది. అలాంటి భేదాభిప్రాయాల్ని ఆహ్వానించ వద్దు. వాటిని చర్చించుకోవచ్చు. పరిష్కరించుకోవచ్చు. కానీ ఈ భేదాభి ప్రాయాల వల్ల సంఘాన్ని చీల్చనవసరం లేదు" అనే బుద్ధనీతిని నూటికి నూరుశాతం పాటించిన ప్రాజ్ఞులు వారు.

## భౌతికవాది :

ప్రొ॥లక్ష్మీనరుసు బౌద్ధం పట్ల ఆకర్షితులవడానికి దానిలోని

సామాజిక అంశాలు ఒక కారణం కాగా, మరో కారణం దానిలో వుండే వైజ్ఞానిక దృక్పథం. స్వయానా ఆయన సైన్స్ విద్యార్థి, సైన్స్ ప్రొఫెసర్ కావడం వల్ల ఏ విషయాన్నయినా భౌతిక దృక్పథంలోనే ఆలోచించేవాడు. పరిశీలించేవాడు. ఆయన బౌద్ధాన్ని కూడా ఆ దృష్టి తోనే పరిశోధించాడు. బుద్ధుడు చెప్పిన కార్యకారణ వాదం ప్రపంచం నిరంతరం పరివర్తన చెందుతుందనే వైజ్ఞానిక దృక్పథం, ఆయన్ని ఆకట్టుకున్నాయి. మనిషికి భగవంతునికి బానిసలుగా చేసే తత్వం బౌద్ధంలో లేదు కాబట్టి, బౌద్ధంలో మనిషే మహోన్నతుడు కాబట్టి ఆ తత్వం ఆయన్ని బౌద్ధంలో కట్టిపడేసింది.

ఆయనే కాదు, ఆయన కుటుంబ సభ్యులు, భర్త, బిడ్డలు కూడా బౌద్ధ విధానంలోనే కొనసాగారు. ఇది ఒక బౌద్ధ ఉపాసకునిగా గొప్ప విషయం.

### వివేకానందతో...

ఆధునికత పేరుతో సంస్కరణ వాదం ముసుగులో సనాతన వైది కాన్ని బ్రతికించడానికి ప్రయత్నించినవారిలో వివేకానందుడు ఒకరు. కులమత బేధాల్ని, అంటరానితనాన్ని అంగీకరించకపోయినా, మొత్తం ఈ వ్యవస్థను నిర్వీర్యం చేసే మనువాదానికి పునాది అయిన వేదాం తాన్ని మాత్రం నెత్తికెత్తుకుని ప్రచారం చేశాడు.

1893లో చికాగోలో జరిగిన సర్వమత సమ్మేళనానికి అనగారిక ధర్మపాల సూచించగా, ఆయన సహకారంతో ఆయనతో కలిసి వెళ్ళిన వివేకానందుడు, సమ్మేళనం అనంతరం ఇంగ్లండ్ వెళ్ళి నాలుగేళ్ళ తర్వాత భారతదేశం వచ్చి, మద్రాసులో దిగాడు. అక్కడ తొమ్మిది రోజులున్నాడు. ఆ తొమ్మిది రోజుల్లో ఒక రోజున 1897 ఫిబ్రవరి ఐదో తేదీన యన్.కె.రామస్వామి అయ్యర్‌తో కలసి వచ్చిన లక్ష్మీనరసు వివేకానందను కలిసి వేదాంత, బౌద్ధధర్మం మీద రోజంతా చర్చించాడు.

### నాలుగు గ్రంథాలు

ప్రొ॥లక్ష్మీనరసు ఒక ప్రక్క బౌద్ధ సంస్థల్లో పనిచేస్తూ, నాలుగు అద్భుతమైన బౌద్ధ గ్రంథాలు రాశాడు. ఆయనకి చిరకీర్తిని కలిగించే గ్రంథాలు ఇవి. భారతదేశంలో బౌద్ధ సౌధాన్ని తిరిగి నిలబెట్టిన ఈ నాలుగు గ్రంథాలు నాలుగు స్థంభాలే.

ఈయన రాసిన గ్రంథాలన్నీ ఆంగ్లంలోనే రాశారు. ఆనాడు మద్రా సులో ఉండడం, చదువు, ఉద్యోగం, అక్కడే కావడం వల్ల తమిళంలో కూడా పాండిత్యం సంపాదించారు. తమిళనాట జరిగిన ఎన్నో సభల్లో అయోతీదాస్‌తో పాటు పాల్గొని తమిళంలో ప్రసంగించేవారు. అంతే కాదు, దక్షిణ భారత కమ్యూనిస్టు ఉద్యమ పితామహుడైన కామ్రేడ్ సింగారవేలుతో కలసి ఎన్నో ఉద్యమాల్లో, సభల్లో పాల్గొన్నారు. సింగార వేలు కూడా బౌద్ధాన్ని ఆకళింపు చేసుకున్నవాడే. అలాగే పెరియార్ రామస్వామితో కలసి బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమంలో కూడా పాలు పంచుకున్నాడు. చివరికి అన్నాదురై కూడా ప్రొ॥లక్ష్మీనరసు గ్రంథాల్ని చదివి, ఆయన ప్రసంగాలు విని బౌద్ధ ప్రభావానికి లోనయ్యారు.

వీరిద్దరి సహచర్యం వల్ల ఎన్నో సభల్లో ప్రసంగించడం వల్ల చాలామంది లక్ష్మీనరసుని 'తమిళుడు'గానే భావించేవారు.

పైగా తమిళకవి సుబ్రహ్మణ్యభారతితో వున్న ప్రగాఢ స్నేహం ఈ అభిప్రాయానికి మరింత కారణమయ్యింది. ఆంగ్లేయులు తమ రికార్డుల్లో తమిళ రచయిత గానే గుర్తించారు.

అయితే లక్ష్మీనరసుకి తెలుగుభాష మీద కూడా పట్టు వుంది. ఆయన తన డిగ్రీలో 2వ భాషగా తెలుగునే ఎంచుకున్నారు. తెలుగు, తమిళ, ఆంగ్ల భాషల్లో దిట్ట. అయితే వీరు రాసిన ఈ నాలుగు గ్రంథాలు ఇంగ్లీషు గ్రంథాలే.

### ఎస్సెన్స్ ఆఫ్ బుద్ధిజం

భారతదేశంలో బౌద్ధం మీద వచ్చిన తొలినాటి ప్రామాణిక గ్రంథం ఈ ఎస్సెన్స్ ఆఫ్ బుద్ధిజం. అంటే..బౌద్ధ సారం. బౌద్ధ ధర్మంలోని ప్రధాన విషయాల్ని పిండి పిండి, ఆకు పసర్ల నుండి సారం తీసినట్టు కాచి కాచి సారాన్ని వడగట్టినట్టు బౌద్ధ ధర్మంలోని మూలమైన అసలు సిసలైన విషయాల్ని ఏర్చి కూర్చిన గ్రంథం ఇది. 1907లో మొదటి సారిగా అచ్చయిన ఈ పుస్తకానికి అనగారిక ధర్మపాల ముందుమాట రాశారు. ఆ తర్వాత 1912లో రెండో ముద్రణకు నోచుకుంది. ఈ రెండు ముద్రణలకి భారతదేశంలో బౌద్ధ పునరుద్ధరణకి ఆర్థికంగా జవజీవాలు అందించిన ధమ్మమాత టి.ఫాస్టర్ ఆర్థిక సాయం అందిం చింది. ఆ తర్వాత 1934 జులై 14న ప్రొ॥లక్ష్మీనరసు మరణించారు. 1938 నాటికి ఈ పుస్తకం ప్రతులు కనుమరుగై పోయాయి.

అండేడ్కర్ ఈ పుస్తకం గురించి విన్నాడు. ఎంత ప్రయత్నించినా ఆయనకి ఈ పుస్తకం దొరకలేదు. వెతికి వెతికి ఒకసారి కలకత్తాలోని నేషనల్ లైబ్రరీకి వెళ్ళాడు. తీరా అక్కడ చూస్తే...లిస్టులో పుస్తకం వున్న సమాచారం వుంది. కానీ దాని ఆనమాలు లేవు. చివరికి పాడై పోయిన పుస్తకాల జాబితాలో దాని జాడ దొరికింది. చినిగి, నలిగి పోయిన ఆ పుస్తకం చేతికందగానే ఆనందంతో పెద్దగా అరిచాడు అంబేద్కర్

దాన్ని తీసుకుపోయి 1938లో 3వ ముద్రణగా తెచ్చాడు. ఈ 3వ ముద్రణకు అంబేద్కర్ ముందుమాట రాశాడు.

### వాటీజ్ బుద్ధిజం

1916లో వచ్చిందీ పుస్తకం. 'బౌద్ధం అంటే ఏమిటి?' అని తెల్చి చెప్పే గ్రంథం ఇది. దీని 2వ ముద్రణ 1946లో వచ్చింది. ఈ ముద్రణకి దేవీప్రియవాలి సిన్హా ముందుమాట రాశారు. మహాబోధి సొసైటీకి అనగారిక ధర్మపాల తర్వాత నిర్వహణ బాధ్యతలు చేపట్టిన ఆ సొసైటీకి రెండో అధ్యక్షుడే ఈ దేవీప్రియవాలి సిన్హా

ఈ పుస్తకం తొలి ఇంగ్లీషు ప్రతిని జకస్లోవేకియా రాష్ట్రపతి జీన్‌ముసరిక్ చదివాడు. ఎంతో ప్రభావానికి లోనయ్యాడు. దాన్ని జెక్ భాషలోకి అనువదించాడు. ఆ తర్వాత జర్మనీ భాషలోకి కూడా ఆయన ప్రోద్బలం వల్ల అనువదించాడు. ఆ తర్వాత జపాన్ భాష లోకి కూడా అనువదించారు.

ఇప్పటికి జపాన్‌లో పాతికకి పైగా ముద్రణలకి నోచుకున్న గొప్ప గ్రంథం ఇది.

అప్పుడే జెకొస్లేవేకియా రాష్ట్రపతి నుండి పిలుపు రావడంతో 1920లో ప్రొ॥లక్ష్మీనరసు జెకస్లోవేకియా వెళ్ళారు. అక్కడ అనేక సభల్లో బౌద్ధం గురించి ప్రసంగించారు. ప్రచారం చేశారు.

### ఏ స్టడీ ఆఫ్ క్యాస్ట్

కులం, పుట్టు పూర్వోత్తరాలు, భారతదేశంలో కుల ప్రభావాల గురించి అతి లోతుగా రాసిన గొప్ప గ్రంథం ఇది. 'కులం' సమస్య మీద ఈ దేశంలో వచ్చిన మొట్టమొదటి విశ్లేషణాత్మక గ్రంథం కూడా.

1936లో అంబేద్కర్ రాసిన కుల నిర్మూలన గ్రంథానికి పునాది ఈ పుస్తకమే అనేది ఎందరో పండితుల వాదన.

ఈ పుస్తకం అంబేద్కర్ మీద బలీయమైన ప్రభావాన్ని చూపింది అనడం నిర్వివాదాంశం.

**రెలిజియన్ ఆఫ్ ది మోడరన్ బుద్ధిస్ట్**

ఇక ప్రొ॥ లక్ష్మీనరుసు నాలుగో పుస్తకం రెలిజియన్ ఆఫ్ ది మోడరన్ బుద్ధిస్ట్. అంటే ఆధునిక బౌద్ధుని మతం. నిజానికి ఈ పుస్తకం బౌద్ధులకు ఎంతో అవసరం. 2500 సంవత్సరాల నాడు చెప్పిన బౌద్ధాన్ని ఈనాటికీ యధాతథంగా ఉంచాలా? మారిన సమాజానికి అనుగుణంగా మార్చాలా? ఈ ఆధునిక కాలంలో బౌద్ధుడు ఎలా వుండాలి..అని బౌద్ధానికి వినూత్న భాష్యం చెప్పిన గ్రంథం ఇది. దాన్ని 1930లో రాశారు లక్ష్మీనరుసు. మొత్తం 700 పేజీలు. 1932 నాటికి టైప్ చేయించారు. మద్రాస్‌కి పోయారు. ఆ తర్వాత రెండేళ్ళకే చనిపోయారు.

అయితే ఆయన మరణానంతరం ఆయన పుస్తకాలు, గ్రంథాలయం మొత్తం మహాబోధి సొసైటీకి అప్పగించారు. అక్కడే ఈ గ్రంథాలయ కాపీ వుంది. దాన్ని అంబేద్కర్ 1954లో తెప్పించారు. ఎందుకనో ముద్రించలేకపోయారు. ఆయన ఆ తర్వాత 1956లోనే మరణించారు. పనుల వత్తిడి వల్లనో, అనారోగ్యం వల్లనో ఆ పుస్తక ముద్రణ అంబేద్కర్ చేయలేకపోయారు.

అది 2005 దాకా అంబేద్కర్ గ్రంథాలయం లోనే వుంది. అంబేద్కర్ సారస్వతాన్ని కాపాడుకుంటూ వచ్చిన వసంతమూన్ దగ్గర నుండి 2005లో ప్రొ॥అలోసియస్ తీసుకుని ముద్రించారు.

బౌద్ధ ధర్మసారం, బౌద్ధం అంటే ఏమిటి?, కులం దాని మూలాలు, ఆధునిక బౌద్ధుల మార్గం...ఇలా బౌద్ధాన్ని అనేక కోణాల్లో అందించిన ప్రొ॥లక్ష్మీనరుసు– బౌద్ధ పరిభాషలో చెప్పాలంటే..

**బౌద్ధ పునరుద్ధారకుడే కాదు..బౌద్ధ భాష్యకారుడు కూడా.**

ఈయన రచనలో బౌద్ధధర్మసారం అనే పుస్తకం తెలుగులో వచ్చింది. ధమ్మమిత్రులు డి.చంద్రశేఖర్ గారు ఆ పని చేశారు. మిగిలిన పుస్తకాల్ని తెలుగులోకి తేవాల్సిన అవసరం వుంది. బౌద్ధ సంస్థలు ఆ పనికి పూనుకోవాలి.

ఆ పని చేసి
తెలుగువారిగా గర్విద్దాం!
బౌద్ధ పునాదులు నిర్మిద్దాం!

(ప్రొ॥లక్ష్మీనరుసు గురించి తెలుగువారికి తెలియజెప్పిన వారు మాన్య మిత్రులు టి.రవిచంద్‌గారు. ఈ వ్యాసంలో అక్షరాలు నావే అయినా ప్రతి అక్షరానికి ఆయనే అధికారి.వారి కృషికి ప్రణమిల్లుతూ....

సెల్ : 93906 00157

కవిత

## మన పల్లె లెలాగున్నాయి ????

మన పల్లె లెలాగున్నాయి ??
తెల్లని మల్లెల పూపొదల్ని
చల్లని కిరోసిన్‌తో తడిపి
గుట్టుగా మంటల్నెగ తోస్తే....
భగ భగ మండి మాడి
పొగలై రగుల్తున్న
నల్లని బొగ్గుల కుప్పల్లాగున్నాయి !!

మన గ్రామా లెలాగున్నాయి ??
నియంతల అధికారాన్ని ధిక్కరించిన నేరానికి
బలవంతంగా బంధించి శిక్షల్లో భాగంగా
ఒయాసిస్సుల్లేని ఎడారుల్లో వదిలేస్తే ....
ఆకలీ దాహాల్తో తపిస్తున్న
దీనావస్థల బందీల ఆక్రందనల్లాగున్నాయి !!

మన ఊళ్ళెలాగున్నాయి ??
"అధికారం" నాటకంలో ....
తెల్ల పొరల్ని తీసి నల్ల తెరల నెత్తాక
ప్రణాళికల ఆయుధాల్తో సరి చేసే తతంగంలో ....
గ్రానైట్ ఫ్యాక్టరీ కవతల ముక్కల్చేసి పారేసిన
ఆకారాల్లేని వికారాల రాళ్ల దిబ్బల వ్యర్థాల్లాగున్నాయి !!

మన జనపదా లెలాగున్నాయి ??
నిర్లక్ష్యంగా నడిపి పట్టాలను తప్పిస్తే
నిర్జన ప్రాంతంలో ప్రమాదంలో ముంచేస్తే
అంగాంగం విరిగి రక్తం ముద్దలై రోదిస్తున్న



నిస్సహాయ రైలు ప్రయాణీకుల చావు కేకల్లాగున్నాయి !!

మన జనావాసా లెలాగున్నాయి ??
పచ్చిక బయళ్లలో పాల నురుగుల బుగ్గల్తో గెంతులేస్తుంటే
క్రూరంగా చుట్టుముట్టిన కోరల ఘోర మృగాలు
కండలు కండలుగా చీల్చి పారేస్తే...
రక్త మోడుతూ కొన ఊపిరితో కొట్టుమిట్టాడుతున్న
లేగదూడల లేత కళేబరాల్లా గున్నాయి !!

మన పంట పొలా లెలాగున్నాయి ??
నీటిని వాగ్దానం చేసిన అధినాయక గళం
నిర్లజ్జగా మాటలు మార్చేస్తే ముఖాన్ని చాటేస్తే....
వేళ్లకానా ఎండి కాలమై పోయిన
పచ్చని పంట లక్ష్మిని వల్లకాటికి మోస్తూ
దింపుడుకల్లం దగ్గర దిగాలుగా కూలబడి
అంగలారుస్తూ జ్వలిస్తున్న రైతన్నల
వేడి నిట్టూర్పుల్లా గున్నాయి !!

**–సద్దపల్లె చిదంబరరెడ్డి,** 94400 73636

-డా॥వావిలాల సుబ్బారావు
-ఫోన్ : 98664 02973

# సంపన్న యాచకుడు

**మా** చిన్నప్పుడు ఒకాయన తరచుగా మా ఇంటికి వచ్చేవాడు. చూడటానికి దర్జాగా ఉండేవాడు. ఊరించే మంచి కబుర్లు చెప్పేవాడు. వెడుతూ వెడుతూ ఏమయినా ఇమ్మని మా నాన్నని అడిగేవాడు. ఇది అలవాటే గదా అని ఎంతో ఒకింత ఇచ్చి పంపేవాడు మా నాన్న. ఈ దర్జా ఏమిటి, ఈ చెయ్యి చాపటమేమిటి? అర్థం అయిచచ్చేది కాదు నాకు. నేను పెద్దవాణ్ణి అయిన తర్వాత గూడ ఆయన కథ మామూలుగానే నడుస్తున్నది. అతనికి మంచి పెద్ద ఇల్లుంది. సుక్షేత్రమైన పెరుడు ఉంది. చేయి జాపితే నీళ్లు అందే మంచినీటి బావి ఉంది. ఆరోగ్యవంతులైన పిల్లలున్నారు. చదువు సంధ్యలు, తెలివితేటలు, అంద చందాలు, చురుకుదనం, శ్రమచేయగల శక్తి, అన్నీ ఉన్న గంపెడు సంతానం ఉంది. అయినా ఎందుకు ఈయనకీ యాచన అనిపించేది. పొలం గూడ ఉందిట. యాచిస్తాడు. అప్పులడుగుతాడు. మా యింటికేననుకున్నా ...కాదు. చాలా యిళ్లకు వెళతాడుట.

ఈ విషయం పిల్లలకూ తెలుసు. వాళ్ళు అవమాన పడుతుంటారు. మనం కష్టం చేసుకోలేమా? మనం పండించుకోలేమా? మనం వ్యాపారం పెట్టుకోగలం కదా! మన సంపదను మనమే పెంచుకోగలం. ఎందుకీ అప్పులు. మన ఇల్లే తాకట్టు అవుతుందేమో అని లోలోపల కుమిలేవారు. ఒకరిద్దరు కొడుకులు ఒకరిద్దరు కూతుళ్ళు ధైర్యం చేసి అడిగేవారు. స్వాభిమానం గల ఆధునిక తరం గదా మరి.

"మీ మొహం మీకు తెలియదు. సంపద సృష్టించాలంటే నాలుగు వైపుల నుండి పెట్టుబడులు ఆకర్షించాలి. మన ఇంట్లోకి మన పొలంలో వారు తిష్టవేసి సంపద సృష్టించి పెడతారు. ముందు ముందు మనం హాయిగా అనుభవించవచ్చు. ఆ విధంగా ముందుకు పోతాం. మానం అభిమానం అంటూ కూర్చుంటే ముందుకు పోలేం. మనకన్న చిన్న వాళ్ళు ఎంతో ముందుకు పోతావున్నారు. మనం వాళ్లను ఆహ్వానిస్తే వాళ్ళే ముందుకు తీసుకుపోతారు" అని నోరు మూయించేవాడు.

వారి సంతానంలో ఎదిరించగలవారు తక్కువ. ఇద్దరు ముగ్గురు ఒకవేళ ఎదిరిస్తే, ఏ పప్పుచెక్కో, పీచుమిఠాయో, చేతిలో పెట్టి నోరు మూస్తాడు. కొందరు పిల్లలు బజార్లో గుసగుసలు పోతున్నారు.

"మనకు కట్టబెడతామన్నవాళ్లు- అంతా అయిన తర్వాత ఈ యిల్లు మీకు ఇవ్వటం లేదు అని తిష్టవేస్తారేమో! మన పొలం సారమంతా పీల్చేసి ఎడారి చేస్తారేమో" అన్నాడు అందులో పెద్ద బిడ్డ. అతను పాపం చరిత్ర పాఠాలు చదువుకున్నవాడు. గతాన్ని చదివినవాడు గదా! ముందుచూపు ఇంకా పూర్తిగా పోలేదు. "ఒరేయ్! తమ్ముళ్ళూ మన దేశ సంపదను చూసి, వనరులను చూసి ఈస్టిండియా కంపెనీ వాళ్ళు తమంత తామే వెతుక్కుంటూ వచ్చార్రా! అయినా పొమ్మంటే ఓ పట్టాన పోలేదు. మనం కళ్ళు తెరిచి చూసేటప్పటికి ఏకు మేకయి నారు. యిపుడు మనమే కావాలని కోరితెచ్చి ఎర్రతివాచీ పరిచి, హిరణ్యాక్ష వరాలకు తల ఊపితే వాళ్ళను ఎప్పటికయినా వొదిలించుకోగలమా? బానిసత్వం అలవాటయిపోయి "వాళ్ళనే ఉండిపొమ్మనేస్తామేమోరా!" అన్నాడు.

"పరాయి గడపలెక్కి తెచ్చిన పంచభక్ష్య పరమాన్నాలకన్నా పెరట్లోని తోటకూరతో తృప్తిపడి మన సంపదను మనమే వృద్ధి చేసుకుందాం-అని ఆయనకు చెప్పేదెట్లా? మనల్ని, మన శక్తిని, నైపుణ్యాలను చిన్నచూపు చూచి, నిన్నగాక మొన్న కళ్ళు తెరిచిన వాళ్ళ దగ్గర చేయిచాచి దేబిరిస్తుంటే మనకు తల తీసేసినట్లుండదా? బంగారు భిక్షాపాత్రతో అడుక్కుంటే అందులో సత్తు నాణాలు విదిల్చినట్లుందిరా! ఆత్మాభిమానం ఉడుకుతున్నదిరా" అన్నాడు. "అందరం కలసి చెప్పటానికి మనకు తలలు కూడవు. ఆయనకు తలకెక్కదు" అని గొణుక్కున్నాడు.

వాళ్ళలాగే వాళ్ళ తల్లి కూడా. ఆమె మెడలో మల్లెపూదండ వాడిపోయింది. పొరుగింటివారిచ్చే 'మంగళారతులు' ఆగిపోతాయి. పొరుగువాళ్ళు పక్కకు తిరిగి నవ్వుకుంటుంటే కడుపులో వికారపెడుతున్నది. అమరావతీ గుహల అపురూప శిల్పాలు చెక్కిన చేతులు- వారసత్వ సిమెంటు కట్టడాలకు గూడ కొరగావా? చేను పక్కనే గలగలా బిరబిరా కృష్ణమ్మ నీళ్ళు ఎవరికాళ్ళు కడగటానికి! మనవారి భుజశక్తులు, ధీయుక్తులు, ఘనకీర్తులు ఎవరికి వింజామరలు వీచటానికి...అని లోలోపల మధన పడుతుంటే ఎవరు ఓదార్చాలి వారిని. చెప్పగల పైనున్న పెద్దాయన గూడ ఏదో మొగమాటంలో పడ్డట్లున్నాడు.

ఏరోజు తెలుగు దినపత్రిక చూచినా, రాజకీయ వార్తలు విన్నా ఆ యింటి కథనే గుర్తుకు తెస్తున్నాయి. 'రోము' నగరం ఒక్కరోజులో కట్టలేదని ఇంగ్లీషు సామెత. అందుకే ఇప్పటికీ చెప్పుకుంటున్నారు. దృఢంగా ఉంది దాని జ్ఞాపకం. తెల్లవారేటప్పటికే కట్టిన కట్టడం పొద్దుగూకక ముందే కూలిపోతుంది. ఒక మహానగరం కట్టటమంటే-మహా భవనాలు కట్టటం కాదు. మహాసంస్కృతిని నిర్మించటం. పిదప బుద్ధులు, భవనాలు చూసి మురిసిపోతారు. చరిత్ర సంస్కృతినే విలువ కడుతుంది. ఎపుడో కూలే భవనాలను కాదు.

నాలుగు వందల సంవత్సరాల సుదీర్ఘకాలం - 30 మంది విస్తృత రాజవంశం-మూడు సముద్రాల నీళ్ళు త్రాగిన రథాశ్వాలు గల రాజులు ఈ ప్రపంచ చరిత్రలో ఏ దేశంలోనయినా కనిపిస్తారా? ఒక్క ఆంధ్ర దేశంలో తప్ప. "ఓ గోదావరీ నదీ! నీవు తూర్పు సముద్రం దిశగా ప్రవహిస్తున్నావు కదా! చెప్పు. శాతవాహన వంశంతో సమానమయిన గొప్ప వంశం మరేదయినా వుందా?"

"సచ్చమ్ భాణగోదావరీ
పువ్వ సముద్దేణ సహి ఆసంతి
సాలవాహణ కుల సరిసమం
జయితే కులే కులత్థి"

అని ఒక జైన కవి శాతవాహన వంశకీర్తిని గానం చేయటానికి గోదావరీ నదిని సాక్ష్యం అడిగాడు. అది మన వారసత్వం. శాతవాహనుల నాణాలపై నౌకాచిహ్నాలున్నాయి. అవి మనం చేసిన నౌకా వ్యాపారానికి గుర్తు. అవి మన దేశానికి వచ్చిన పరరాజుల నౌకల గుర్తులు కావు.

విదేశాలవట! తెచ్చిపెట్టారు! ఎంతైనా మన తెల్లపూలూ
తెలుగు పూల అందం వీటికెక్కడొస్తుందమ్మా?!



భారతదేశంలో ఇద్దరు గొప్ప యాచకులున్నారని అనేవారు. నిమ్మకాయ దానం చేసినా, రూపాయి ఇచ్చినా స్వీకరించిన మహాత్మాగాంధీ బోసినవ్వుతో దేశసేవకు పూలు సేకరించినట్లు సేకరించాడు. లక్షకు తక్కువ అయితే చేయి జాపని మదన్‌మోహన్ మాలవ్యా జమీందారులనే ధీమాగా యాచించి బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం నిర్మించాడు. సరిహద్దు దాటకుండా స్వాభిమానపు హద్దు చెరగకుండా యాచించారు. యాచనలోనూ కొన్ని విలువలుంటాయి.

**కుటుంబ అభివృద్ధి మీద కోర్కె ఒక్కటి చాలదు. వస్తు సంపద కన్నా ఆత్మగౌరవ సంపద ఇంకా ముఖ్యం. మనం విస్తరించటమా? విస్తరించేవారికి విస్తళ్ళు వేయటమా? స్వంత పూలదండలతో అలంకరించుకోవటమా? అరువు వజ్రాల నగలు పెట్టుకొని కులుకుతూ పరాయి పరమాన్నంతో త్రేన్పటమా? తేల్చుకోని సందేహం కలుగుతున్నది స్వాభిమానులకు. ఆత్మగౌరవం కోసం రాష్ట్రం సాధించుకున్న వారసత్వం గదా మనది?!** ❊




మద్రాసు విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖవారు మార్చి 30,31లలో నిర్వహించిన 'తెలుగు నాటక సాహిత్యాలు–సామాజిక ప్రయోజనం' అనే జాతీయ సదస్సు దృశ్యం. చిత్రంలో ప్రముఖ సినీ కవి భువనచంద్ర, రచయిత గుడిమెట్ల చెన్నయ్య, మద్రాసు విశ్వవిద్యాలయంలో తెలుగు ఆచార్యులు సంపత్‌కుమార్, విస్తాళి శంకరరావు తదితరులున్నారు.

-మధురాంతకం నరేంద్ర
ఫోన్ : 98662 43659

# పాడవేమమ్మ కోకిలా, పాడవేమె?

**మా**ర్చి నెల 'అమ్మనుడి'లో వచ్చిన డా॥బి.ఎస్.రామకృష్ణ గారి వ్యాసం 'భాషల సామర్థ్యం' చదువుతూ శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానాన్ని అందించడంలో తెలుగుభాషకుండే సామర్థ్యాన్ని గమనిస్తుండగా, చిత్రంగా నాకెందుకో వేంకట పార్వతీశ్వర కవుల 'ఏకాంతసేవ' జ్ఞాపకం వచ్చింది. మృదుమధురమైన అంశాలను గూడా తెలుగంత గొప్పగా వ్యక్తపరచగలిగిన భాష మరొకటి లేదని స్ఫురించింది.

కాళిదాసును సంస్కృత భాషకున్న షేక్స్పియరనీ, కౌటిల్యుణ్ణి భారతదేశపు మాకియవెల్లీ అనీ పిలవడంలాగే తెలుగును తూర్పు భూగోళపు ఇటలీభాషగా పిలవడం కూడా మనమింకా వదిలించుకోలేక పోతున్న సామ్రాజ్యవాద ప్రభావాన్ని నిరూపిస్తోంది. పాశ్చాత్యులు మన కవులనూ, శాస్త్రవేత్తలనూ యీ ధోరణిలో గౌరవించడం కనబడదు. గొప్పవాళ్ళు యెక్కడివాళ్ళయినా గౌరవించవలసిన వాళ్ళే. అయితే యిందులో ఆత్మ న్యూనత వుండడం సబబు కాదు.



తెలుగంత సంగీతాత్మకమైన భాషలు ప్రపంచంలోనే చాలా తక్కువ అన్నది విజ్ఞులందరూ వొప్పుకునే మాటే. బెంగాలీ, హిందీ, సంస్కృతం, ఫ్రెంచీ, యింగ్లీషు వంటి అనేక భాషల్లో పండితులైన తమిళ మహాకవి భారతి 'సుందర తెలుగు' అని కేవలం తెలుగును తప్ప మరో భాషను పొగడలేదు. 2005వ సంవత్సరంలో కేంద్రసాహిత్య అకాడమీ వాళ్ళ ప్రతినిధిగా నేను మెక్సికోకు వెళ్ళాను. అప్పుడక్కడొక రచయితల సమ్మేళనంలో తెలుగు కథానికను చదవవలసి వచ్చింది. అక్కడ హాజరైన వాళ్ళెవరికీ-నాతో పాటు వున్న ప్రతినిధి బృందంలోని హిందీ, మరాఠీ రచయితలతో పాటుగా తెలుగు రాదు. అయితే అప్పుడా కథను విన్నవాళ్ళందరూ ముక్తకంఠంతో తెలుగు గొప్ప సంగీతాత్మక భాషగా పొగిడారు. తెలుగంత గొప్ప సంగీతాత్మక భాష మరొకటి లేదని నిరూపించడానికొక గొప్ప ఉదాహరణ కూడా వుంది. అదే 'ఏకాంతసేవ'.

చలికాలపు తెల్లవారుజామున, ఓ పల్లెటూరి గుడిసింటిలోపల, మా నాన్న కప్పుకున్న దుప్పటిలోకి దూరి, ఆయన ఒడిలో కూర్చుని, ఆయన వల్లించే 'ఏకాంతసేవ'ను వినడం నా తొలి చిన్ననాటి జ్ఞాపకం. అప్పుడు నా వయస్సు నాలుగైదు సంవత్సరాలను దాటి వుండదు. ఆ గీతాల భావమేమిటో నాకు తెలిసే వుండదు. కానీ ఆ సంగీతాత్మకతకు పరవశం గావడం మాత్రం నాకింకా స్పష్టంగా గుర్తుంది. మా నాన్న కూడా యెన్నో తెలుగు కావ్యాలను ఎలుగెత్తి చదివేవారు. కానీ ఏకాంతసేవను చదివినంత తన్మయతతో ఆయన మరేదీ చదవలేదు.

మధురముగ, మార్దవముగా మంగళముగ
మానసానందకరముగా, మంజులముగ
పాడవేమమ్మ కోకిల, పాడవేమె?

'ఏకాంత సేవ'కు పీఠిక రాస్తూ, ప్రముఖ భావకవి దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు బెంగాలీ భాషకు 'గీతాంజలి' యెలాంటిదో, తెలుగుకు 'ఏకాంతసేవ' అలాంటిది అంటారు. రవీంద్రుని కవిత్వంలోనూ, రవీంద్ర సంగీతంలోనూ ఏకాంతసేవలో వుండే గొప్ప మార్దకత, లయాత్మకత కనిపిస్తాయి. కానీ రవీంద్రుని గీతాంజలిలో చాలా పెద్ద పెద్ద దేశభక్తి భావాలూ, గాఢమైన మార్మిక ధోరణులూ వుంటాయి. కానీ సౌకుమార్యంలోనూ, మార్దవతలోనూ 'ఏకాంతసేవ' గీతాంజలి కంటే ముందుంటుంది.

'ఏకాంతసేవ'లో వుండే 62 గీతాలు, దేశీఛందస్సుకు చెందిన మంజరీద్విపద, తేటగీతి, ఆటవెలదులనే యెన్నుకున్నాయి. యీ గీతాలన్నింటిలోనూ ఒక ప్రేమికుడు/ప్రేమికురాలు తన దివ్య ప్రేమికుడి కోసం విరహంతో ఆలాపించడమే వస్తువు. యీ గీతాలు మీరా గీతాల్ని తలపిస్తాయి. అయితే యిద్దరు మానవులు కలిసి ఒకే గీతం గానీ ఒకే రచనను గానీ రాయడమెలా సంభవమో నాకు అంతు బట్టడం లేదు. జీవించడం లాగా, మరణించడం లాగా సృజన చేయడం గూడా ఒంటరిగా మాత్రమే చేయగలిగిన పని. తమ ఏకోన్ముఖ సృజన జరిగిన పద్ధతిని జంట కవులెవరూ వివరించి చెప్పలేదు. అయితే దాంపత్యం లాగా, స్నేహంలాగా, జంట రచన గూడా గొప్ప నాగరికతను సూచిస్తుంది. వేంకట పార్వతీశ్వర కవులు గొప్ప నాగరికులు. 'ఏకాంతసేవ'లోని గాయని/గాయకుడు తనను స్త్రీ గానూ, భగవంతుణ్ణి పురుషుడిగానూ భావిస్తాడు. యీ సంబంధాన్ని ప్రకృతి- పురుషుడు సంబంధంగానూ, ఆత్మ-పరమాత్మల సంబంధంగానూ గూడా వ్యాఖ్యానించవచ్చు.

'ఏకాంతసేవ' లోని గాయకుడు తనను స్త్రీగా భావిస్తూ తన ప్రియుడి విరహపు బాధను రకరకాలుగా పలవరిస్తాడు. ఆ బాధెంతో తీయగా వుండడమే వైచిత్రి. బహుశా తన ప్రియుడికి యింతకంటే ముఖ్యమైన పనులుండి వుంటాయన్న నమ్మకం ఆ విరహాన్ని అవగాహనగా పరిణితికి చేర్చివుండవచ్చు. ఆ అవగాహనపైన ఎంతో నమ్మకమున్నప్పటికీ, అతను లేకుండా జీవించలేక పోవడమూ, అతను లేని జీవితం అర్థహీనంగా తోచడమూ గూడా వుంది. అర్థ వంతమైన



విరహానికీ, స్వాభావికమైన బాధకూ మధ్య వుండే సున్నితమైన దారిలో యీ గీతాలన్నీ ప్రయాణం చేస్తాయి.

సంగీత వాయిద్యాలు ఎన్నో వున్నా, గుండెకు గొంతులా వీణ ధ్వనించినంత విస్పష్టంగా మరో వాయిద్యం ధ్వనించలేదు. వీణపై పలికిన మృదుమాధుర్యమైన పాటల్లా ఏకాంతసేవ గీతాలు నిన దిస్తాయి.

కొండగుహల్లో వూరే నీటివూటల్లా స్వచ్ఛంగా, తేటగా, పర్వత శిఖరాలపైన వీచే గాలుల్లా శుభ్రంగా, హాయిగా, వుదయాన్నే కోనేట్లో విరిసిన తామరల్లా ప్రకాశవంతంగా, ఏకాంతసేవ గీతాలు చెవుల్లో అమృతాన్ని కురిపిస్తాయి. వాటిని మనం ఎలుగెత్తి పాడుకోగలం. అయితే అర్థాన్ని వివరించమంటే, వ్యాఖ్యానాలు చేయమంటే మాత్రం యిబ్బంది పడిపోతాం. మాటలే స్వరాలైన సంగీతం అది. స్వరాలే మాటలైన కవిత్వమది. అటువంటి సాహిత్య కచేరీ మరే యితర భాషలోనూ జరిగి వుండదని అనిపిస్తుంది. 'ఏకాంతసేవ' తెలుగు వాళ్ళకు మాత్రమే స్వంతమైన అపూర్వ కావ్యం.

ఎప్పుడో 1938లో కాకినాడలో ఆంధ్రప్రచారిణీ లిమిటెడ్ వాళ్ళు ప్రచురించిన యీ పుస్తకానికి యింగ్లీషులో పీఠిక రాస్తూ పి.రామ స్వామి గారు సెయింట్ బెర్నార్డ్‌నూ, విలియం వర్డ్స్ వర్తునూ, సూఫీ కవి మీర్జానూ, భారత వైష్ణవ కవులనూ జ్ఞాపకం చేసుకున్నాక, చేతు లెత్తేసి, యీ పుస్తకాన్ని వ్యాఖ్యానించలేననీ, కేవలం తన పరవశాన్ని వ్యక్తపరచడానికి ప్రయత్నిస్తాననీ తేల్చేశారు. తన తెనుగు పీఠికలో కృష్ణశాస్త్రి గారు మాత్రం "తిరుగ నీనాటికాంధ్ర సారస్వతమునకు వసంతోదయమైనది; నవజీవనము కలిగినది; నూతన రామణీ యకము చేకూరినది. వల్లరులకొక క్రొత్తసౌకుమార్యము, చివురులకొక క్రొత్త మెత్తందనము, ప్రసవములకొక క్రొత్త కమ్మదనము, మకరంద మునకొక క్రొత్త మాధుర్యము, కలకంఠమున కొక క్రొత్త కంఠస్వరము –ఈ వసంతము వనలక్ష్మికొక క్రొత్తశోభ, ఒక వింత సౌందర్యము, ఒక యపూర్వలావణ్యము! ఆంధ్ర సారస్వత చరిత్రములో నొక నూతన శకము ప్రారంభమైనది" అన్నారు.

పోతన, అన్నమయ్య, నన్నెచోడుడు మొదలైన తెలుగు కవు లందరిలోని మార్దవాన్నీ, మాధుర్యాన్నీ, మానసానందకరంగా రంగ రించి కవిత్వాన్ని తయారుచేస్తే అది ఏకాంతసేవలా వుంటుంది. ఇంత రాసినా, రాస్తున్నంతసేపూ, 'ఏకాంతసేవ'లోని విశిష్టతను వివరించడానికి కేవలం మళ్ళీ దాన్ని చదవడం మాత్రమే మంచి మార్గంగా అవగతమవుతోంది.

రండి. పరవశంగా పాడుకుందాం.

**"ప్రణయ వనంబు లోపలి పుష్పరథము**
**తుమ్మెదా! వేవేగ తోలి తేవమ్మ".**

❋




మార్చి 27న విజయవాడ బందరురోడ్డులో గల ఎం.బి.భవన్‌లో జరిగిన కార్యక్రమంలో మల్లెతీగ ప్రధాన పురస్కారం అందుకుంటున్న జి.నరసింహస్వామి (నిజామాబాద్). చిత్రంలో మల్లెతీగ వ్యవస్థాపకుడు కలిమిశ్రీ, పద్మశ్రీ డా॥తుర్లపాటి కుటుంబరావు, వేముల హజరత్తయ్య గుప్తా, ప్రపంచ పర్యావరణవేత్త ప్రొ॥ఎన్.ఎన్.మూర్తి, ఏపీ ఎలక్ట్రిసిటీ ఎంప్లాయీస్ యూనియన్ 327 ఉపాధ్యక్షుడు కూచి మధుసూదనరావు, ఆంధ్రప్రదేశ్ రచయితల సంఘం అధ్యక్షులు సోమేపల్లి వెంకటసుబ్బయ్య, జర్నలిస్ట్ విశ్వనాథం రవికుమార్ ఉన్నారు.

# వేకువ

బోయినపల్లి రమణ

**స్కూల్లో వంటర్ బెల్ గణ గణ మోగింది. ....మాకు బో సంతోషం అయ్యింది. ఎందుకంటే బడి బయట కోళ్ళ సుబ్బమ్మ గంప పెట్టుకుని పిప్పరమెంట్లు, బొరుగుముద్దలు, బొంగులు, పప్పులు అమ్ముతాంటది. పొద్దున్న బడికి వచ్చేటప్పుడు అమ్మ ఇచ్చిన పదిపైసలొ, ఇరవై పైసలో మాకాడ కొనుక్కోవడానికి వుంటాయి. అందరం బుక్కులు పక్కన పడేసి బిరబిర బైటికి వురికినం. నేను బొంగులు కొనుక్కున్నాను. ఈరిబద్రిగాడు పప్పులు కొనుకున్నాడు. పీరిగాడు పిప్పరమెంట్లు కొనుకున్నాడు. సుబ్బమ్మకు ఎందుకో నేను అంటే శానా ఇష్టం.**

అందరికంటే నాకు రోన్ని ఎక్కువ ఇచ్చేది. రవనయ్య శానా మంచోడు, బంగారు కొండ అని నన్ను ఎప్పుడు ముద్దు పెట్టుకుంటాది. ఆమె అట్లా నన్ను అన్నప్పుడు నాకు బో సంతోషం అనిపిస్తది. అది చూసి మా సావాసగాల్లకు శాన కుళ్ళు పుడుతుంది. అందరం మేము కొనుక్కున్న వాటిని పంచు కుని తిన్నాము. ఇంగ టైం అయితదని స్పీడుగా కంపచెట్ల కాడికి ఉరికి, వరసగా నిలబడి వంటేలు పోసుకుంటున్నాము. పీరిగాని నిక్కరుకు గుండీలు ఊడిపోయినై. వాడు నిక్కరుకు పిన్నీసు పెట్టుకుంటుంటే పాపం కుచ్చుకుంది. బ్యార్ మన్నాడు. అందరమూ నగినం.

సర్లే ఇంగ పోదాం పా అని బల్లోకి పోతాంటే, దూరం నుంచి ఎద్దులబండికి మైకు కట్టుకుని ఏందో చెప్తూ వస్తున్నారు. ఎందబ్బా, అని ఆగి సూసినాం, మైకులో ఒక ఆయన చెప్తున్నాడు, ఏందంటే ....” శంకారం గ్రామ పెజలకు తెలియజేయడం ఏందంటే, ఈరోజు రాములోరి గుడికాడ ఆట వుంటాది. తప్పకుండా అందరు వచ్చి సూసి, సంతోషపడి తునమొ, పణమో మాకు ఇచ్చె శాన సంతోష పడతాము. రాత్రికి అందరు బువ్వ తిని ఎనిమిది గంటల కల్లా రాములోరి గుడి కాడికి రావాలసిందిగా కోరుతున్నాము” అది వినగానే మాకు శాన ఆనందం ఏసింది.

బొమ్మలాట శానా బాగుంటాది. కేతిగాడు, బుడ్డ కేతిగాడు, బంగారక్క శేసే పనులు చూస్తె బో నగు వచ్చుది. ఎట్టయినా సరే రాత్రికి సూడాల, అనుకుని బల్లోకి వురికినం.



రాత్రి బువ్వ తిన్నాక, బొమ్మలాట కాడికి ఎట్టా బొవాలబ్బా, అని అనుకుంటున్నాను. మా నాయన అంటే నాకు శానా భయ్యము. ఆయనను సూస్తె నాకు నిక్కరలోనే వుచ్చ పడతాది. ఎట్టబ్బా...?? అనుకుంటుంటే "ఏమిరా ఇంగా పండుకోలేదు?" అని మా యమ్మ అడిగింది. "అమ్మా బొమ్మలాట కాడికి పోతా," అన్నా..." నాకు తెల్దు నాయనా మీ నాయనకు తెలుస్తే సంపేస్తాడు, బొమ్మలాట లేదు గిమ్మలాట లేదు పోయి పండుకోపో" అని అమ్మ అన్నది. నాకు బో ఏడుపు వచ్చింది, అది చూసి అమ్మకు గూడక బాధ అనిపించింది" సరేలే మీ నాయనకు తెలియ కుండా పోయిరా, తొందరగా వచ్చి పండుకో. మంచానికి దోమతెర ఏసుకుని పో, నువ్వు పండుకున్నవని, మీ నాయనకు చెప్పుతాలె" అని చెప్పింది, నాకు బో సంతోషం ఏసింది. దోమతెర ఏసి, బేగ ఉరికిన, రెండు రోజులు బొమ్మలాట చూసి బో నవ్వుకున్నాం.

ఇంగ రెండు రోజులఆట మిగిలి వుంది. ఆరోజు ఆదివారం బడిలేదు. నేను మద్యానం బువ్వ తిని బొమ్మలాట వాళ్ళు వుంటే కొట్టం కాడికి పోయిన. వాళ్ళు ఆ రోజు రాత్రికి అడిపించే ఆట కోసం తోలుబొమ్మలు రెడి చేసుకుంటూ వున్నారు. నన్ను చూసి అందులో ఒక ఆయన, ఆయన పేరు బెమ్మయ్య, "రా సామి బువ్వ తిన్నావా?" అని అడిగినాడు, "ఆ ఇప్పుడే తిని వస్తాండా" అని చెప్పిన, "నువ్వు తిన్నావా?" అని అడిగిన.

ఆ తిన్నాం సామి, అన్నం తిన్నాం వక్కాకు ఏసుకుందాం అంటే లెక్కలేదు, ఆ బంకు పాండయ్యను అడిగితే, లెక్క లేకుండా వక్కాకు ఇయ్యను, అప్పు లేదు అని చెప్పి నాడు, నోరంతా ఒకటే పీకుతాంది సామి" అన్నాడు ఆయన్న బాధగా, నాకు శానా బాధ అనిపించింది. "పాపం వక్కాకు కొనుక్కోవ దానికి కూడా ఈల్లకాడ లెక్కలేదు" అని పించింది, కాసేపు ఆలోచించినా, చిన్న ఆలో చన వచ్చింది" ఒక్క నిమిషం బెమ్మయ్యా ఇప్పుడే వచ్చా" అని ఆయన్న పిలుస్తున్న యినకుండా ఉరికిన.

పొద్దున్న మా నాయన పూజ చేసుకుని దేవునికాడ తాంబూలం అందులో రెండు రూపాయల లెక్క పెట్టినాడు. అది గుర్తు వచ్చింది నాకు. నాయన నిద్రబోతావున్నాడు. దేవుడి కాడికి పోయిన. సూస్తే వక్కాకు లేదు. నాయన ఏసుకుని పండుకొని ఉంటాడు. ఎట్లా అనుకున్నాను, అయితే దచ్చినగా పెట్టిన రెండు రూపాయల లెక్క మాత్రం ఆడనే వుంది. చప్పుడు కాకుండా ఆ లెక్క తీసుకుని, బెమ్మయ్య కాడికి వచ్చి, "ఇదిగో బెమ్మయ్యన్నా ఈ లెక్క తీసుకుని వక్కాకు కొనుక్కోపో" అని ఇచ్చినా. అది తీసుకుని ఆయన్న చాల ఆనందంగా" రవనయ్యా ఎంత మంచోడివయ్యా, మీ నాయన లాగే నీగ్గూడగా మంచి గుణం ఇచ్చినాడు ఆ దేవుడు. మీ నాయన మాకు శానా సాయం చేసినాడు. శాన గొప్పోడు, నువ్వు గూడక ఆయన లాగే గోప్పోడివి అవుతావు" అని ఆయన్న నా బుగ్గలు నిమిరి, నుదిటికి మెటి కలు ఇర్సుకున్నాడు. అది నాకు శాన బాగా అనిపించింది మనసులో.

ఇంగ ఆడినుండి బజారులోకి వచ్చి పిల్ల కాయలతొ కలిసి ఆడుకుని, ఇంటికి వచ్చిన. నేను ఇంటి కాడికి పోగానే మా నాయన శానా కోపంగా పంచలో కూకోని వున్నాడు. నాకు శాన భయ్యం యేసింది. నన్ను చూడ గానే మా నాయన లేచి వచ్చి నన్ను పట్టుకుని ఈపంతా పగలగొట్ట సాగాడు. "నా కొడకా నీకు ఈ వయసు నుండే దొంగ బుద్దులు వచ్చినాయా? నీకు కొనుక్కోవాలంటే నన్ను అడుగుతే రెండు రూపాయల లెక్క ఏంది? ఇరవై రూపాయల లెక్క అయినా ఇచ్చ గదా? ఇట్టా దొంగతనం నేర్సుకుంటే నువ్వేం బాగు పడతావ్?" అని ఇంగా కొట్టసాగాడు. మా యమ్మ అడ్డమొచ్చినా ఇనలేదు. నాకు శానా నొప్పి అనిపించి ఏడుస్తూనే వున్నాను. ఈ లోపు తోలుబొమ్మలాట ఆయన్న బెమ్మయ్య అక్కడికి వచ్చినాడు. "ఏందీ సోమీ చిన్న య్యను అట్లా కొడతాండవు? ఏమి చేసిండు?" అని అడిగాడు. నాయన ఆయన్నకు నేను దేవుడికాడ లెక్క తీసిన సంగతి చెప్పిండు. అది విని బెమ్మయ్య శానా బాధ పడుతూ "అయ్యయ్యో సోమీ, రవనయ్య దొంగతనం చెయ్యలేదు, ఆయన గుడకా నీలాగే శాన మంచోడు" అని మద్యానం జరిగింది అంతా మా నాయనకు చెప్పాడు. అది విని మా నాయన, మా యమ్మ ఒడిలో పండుకుని ఏడుస్తున్న నన్ను ఎత్తుకుని నా కళ్ళ నీండ్లు తుడుస్తూ "శమించు రా రవనా, జరిగింది తెలుసుకోకుండా నిన్ను కొట్టినాను. ఎవరి కైనా సాయం చెయ్యాలనుకుంటే నన్ను అడుగు, నేను ఇస్తా" అని నా నుదిటి మీద ముద్దు పెట్టినాడు. ఆ క్షణంలో నా బాధ మటుమాయం అయినాది. మా నాయన నన్ను తిట్టి, కొట్టింది గుర్తు లేదుగాని, ఆ నిమిషం లో నాయన కండ్లల్లో మెరిసిన తడి నాకు ఇప్పటికీ గుర్తుంది.

*(నాకు ప్రపంచాన్ని చూపించి, ఈ లోకంలో వాళ్ళ జ్ఞాపకాలని నాకు తోడుగా వుంచి తిరిగిరాని లోకాలకి వెళ్ళిన మా అమ్మ, నాన్నలకి ఈ కథ అంకితం)*

-ఫోన్ : 8143000553



మార్చి 2న విజయవాడ రామకోటిక్షేత్రంలో ఆంధ్రా ఆర్ట్స్ అకాడమీ నిర్వహించిన సభలో తెలుగు భాషా సాహిత్యాలపై కృషి చేస్తున్న డా॥ద్వానాశాస్త్రిని పుష్పాభిషేకంతో సత్కరించిన పద్మభూషణ డా॥యార్లగడ్డ లక్ష్మీప్రసాద్. డా॥గుమ్మా సాంబశివరావు, డా॥వెన్నా వల్లభరావు, డా॥జి.వి.పూర్ణచంద్, గోళ్ళ నారాయణరావు ఉన్నారు.

–చలసాని నరేంద్ర

# తెలుగుతనం మచ్చుకైనా కనిపించని అచ్చం సంకరజాతి రాజధాని అమరావతి




ప్రపంచంలోనే తెలుగువారు గర్వపడే విధంగా అత్యుత్తమ రాజధాని నగరంగా అమరావతిని తీర్చి దిద్దుతామని ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు అంటూ ఉంటే ఆంధ్రుల సంస్కృతి, సాహితి, కళా పరంపర వైభవాలకు అద్దంపట్టే విధంగా, అచ్చం తెలుగుతనం ఉట్టిపడే విధంగా బ్రహ్మాండంగా నిర్మాణం చేపడతారని అందరం ఆశించాం. ప్రపంచంలోనే అతి ప్రాచీన భాష, సాహితీ, సాంస్కృతిక వైభవం గల తెలుగువారి సంస్కృతి, శిల్పకళ, చారిత్రాత్మక ప్రాశస్త్యాన్ని గుర్తు తెచ్చే విధంగా నిర్మిస్తారని ఎదురుచూశాం. ప్రపంచ వ్యాప్తంగా వివిధ వృత్తి, ఉద్యోగాలలో రాణిస్తూ తెలుగుతనం కీర్తి ప్రతిష్టలను నలుచెరగులా చాటుతున్న తెలుగువారు గర్వపడే విధంగా, వారందరికీ స్ఫూర్తి కేంద్రంగా రాజధాని నగరం ఏర్పడగలదని ఆశించాం.

**అయితే జరుగుతున్నది వేరు. రాజధాని నగరం పేరుతో విడుదల చేస్తున్న నమూనా భవన సముదాయాలను చూస్తూ ఉంటే గందరగోళం ఏర్పడుతున్నది. ప్రభుత్వంలో అసలు ఏ విషయంలో పారదర్శకత కనిపించడం లేదు. రాజధాని నగరం నిర్మాణంలో తెలుగు ప్రజల భాగస్వామ్యం ఏమాత్రం ఉండటం లేదు. నమూనాలు తయారు చేయడంలో, నిర్మాణాలు చేపట్టడంలో ప్రపంచ వ్యాప్తంగా అనుభవం గల, ప్రతిష్టను సంపాదించుకున్న తెలుగు వారెందరో ఉన్నా వారెవ్వరి ప్రమేయం ఉండకుండా కొద్దిమంది వ్యక్తుల ఇష్టాయిష్టాల ప్రకారం జరుగుతున్నది. అంతా విదేశీ కంపెనీల హడావుడి, ప్రాబల్యం ప్రతి విషయంలో వెల్లడవుతున్నది. ఇదంతా తెలుగు వారికి అడుగడుగునా అవమానాలకు గురిచేయడమే అవుతున్నది.**

తాజాగా ఇప్పుడు జపాన్‌కు చెందిన మాకి వారి డిజైన్స్‌ను ప్రకటించారు. వీరు ఐక్యరాజ్యసమితి, 'నానాజాతిసమితి', ప్రపంచ వాణిజ్య సముదాయం, టొయోటో లాంటి అనేక భవనాలకు రూప కల్పన చేశారని చెబుతున్నారు. అయితే వారికి ఆంధ్రుల సంస్కృతి, చరిత్ర, కళా నైపుణ్యాల పట్ల ఏమాత్రం అవగాహన వున్నదో, కనీసం అవగాహన చేసుకోవడానికి వారేమైనా ప్రయత్నం చేశారో లేదో తెలియదు. ప్రజల రాజధానిగా అమరావతిని నిర్మిస్తామని ప్రకటించిన ప్రభుత్వం ఆ బాటలో వెళ్ళటం లేదని మాత్రం ఈ నమూనాలను చూసిన వారందరికీ స్పష్టం అవుతుంది.

భారతదేశ చరిత్రలోనే అద్భుత అధ్యాయాలుగా గణుతికెక్కిన విజయనగరం, కాకతీయ, శాతవాహనలతో పాటు శివాజీ సామ్రాజ్యాల నిర్మాణం, పోరాట వైభవాలు తెలుగువారి కీర్తి ప్రతిష్టలకు, కళా నైపుణ్యాలకు అద్దంపట్టే విధంగా నిలిచాయి. ఆయా చారిత్రాత్మక, సాంస్కృతిక వైభవాలను ఈ సందర్భంగా పరిగణనలోకి తీసుకొనే ప్రయత్నం కూడా చేయకపోవటం విచారకరం. అమరావతి నగరం నిర్మాణం గురించి ఎందరో ప్రముఖులు, నిపుణులు తెలుగుతనం ఉట్టిపట్టి ఉండే విధంగా ఉండటం కోసం ప్రభుత్వానికి సవివరమైన నివేదికలు సమర్పించారు.

సింగపూర్ ప్రభుత్వం నమూనాలపై సహితం అధ్యయనం చేసి అభిప్రాయాలను వ్యక్తం చేశారు. అయితే అవేమీ ప్రభుత్వ పరిశీలనకు సహితం యోగ్యంగా కనిపించక పోవడం దురదృష్టకరం. ఇదంతా ప్రభుత్వంలోని పెద్దలలో నెలకొన్న విదేశీ వ్యామోహమో, ఇతరత్రా ప్రయోజనాల కారణంగాతెలుగువారి ప్రతిష్టాత్మక, వైభవోపేత చరిత్రకు నిలువుటద్దంగా ఉండేవిధంగా రాజధాని నగరం నిర్మించుకొనే

ఒక చారిత్రాత్మక అవకాశాన్ని కోల్పోతున్నాం.

ఈ సందర్భంగా నిర్మిస్తున్న భవనాలలో అత్యాధునిక సదుపాయాలతోపాటువాటిని హరిత భవన సముదాయాలుగా తీర్చిదిద్దే ప్రయత్నాలు స్వాగతనీయమే. అయితే ఈ సందర్భంగా ప్రభుత్వం పూర్తి వివరాలను తెలుపకుండా ఎంతో గోప్యత ప్రదర్శిస్తూ ఉండటం కారణంగా పలు అనుమానాలకు సహితం ఆస్కారం కలుగుతున్నది.



బాహుబలి సెట్టింగ్ వలే రాజధాని నగర భవన సముదాయం నిర్మాణం అత్యద్భుతంగా ఉంటుందనే ప్రచారం విస్తృతంగా జరుగుతున్నది. అయితే ఈ సందర్భంగా ప్రభుత్వం విడుదల చేస్తున్న నమూనాలు మరింత గందరగోళానికి దారితీస్తున్నాయి. గత సంవత్సరం సింగపూర్ ప్రభుత్వం 'ఉచితంగా' రాజధాని నగర నమూనాను తయారు చేసి ఇచ్చిందని, 'అమరావతి చిత్రాలు' ఎన్నో విడుదల చేశారు. వాటి గురించి ఇంకా విస్తృతంగా ప్రచారం జరుగుతున్నది. ప్రభుత్వం అన్ని అధికార పత్రాలలో, కార్యక్రమాలలో ఈ చిత్రాలను విస్తృతంగా వాడుతున్నారు. విజయవాడలోని ముఖ్యమంత్రి కార్యాలయంలో సహితం ఈ చిత్రాలు ప్రదర్శిస్తున్నారు.

ఆ చిత్రాలను అట్లాగే ఉంచి ఇప్పుడు జపాన్‌కు చెందిన మాకీ అసోసియేట్స్ ఖరారు చేసిన నమూనాలను ఎంపిక చేసినట్లు ప్రభుత్వం ప్రకటించింది. ఈ నమూనాల ఖరారుకు జపాన్ కంపెనీకి ప్రభుత్వం 90 కోట్ల రూపాయలు చెల్లించాల్సి వుంటుందని, దీన్ని తగ్గించేందుకు చర్చలు జరుపుతున్నట్లు మంత్రి నారాయణ ప్రకటించారు. అయితే సింగపూర్ ప్రభుత్వం తయారు చేసిన నమూనాలు ఏమయ్యాయి?ఇంతలో జపాన్ సంస్థ నమూనాలు ఎందుకు అవసరం అయ్యాయి?

**మాకీ సంస్థ అందించిన డిజైన్లపై మాత్రం సర్వత్రా విమర్శలు వెల్లువెత్తుతున్నాయి. అంటే అసలు తొలుత విడుదల చేసిన 'అమరావతి చిత్రాలు' ఏమిటి? అవి ఎక్కడ వస్తాయి. అసలు వస్తాయా? రావా అన్నది ఇప్పుడు అందరి మదిలో ప్రశ్నగా ఉంది. ప్రతిష్టాత్మక సంస్థగా చెబుతున్న మాకీ అసోసియేట్స్ ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీకి సంబంధించి ఇచ్చిన నమూనాలు థర్మల్ విద్యుత్ ప్రాజెక్టుల్లో పొగ గొట్టాల తరహాలో ఉన్నాయనే వ్యాఖ్యలు వినిపిస్తున్నాయి.**

మాకీ అసోసియేట్స్ కొత్తగా ఇచ్చిన నమూనాలు ఏవీ కూడా ప్రభుత్వం చెబుతున్నట్లు ఏ మాత్రం అంతర్జాతీయ ప్రమాణాలకు అనుగుణంగా లేవని, వాటికంటే హైదరాబాద్‌లోని మాదాపూర్ పరిసర ప్రాంతాల్లో ఉన్న టిష్ మాన్ స్పియర్ వంటి ఐటి కంపెనీల భవనాలు ఎంతో మెరుగ్గా ఉన్నాయని ప్రభుత్వంలోని ప్రముఖులే స్పష్టం చేస్తున్నారు.

ప్రభుత్వంలోని కీలక వ్యక్తుల అభిప్రాయాలను పరిగణనలోకి తీసుకునే ప్రభుత్వంలో సహితం రాజధాని నిర్మాణం గురించి సవివరంగా సమాలోచనలు జరగడం లేదని, కేవలం ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు, పురపాలక శాఖామంత్రి నారాయణ కనుసన్నల్లోనే సాగుతున్నదని భావించవలసి వస్తున్నది. వారికి సన్నిహితంగా ఉన్న కొందరు ఈ సందర్భంగా 'అనధికారికంగా' కీలకపాత్ర వహిస్తున్నట్లు అర్థం అవుతున్నది.

అసలు విషయం ఏమిటంటే తొలుత సర్కారు విడుదల చేసిన అద్భుత భవనాల నమూనాలు అన్నీ కూడా సింగపూర్ సంస్థలు నిర్మించనున్న ప్రైవేటు, వాణిజ్య భవనాల సముదాయాలు అని విశ్వసనీయ వర్గాలు తెలుపుతున్నాయి. ఇదే అమరావతి, ఇదే రాజధాని అంటూ ప్రభుత్వం ఇప్పటివరకు ప్రజలను భ్రమల్లో ఉంచింది. ఇప్పుడు మాత్రం పొగగొట్టం డిజైన్లను విడుదల చేయటంతో అవాక్కవటం ప్రజల వంతు అవుతోంది. సింగపూర్ సంస్థలు నిర్మించ తలపెట్టిన వాణిజ్య భవనాల నమూనాలనే ప్రభుత్వం రాజధానిగా చూపించి ప్రజలను ఇంతకాలం ఏమార్చిందనే అభిప్రాయాన్ని మౌలిక సదుపాయాల శాఖ వర్గాలు వ్యక్తం చేస్తున్నాయి.

**స్విస్ ఛాలెంజ్ విధానం కింద సింగపూర్ సంస్థలకు కట్టబెట్టనున్న భూమిలో అవి నిర్మించే వాణిజ్య సముదాయాలవే ప్రభుత్వం తొలుత విడుదల చేసిన చిత్రాలు. రాజధాని నిర్మాణానికి కేంద్రమే నిధులు విడుదల చేస్తున్నందున పోటీ పద్ధతిలోనే టెండర్లు పిలిచి పనులను అప్పగించాల్సి ఉంటుంది. అందుకోసం జపాన్ సంస్థ సహకారం తీసుకోవలసి వచ్చింది. దానితో ఇప్పటివరకు సింగపూర్ ప్రభుత్వ సహకారంతో ఈ దేశానికి చెందిన కంపెనీలే నూతన రాజధాని నగరం అమరావతిని నిర్మించనున్నవనే ప్రభుత్వ సర్కారు ప్రచారం అంతా మోసమే అని తేలిపోయింది.** ❋

ఏ రాష్ట్రంలో ఉన్నా,
ఏ దేశంలో ఉన్నా
తెలుగువాళ్ళంతా ఒక్కటే

-ఎ.హిమబిందు

# పక్షులకు పుట్టినిల్లు భారతదేశమే

ప్రపంచంలోనే అత్యధికంగా 120 జాతుల వలస పక్షులకు పుట్టినిల్లు భారత దేశమే అనటంలో ఎలాంటి సందేహం లేదు. పక్షుల విడిదికి మన దేశంలో ఆంధ్రప్రదేశ్‌కి అగ్రస్థానం కలదు. ప్రపంచంలోని పలుదేశాల నుండి వేలకిలోమీటర్లు ప్రయాణం చేసి ఇక్కడకు వచ్చి దాదాపు 6 నెలల పాటు పిల్లలను పొదిగి వాటికి విహంగంలో మెలకువలను నేర్పి తిరిగి ఆయా దేశాలకు తిరిగి వెళ్ళటం అనేది అనేక ఏళ్ళుగా క్రమం తప్పకుండా జరుగుతున్నదే. అయితే ఆ కోణంలో ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని మూడు ప్రాంతాల్లో వలసపక్షులపై వాటి జీవనయానంపై ఫోటోగ్రఫీ ద్వారా గత ఆరు సంవత్సరాలుగా తీసిన ఛాయాచిత్రాలకు గాను ఈ ఏడాది అంతర్జాతీయ ఛాయాచిత్రకారుడు తమ్మా శ్రీనివాసరెడ్డికి అత్యంత గౌరవమైన అవార్డు వరించింది. నడుస్తున్నచరిత్ర పాఠకులకు సుపరిచితమైన శ్రీనివాసరెడ్డి మన తెలుగు వాడు. ప్రపంచ ఫోటోగ్రఫీపటంలో అగ్రదేశాలు అందించే అత్యున్నత పురస్కారాలు పొందుతూ ఫొటోగ్రఫీలో మొదటి పది మందిలో గత కొన్నేళ్ళుగా రాణించటం గర్వించదగ్గ విషయం.

వివిధ రంగాల్లో తెలుగువారు ప్రపంచంలోని పలు సంస్థల్లో కీలక స్థాయిలో ఉంటూ తెలుగుభాషను, తెలుగుజాతి ఔన్నత్యాన్ని పెంపొందించటానికి తమవంతు కృషి చేస్తున్నారు. ఈ కోణంలో 'అమ్మనుడి' ప్రపంచం లోనే ఫోటోగ్రఫీలో అత్యున్నత శిఖరాలను అధిరోహించిన శ్రీనివాసరెడ్డితో ముచ్చటించగా అనేక ఆసక్తికరమైన విషయాలు తెలిపారు.



అంతర్జాతీయ ఛాయాచిత్రకారుడు
తమ్మా శ్రీనివాసరెడ్డి

ప్రకృతి ప్రేమికుడు, పక్షుల సంరక్షకుడైన పద్మవిభూషణ్ డాక్టర్ సలీం అలీ గురించి తెలియనివారు ఉండరు. ప్రపంచంలో పక్షులపై అధ్యయనం చేసే ప్రతి ఒక్కరిని వారి జీవితం. వారు నడచిన మార్గం ఓ దిక్సూచిగా ఉంటుంది. భారతదేశంలో పక్షుల సంపద వాటి జీవనంపై జీవితమంతా కృషి చేసిన డా॥సలీం అలీ పేరు మీద భారత ప్రభుత్వం పలు రాష్ట్రాల్లో పక్షుల కేంద్రాలను ఏర్పాటు చేసింది. "వైల్డ్ లైఫ్ ఫోటోగ్రఫీ అసోసియేషన్ ఆఫ్ ఇండియా" ప్రతి ఏడాది ప్రపంచవ్యాప్తంగా ఫోటోగ్రఫీపోటీలు నిర్వహించి అందులో ముఖ్యంగా డాక్టర్ సలీం మెమోరియల్ అవార్డుని ప్రదానం చేస్తుంది. గత 16 సంవత్సరాలుగా న్యూఢిల్లీ కేంద్రంగా ఈ అవార్డుకి ప్రపంచవ్యాప్తంగా, నేచర్, వైల్డ్‌లైఫ్ ఫోటోగ్రాఫర్‌లు వారి ప్రతిభను నిరూపించుకుంటారు. ఇప్పటి వరకు ముగ్గురు భారతీయులకే ఈ అవార్డు లభించగా అందులో తెలుగువారు మన తమ్మా శ్రీనివాస రెడ్డికి ఈ ఏడాది లభించింది. 32 దేశాల నుండి 408 మంది ఛాయాచిత్రకారులు పంపిన 2745 ఫోటోలను పరిశీలించిన పిమ్మట ఈ అవార్డుకి శ్రీనివాసరెడ్డిని ఎంపిక చేశారు. దీనితోపాటు భారతదేశంలో "బెస్ట్ ఆథర్" అనే అవార్డుని కూడా పొందారు. తాను గత రెండున్నర దశాబ్దాలుగా ఫోటోగ్రఫీ పోటీల్లో పాల్గొంటూ ప్రపంచంలోని అగ్ర రాజ్యాల సరసన భారతదేశం మువ్వన్నెల జెండాను నిలిపేందుకు తన వంతు కృషి చేస్తున్నట్లు, తనతోపాటు పలువురు తెలుగు వార్ని ప్రోత్సహించి ఫోటోగ్రఫీలోనే పలు అంశాలపై వారి అభిరుచిని పసిగట్టి ప్రోత్సహిస్తూ దాదాపు 65 మందికి అంతర్జాతీయ గౌరవపురస్కారాలు రావటానికి శ్రీనివాసరెడ్డి కృషి చేశారు. భారతదేశంలో ఆంధ్రప్రదేశ్‌కి ఓ ప్రత్యేకస్థానం ఉంది. మరే రాష్ట్రానికి లేని విధంగా "ఆంధ్రప్రదేశ్ స్టేట్ అకాడమి ఆఫ్ ఫొటోగ్రఫీ" అనేది కలదు. 1984లో తెలుగు దేశం ప్రభుత్వ హయాంలో అన్ని అకాడమీలు రద్దు చేసినా దీన్ని ఒక్కదాన్ని మినహాయించారు. దీనిద్వారా తెలుగు ఛాయా చిత్రకారులు ప్రపంచ ఆర్ట్ ఫొటోగ్రఫీ రంగంలో అత్యధిక మంది ఉన్నత పురస్కారాలు సాధించారు. ఎంతో కాలంగా మరుగుపడ్డ అకాడమీకి జీవం పోయటానికి పూనుకుని తిరిగి రాష్ట్రం విడిపోయాక రెండు రాష్ట్రాల్లో రెండు ఫోటోగ్రఫీ అకాడమీలు ఏర్పాటు చేయాలనే తలంపుతో శ్రీనివాసరెడ్డి శ్రీకారం చుట్టారు. ప్రస్తుతం ఉమ్మడి రాష్ట్రాల అకాడమీకి ఆయన అధ్యక్షులుగా కొనసాగుతున్నారు.

అసలు డాక్టర్ సలీం అవార్డుకి, ఫోటోగ్రఫీకి సంబంధమేమిటి అన్న ప్రశ్నకు సమాధానం చెబుతూ శ్రీనివాసరెడ్డి 1907 సంవత్సర కాలంలో డాక్టర్ సలీం పక్షులపై అధ్యయనం చేయడం అప్పుడు పక్షులపై చిత్రీకరించేందుకు సరైన కెమెరాలు లేకపోవటం చూసిన దానిన మనస్సులో దాచుకుని దాన్ని సప్తవర్ణ రంగులలో పెయింటింగ్ చేసినప్పటికీ సర్దుకోలేకపోయారు. 1935 నుండి రంగుల ఫోటోగ్రఫీ రావటం దాంతో అధునాతనమైన కెమెరాలు, బైనాక్యులర్స్ అందుబాటులోకి రావటంతో పక్షులను పసిగట్టటం ఎంతో సులువుగా మారింది. అనేక పక్షి జాతుల ఛాయాచిత్రాలతో వారు ప్రచురించిన ఫోటోలు పక్షి ప్రేమికులకు ఎంతో ఉత్తేజాన్ని కలిగించాయి. దీంతో విదేశాల నుండి పక్షి ప్రేమికులు రావటం, వారితో పాటు నేచర్, వైల్డ్‌లైఫ్ ఫోటోగ్రాఫర్‌లను తీసుకురావటంతో ఎంతో దూరంగా ఉండే పక్షుల చిత్రాలు స్పష్టంగా తీయటం జరిగేది. సలీం గారి మరణానంతరం భారతప్రభుత్వం వారి పేరు మీద వైల్డ్ లైఫ్ ఫోటో అసోసియేషన్ ఆఫ్ ఇండియా ప్రతి ఏడాది ఓ నేచర్, వైల్డ్‌లైఫ్ ఫోటోగ్రాఫర్‌ని ఈ రంగంలో ప్రోత్సహించా

లనే లక్ష్యంతో మెమోరియల్ అవార్డుని కల్పించింది. ప్రపంచంలో పలు నేచర్, వైల్డ్ లైఫ్ పోటీలు జరిగినప్పటికి డాక్టర్ సలీం అవార్డుకి ఎంతో ప్రాధాన్యత ఉంది. అందుకే ప్రపంచ ఛాయాచిత్రకారులు ప్రతి ఏడాది ఏదో కొత్త అంశాన్ని ఎంపిక చేసుకుని వారి ప్రతిభను ఈ పోటీలో నిరూపించుకుంటారు" అన్నారు.

ఈ రంగంలో తాను ఎలా ఎదిగిందీ, నేచర్ ఫోటోగ్రఫీ ప్రాముఖ్యత గురించీ అమ్మనుడి పాఠకుల కోసం వివరించమని కోరగా ఆయన చెప్పినదంతా ఆయన మాటల్లోనే చదవండి.

"దాదాపుగా నాకు 1994 నుండి నేచర్ ఫోటోగ్రఫీపై ఆసక్తి పెరిగింది. బెంగుళూరులో జరిగిన అంతర్జాతీయ ఫోటోగ్రఫీ పోటీల్లో నాకు కలర్ విభాగంలో ఫోటోగ్రఫీ సొసైటీ ఆఫ్ అమెరికా వారి బంగారు పతకం లభించగా అందుకోవటానికి వెళ్ళినప్పుడు ఆ రోజు నేచర్ ఫోటోగ్రఫీపై ప్రదర్శన నన్ను ఎంతగానో ఈ అంశంలోకి లాగింది. కాని అప్పటికే డాక్టర్ దుగ్గరాజు శ్రీనివాసరావు గారి నేతృత్వంలో పలుమార్లు గుంటూరు జిల్లా ఉప్పలపాడు పక్షుల కేంద్రంతో పాటు, నాగాయలంక మడ అడవుల్లోని పలు పక్షిజాతులను చూడటం వారి ప్రోత్సాహం ఉన్నప్పటికి నేచర్ ఫోటోగ్రఫీకి కావలసిన పరికరాలు నా వద్ద లేకపోవటం ఓ ప్రధాన కారణం. అయితే అసలు ఈ రంగంలోకి రావటానికి నన్ను వెన్నుతట్టి ప్రోత్సహించిన మా అమ్మ సీతమ్మ స్థిరాస్తి కోసం దాచుకున్న ధనంతో నా అభిరుచికి ప్రాణం పోసింది. దీంతో ఖరీదైన లెన్సులు కొనుగోలు చేసి ఫోటోలు తీయడం జరిగింది. దీనికన్నా ముఖ్యంగా నేచర్ ఫోటోగ్రాఫర్‌కి ఓర్పు ప్రధానం. మన వద్ద ఎంత ఖరీదైన కెమెరా, లెన్సులు ఉన్నాయనేది ముఖ్యం కాదు. మనం ప్రకృతిలో కలసిపోవాలి, ప్రకృతికి అనుగుణంగా మెలగాలి. పక్షులు మన ప్రవర్తనపై ప్రతిక్షణం పరిశీలిస్తుంటాయి. మనం వాడే కెమెరా, మరో కోణంలో దుస్సంఘటనకు వాడే తుపాకీ కూడా నలుపురంగులో ఉండడంతో వాటి ప్రాణాలకి ప్రమాదం కలుగుతుందేమోననే భయంతో ఉంటాయి. ముఖ్యంగా నేచర్ ఫోటోగ్రాఫర్ ప్రకృతిలో కలసిపోయేవి రంగుల దుస్తులు ధరించాలి. హడావుడి చేయరాదు, తుమ్ములు, దగ్గులు లేకుండా ఆరోగ్యంగా ఉండాలి. పిట్ట కొంచెం కూత ఘనం లాగా పక్షి ఎంతో తెలివైంది. వాటి నుండి మనం ఎంతో నేర్చుకోవాలి. వాటి బిడ్డల సంరక్షణకై గంటలపాటు రెక్కలు విప్పి వాటికి సూర్యరశ్మి తగలకుండా కాపాడతాయి. ఇలాంటి విషయాలన్నీ భారతదేశంలో బెంగుళూరు నేచర్ ఫోటోగ్రఫీకి ప్రత్యేక స్థానం ఉంది. అక్కడి హెచ్, సతీష్, అల్లం ప్రభు, సి.రాజగోపాల్‌ల నుండి నేర్చుకున్నపాఠాలే నేను ఈ అంశంలో మెట్టు మెట్టు ఎదగటానికి పనికొచ్చాయి.

భారతదేశంలో మన రాష్ట్రానికి ప్రత్యేక ప్రకృతి సంపద కలదు, కొల్లేరు, ఉప్పలపాడు, నేలపట్టు ఈ మూడు ప్రాంతాలు ప్రకృతి సంపదకు నిలయాలు. ఎన్నో పక్షి జాతుల పుట్టినిల్లుగా చెప్పవచ్చు. మాతృమూర్తి అయిన తల్లి అత్తగారి ఇంటినుండి పుట్టినింటికి వెళ్ళి పండంటి బిడ్డతో తిరిగి అత్తగారింటికి రావడం మనందరికి తెలుసు. అలాగే కొన్ని వేల కిలోమీటర్లు ప్రయాణం చేసి ఈ ప్రాంతాలకు జంటగా వచ్చిన పక్షులు తిరిగి సంతానంతో వెళ్ళటం తిరిగి తదుపరి ఏడాది వచ్చేటప్పుడు వాటి జన్మస్థలానికి వస్తున్నట్లుగా పక్షులు భావిస్తాయి. ముఖ్యంగా ఈ ప్రకృతి నిలయాలైన ప్రాంతాలను చూస్తే ఆంధ్ర ప్రదేశ్‌లోని కృష్ణాజిల్లా, పశ్చిమగోదావరి జిల్లాలకు అక్రమించింది. కొన్నివేల ఎకరాల్లో ఈ సహజ సరస్సు-కొల్లేరు ఉండే ఈ ప్రాంతంలో అతిఅరుదైన పక్షిజాతులను గుర్తించటం జరిగింది. ఆక్టోబరు నుండి మార్చి వరకు ఇక్కడే ఉంటాయి. సైబీరియా, కెనడా, శ్రీలంక, పాకిస్తాన్ ప్రాంతాల నుండి పక్షులు విడిది కోసం వస్తాయి.



పై మూడు ప్రాంతాలకు ముందుగా అంటే అగస్టు మాసంలో ఓ పైలట్ గుంపు వస్తుంది. అవి ఇక్కడి వాతావరణం పరిస్థితులపై అధ్యయనం చేస్తాయి. ఇక్కడి వర్షాలు, పంటలు, ఆహారం సమృద్ధిపై ఓ అవగాహనకు వచ్చాక తిరిగి ఆయా దేశాలకు వెళ్ళి గుంపులుతో వస్తాయి. పైలట్ పక్షులదే తుది నిర్ణయం. ఈ మూడు ప్రాంతాల్లో ఎంత మేరకు పక్షులు ఉండాలో నిర్ణయిస్తాయి. అ సమయంలో ఆయా దేశాల్లో వాతావరణం మైనస్ డిగ్రీలలో ఉండడంతో వాటికి అనుకూలమైన ప్రాంతం మరియు తీపి నీటిలో దొరికే ఆహారం -చేపలు ఎంతో శ్రేష్టమైనవిగాను, రుచిగా ఉండం ప్రధాన కారణం, మరెక్కడా ఇంతవరకు తీపినీటిలో దొరికే చేపలు లభించవు. అందుకే ఈ ప్రాంతం రావడానికి అధిక శ్రద్ధ చూపుతాయి. 2001లో వన్యప్రాణి సంరక్షణ కేంద్రంగా తీర్చిదిద్దారు.

గుంటూరు జిల్లా ఉప్పలపాడు విదేశీ పక్షులకు నిలయంగా ప్రాధాన్యతను సంతరించుకుంది. దాదాపు 30 ఎకరాల్లో ఉండే ఈ చెరువుకి చైనా, నేపాల్, హిమాలయాల నుండి పెలికాన్స్, నైజీరియా నుండి పెయింటెడ్ స్టాక్స్, శ్రీలంక, ఆఫ్రికాల నుండి ఓపెన్ బిల్ స్టార్స్, సౌత్ ఆఫ్రికా నుండి వైట్ ఇబీస్ లాంటి 32 రకాల పక్షిజాతులు వస్తాయి. డాక్టర్ స్నేక్స్ అనే పక్షి వీటన్నింటికి సంరక్షణగా ఉంటుంది. పక్షుల కిలకిల రాగాలతో ఎంతో ఆనందంగా ఉంటుంది. 2002లో అటవీశాఖ ఆధీనంలో అభివృద్ధి జరిగింది. పర్యాటకులను ఎంతో ఆకర్షించే ప్రాంతం ఇది.

నెల్లూరు జిల్లా నేలపట్టు -దాదాపు 30 దేశాల నుండి 120 రకాల పక్షులు వచ్చే ప్రాంతం. ఎంతో సుదీర్ఘమైన సహజంగా ఏర్పడ్డ ప్రాంతం, కోస్తా తీరంలో సముద్రంకు దగ్గరగా ఉండే ప్రాంతం. దక్షిణాసియాలోనే అతిపెద్దదిగా గుర్తించబడింది. 1972లో మడచెట్లపై వాలిన పక్షులను రైలులో ప్రయాణించే పక్షి ప్రేమికులు గమనించి పరిశోధన చేశారు. నైజీరియా, సైలీలియా, ఇండోనేషియా ప్రాంతాల నుండి పక్షులు దాదాపు 120 రకాలు వస్తాయి. సమృద్ధిగా ఆహారం

దొరికే ప్రాంతం ఇది. 2001 సంవత్సరంలో రాష్ట్రప్రభుత్వం ఫ్లెమింగ్ ఫెస్టివల్ అనే పేరుతో పర్యాటకులను ఆకర్షించేందుకు చర్యలను గైకొంది. ఆరు నెలల పాటు ఇక్కడే ఉండే పక్షులతో ఈ ప్రాంతం ఎంతో సుందరంగా కనిపిస్తుంది. అయితే ఆలస్యంగా పొదిగిన పక్షులు, పిల్ల ప్రయాణానికి అనుకూలంగా లేని పక్షులు మాత్రం సంవత్సరం పొడవునే ఇక్కడే ఉండిపోతాయి. తిరిగి ఆ తదుపరి సంవత్సరం వెళ్ళటం జరుగుతుంది. అందు చేత సంవత్సరం పొడవునా పై మూడు ప్రాంతాల్లో పక్షులు దిగులుతో కనిపిస్తాయి. పై మూడు ప్రాంతాలకు సంవత్సరానికి 2 లక్షల పైచిలుకే పర్యాటకులు రావటం జరుగుతుందని వన్యప్రాణి సంరక్షణ కేంద్రం తెలుపుతోంది.

వలస పక్షుల ప్రయాణం ఓ అద్భుతం గానే ఉంటుంది. అవి అన్ని వేల కిలోమీటర్లు ఎక్కడా ఆగకుండా గాలివాటున ప్రయాణం చేస్తాయి. అలాగే సూర్యుని దిశ ఆధారంగా పగలు ప్రయాణిస్తే రాత్రుళ్ళు మాత్రం నక్షత్ర గమనం ఆధారంగా ప్రయాణం జరుపుతాయి. ప్రధానంగా డాక్టర్ సలీం ఆలీ అవార్డుకి నేను 6 సం॥లుగా ప్రయత్నిస్తున్నాను. గత కొన్నే ళ్ళుగా పక్షుల గమనిక వాటి జీవనంపై తీసిన చిత్రాలు అనేకం ఉన్నాయి. వాటి టేకాఫ్, ల్యాండింగ్ ఎన్నో అద్భుతమైన చిత్రాలు తీసినా ఇంకా ఎంతో తీయాల్సింది ఉంది. జంట పక్షులలో ఓ పక్షి ఎల్లప్పుడూ బిడ్డల సంరక్షణ చేస్తే మరో పక్షి ఆహారం వెదకటం చేస్తుంటుంది. ఆహారంతో వచ్చే పక్షి కోసం ముక్కులు పైకెత్తి అరుపులతో కేరింతలు కొట్టే దృశ్యం ఆహారం నోట్లో పెట్టే దృశ్యాలు ఎంతో అద్భుతంగా ఉంటాయి.

గత కొన్నేళ్ళుగా ఈ ప్రాంతాల్లో ఫోటోలు తీసేందుకు నేచర్ ఫోటోగ్రాఫర్‌లు దేశ విదే శాల నుండి రావడం జరుగుతున్నది. వీటిపై అధ్యయనం చేసేందుకు పరువురు ఇక్కడే ఉంటారు. కొల్లేరులోని ఆటపాక వద్ద ఏర్పాటు చేసిన స్టాండ్‌లలో పక్షులు ఇరుక్కుపోయి, చనిపోయాయి, నేను పలుమార్లు పరిశీలిం చిన తర్వాత కాని ఇది అంతుపట్టలేదు. రాష్ట్రప్రభుత్వం తగినన్ని చెట్లు లేకపోవడంతో ఇనుప స్టాండులను ఏర్పాటు చేశాయి. వాటిపై వేసిన జల్లెడలోకి కాళ్ళు ఇరుక్కుపోయి చని పోయాయి. అదేవిధంగా కర్రలతో నిర్మించిన స్టాండ్‌లను కట్టేందుకు వాడిన నార వల్ల వాటి మధ్యలో ఇరుక్కుపోయి, ముక్కులు దురదతో గీరుకుంటూ వాటిల్లో ఇరుక్కు పోయి, ఉరివేసినట్లుగా వేలాడుతూ చని పోయిన దృశ్యాలను నేను కెమెరాలో బంధిం చాను. ఒక మేలు కోసం చేస్తే మరో అశుభం జరుగుతున్న దృశ్యాలను నాటి కలెక్టర్ బుద్ధ ప్రకాష్, ఎం.జ్యోతి దృష్టికి తీసుకెళ్ళగా వెంటనే వారు సందర్శించి వాటిని తొలగిం చటం జరిగింది. వాటి స్థానాల్లో ప్లేట్‌లు బిగించడంతో పాటు, తాడు కాకుండా మేకు లతో నిర్మాణానికి పూనుకుని చనిపోకుండా కాపాడారు. వలస పక్షులను కాపాడటం, వాటిని అతిథులుగా ఆహ్వానించే రాష్ట్ర ప్రభుత్వం వాటి సంరక్షణపై చర్యలతో పాటు, పక్షుల పండుగ చేసే విధానంతో పర్యాటకులను ఆకర్షించే పద్ధతులను నేను ఫోకస్ చేయటం జరిగింది. దీంతో గత ఆరు సంవత్సరాలుగా చేసిన కృషికి ఈ అవార్డు లభించింది" అని వివరించారు.

"సాధారణంగా ప్రకృతిలో జీవించే పక్షులు సహజ సిద్ధంగానే ఉండేందుకు ఇష్ట పడతాయి. ఎన్ని సౌకర్యాలు కల్పించినా అవి అంత తేలికగా ఆకర్షింపబడవు. వాటి ప్రాణా లకు ముప్పు వస్తుందనే భయంతో కృత్రిమ ఆహారాన్ని ఇష్టపడవు, సహజంగా దొరికే ఆహారం కోసం వేట చేస్తుంటాయి. భారత దేశంలో తొలిసారిగా పక్షుల పండుగలో శ్రీకారం చుట్టింది తెలుగు రాష్ట్రం కావటం విశేషం. ప్రపంచలోనే పక్షుల కేంద్రం పుట్టి నిల్లయిన మన తెలుగుగడ్డపై కనుమరుగు అవుతున్న సాధారణ పిచ్చుకల నుండి విదేశీ పక్షులను పెంపొందించుటలో మనవంతు కృషి చేద్దాం. ప్రకృతి విహంగ కేంద్రంగా తీర్చిదిద్దటంలో ప్రతి ఒక్కరం చేయి చేయి కలుపుదాం" అంటున్నారు తెలుగుజాతి గర్వించదగ్గ ప్రముఖ ఫొటోగ్రాఫర్ శ్రీ తమ్మా రెడ్డి శ్రీనివాసరెడ్డి. ❊



## డా॥ కనుమర్తి విజయలక్ష్మికి పురస్కారం

రచయిత్రిగా సుపరిచితమైన డా॥విజయలక్ష్మికి 2016 కొలకలూరి విశ్రాంతమ్మ సాహిత్య పరిశోధన పురస్కారం లభించింది. "తెలుగు సాహిత్యం-హేతువాద భావాలు-ప్రభావాలు"కు గాను రు.10,000/-ల నగదు, జ్ఞాపిక, శాలువాతో శ్రీ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైద్రాబాదులో ఆచార్య కొలకలూరి ఇనాక్, డా॥అంగలకుర్తి విద్యాసాగర్, ఐఏఎస్ చేతుల మీదుగా అందించారు.

-డా॥ఈమని శివనాగిరెడ్డి
సెల్ : 98485 98446

# అశోకుని బిరుదులు

**మౌ**తృస్వామ్య వ్యవస్థాపకుడు చంద్రగుప్తమౌర్యుడు (క్రీ.పూ.322-298) అతని కొడుకు బిందుసారుడు (క్రీ.పూ.298-270) అతనికి శ్రీమిత్ర.....అని గ్రీకులు పిలిచిన అమిత్రఘాత అన్న బిరుదుండేది. బిందుసారుని తరువాత అతని కొడుకు మగధసామ్రాజ్యానికి అశోకుడు (క్రీ.పూ.270-232) రాజైనాడు. అశోకుడే ఈ విషయాన్ని తన బైరాత్ శాసనంలో (రాజామాగధి) చెప్పుకున్నాడు. అశోకుని శాసనాల్లో అతని వంశ ప్రస్తావన లేదు గానీ క్రీ.శ.150వ సం.నాటి శక క్షాత్రపుడైన రుద్రదాముడు తాను వేయించిన గుజరాత్ లోని జునాగడ్ శాసనంలో మాత్రం చంద్రగుప్తుడు అశోకుల ప్రస్తావన చేస్తూ చంద్రగుప్తమౌర్య, అశోకమౌర్య అని వారి వంశాన్ని గురించి చెప్పాడు.

దాదాపు 40 ఏళ్ళ పాటు మహాసామ్రాట్టుగా, జంబూద్వీపాధిపతిగా, ధమ్మరాజుగా పాలించిన అశోకుడు తాను చెక్కించిన రాతి స్తంభ శాసనాల్లో 'దేవానాంపియ', 'పియదసి' అన్న బిరుదుల్లాంటి పదాలను వాడాడు. కేవలం కర్ణాటక రాష్ట్రం, రాయచూరు దగ్గరున్న మాస్కి శిలా శాసనంలో మాత్రం తాను మొదటిసారిగా, తనను తాను దేవానంపియుడైన అశోకుడు (దెవానం పియస అసోకస) అని పేర్కొని, అసలు పేరేమిటో తెలియక తికమక పడుతున్న అప్పటి లిపి శాస్త్రవేత్తలకు కొంత ఊరట కల్గించాడు. అటు తరువాత మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని దితీయ జిల్లా పరాశరి అనే గ్రామ శివారులో నున్న గుజర్రా అన్న చిన్న పల్లెలో తాను చెక్కించిన చిన్నరాతి శాసనంలో దేవానం పియస పియదసినో అశోకరాజస (దేవానాం ప్రియస్య ప్రియదర్శినః అశోకరాజస్య) దేవతలకు ప్రియమైనవాడు, ప్రియదర్శి అయిన అశోక రాజు అని చెప్పుకొన్నాడు.

ఆంధ్రప్రదేశ్‌లో కర్నూలు జిల్లా గుత్తి నుంచి పడమరగా 10 కి.మీ. దూరంలో పత్తికొండ తాలూకాలోని ఎర్రగుడి దగ్గర అశోకుని పెద్దరాతి శాసనాలు, రాజుల మందగిరి దగ్గర రెండు చిన్న రాతి శాసనాలు చెక్కబడి ఈ ప్రాంతం అతని అధీనంలోనే వుందని తెలియజేస్తున్నాయి. ఈ శాసనాల్లో అశోకుని దేవానాంపియే, దేవానంపియైన, పియతపసి, దేవానాంపియె, పియదసి, దెవానం పియస, పియదసినె, దెవానంపియ అని బిరుదులతో మాత్రమే చెక్కబడి వుంది. ఎర్రగుడిలో చెక్కి వున్న 16 అశోకుని రాతి శాసనాల్లో వ్యక్తిగతమైన అతని పేరు లేకపోవటం గమనించాల్సిన విషయం.

అంతేకాదు, ధాన్యకటక అమరావతి మహాచైత్యం చుట్టూ పాతిన రాతి కంచెను బాగా పాలిష్ చేసిన రాతిస్తంభాలను అశోకుని కాలంలో నిలబెట్టినవేనని, వాటిపై నున్న క్రీ.పూ.3వ శతాబ్ది నాటి బ్రాహ్మీ అక్షరాల్లో వున్న ప్రాకృత శాసనాలు,

(మిగతాది 35వ పుటలో..)

### అశోకుని ఎర్రగుడి శాసనం (క్రీ.పూ.257)

కర్నూలు జిల్లా పత్తికొండ తాలూకాలో (అనంతపురం జిల్లా) గుత్తికి 10 కి.మీ. దూరంలో వున్న ఎర్రగుడి పొలాల్లో గుట్టల్లోనిరాళ్లపై వున్న అశోకుని శాసనాలను మొదట 18వ శతాబ్దం చివర్లో మెకంజీ, ఆయన సహాయకులు గుర్తించారు. అయితే 1928-29లో జియలాజికల్ సర్వే ఆఫ్ ఇండియాకు చెందిన ఘోష్ అనునతడు వాటి వివరాలను భారత పురావస్తుశాఖకు తెలియజేయగా వారు నకళ్ళను తీసి ప్రచురించిన తరువాత ఎర్రగుడిలో అశోకుని శాసనాలున్నాయని తెలిసింది. ఇక్కడున్న 14 శాసనాల్లో మచ్చుకు ఒకటో శాసనాన్ని లిపి, భాషలను పరిశీలించడానికి ఇక్కడ పొందుపరచమైనది. (డి.సి.సర్కార్, అశోకన్ స్టడీస్, కలకత్తా, 1979, పే.7-8, ప్లే-11)



**శాసనం**

1. (i) దేవానాం పియే హేవాహా (ii) అధికాని
2. య హకమ్ ఉపాసకే (iii) నోతు ఖో ఏకం సంవఛరం పకా (ం)తే
3. హుసం (iv) సాతిరేకే చుఖో సవఛరే యం మయా సంఘే ఉపయా
4. తే బాఢంచమే పకంతె (v) ఇమినా చు కాలేన అమిసా (యే) మునిసా
5. దేవేహి తే దాని మిసి భూతా (vi) పకమస హి
6. ఇయం (vii) మహప్తేనేవ సకియే (viii) ఖుదకేన పి పక
7. మమీనేన సకియే విపులే స్వగే ఆరా ధేతవే (ix) ఏ తాయచ అతాయ ఇయం
8. (సా)వనే సావితే (x) అతా ఖుదక మహలకా ఇమం పి (ప) క మెవూ అ(ం)
9. తా చ మే జానెవు చిరఠితికా చ
10. ఇయం పకమే హొాత విపులం పిచ వఢసితా అపరధియా దియాఢియం
11. (xii) వాపితె వ్యూథేన 200 50 6

# ప్రముఖ భాషాశాస్త్ర ఆచార్యులు పి.ఎస్.సుబ్రహ్మణ్యం మరి లేరు



జనవరి 25, 2008 నాటి చిత్రం

**భా**షాశాస్త్ర చరిత్రలో, ప్రత్యేకించి ద్రావిడ భాషాశాస్త్ర అధ్యయన చరిత్రలో ఆచార్య భద్రిరాజు వారసత్వాన్ని పుణికి పుచ్చుకున్న ఆచార్య పి.యస్.సుబ్రహ్మణ్యం ఇక లేరు.

ద్రావిడ భాషలకు మరో పెద్ద దిక్కు, అష్టాధ్యాయిని ఆధునిక భాషాశాస్త్ర నేపథ్యంలో మరింత లోతుగా అధ్యయనం చేసిన భాషాశాస్త్రవేత్త, తెలుగు భాషాశాస్త్రానికి మరో మూలస్తంభం అయిన ఆచార్య పి.యస్. సుబ్రహ్మణ్యం ఈ నెల 17వ తేదీన హైదరాబాద్‌లో కీర్తి శేషులయ్యారు.

పశ్చిమగోదావరి జిల్లా కొవ్వూరులో 1939 జూలై 20న జన్మించిన వీరు ఆంధ్ర విశ్వకళాపరిషత్‌లో బి.ఏ. ఆనర్స్ (1955-60) 1961లో ఎం.ఏ. తెలుగు, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో 1983లో ఎం.ఏ. సంస్కృతం చేశారు. అన్నామలై విశ్వవిద్యాలయంలో 1964లో 'డిప్లొమా ఇన్ లింగ్విస్టిక్స్' ద్వారా భాషాశాస్త్ర అధ్యయనం చేశారు. ద్రావిడ క్రియా ధాతువుల్ని తులనాత్మకంగా పరిశీలించి 'ఏ కంపేరిటివ్ స్టడీ ఆఫ్ వర్డ్ ఫార్మ్స్ ఇన్ ద్రవిడియన్ లాంగ్వేజెస్' (ద్రావిడ భాషలలో తిజంతాల తులనాత్మక పరిశీలన) అనే సిద్ధాంత గ్రంథాన్ని ఆంధ్ర విశ్వకళా పరిషత్‌కి సమర్పించి, 1964లో డాక్టరేట్ డిగ్రీ పొందారు. 1962లో అన్నామలై విశ్వవిద్యాలయంలో లింగ్విస్టిక్స్ శాఖలో సుబ్రహ్మణ్యం లెక్చెరర్‌గా చేరారు. 1967లో రీడర్‌గానూ, 1977లో ప్రొఫెసర్‌గానూ పదోన్నతి పొందారు. గోండీ, కోయ భాషల వర్ణనాత్మక వ్యాకరణం (1968). ఏన్ ఇంట్రడక్షన్ టు మాడర్న్ తెలుగు (1974), 'ద్రావిడభాషలు' (1977) 'ఆధునిక భాషా శాస్త్ర సిద్ధాంతాలు' (1984), 'ద్రవిడియన్ వెర్బ్ మార్ఫాలజీ' (1971), ద్రవిడియన్ కంపేరిటివ్ ఫోనాలజీ' (1983), ద్రవిడియన్ కంపారేటివ్ గ్రామర్ (2008), మార్ఫోసింటాక్స్ ఆఫ్ ద ద్రవిడియన్ లాంగ్వేజస్ (2012) మొదలైన గ్రంథాలు ఆయన పటిష్టమైన భాషాశాస్త్ర పరిశోధనకు గీటురాళ్ళు. బాలవ్యాకరణాన్ని ఆధునిక భాషాశాస్త్రజ్ఞులకూ ప్రత్యేకంగా తెలుగేతరులకూ ఆంగ్లంలో అందించిన ఘనత ఆయనది. ఇంకా ఎన్నో జాతీయ అంతర్జాతీయ సదస్సులలో భాషాశాస్త్ర పత్రికలలో వీరు రాసిన వందలాది పరిశోధన పత్రాలూ డజన్లకొద్దీ గ్రంథాలూ ఆధునిక భాషాశాస్త్ర పరిశోధనలను కొత్తపుంతలు తొక్కించాయి. 1998-99 టోక్యో యూనివర్సిటీ ఆఫ్ ఫారన్ స్టడీస్ లో విజిటింగ్ ప్రొఫెసర్‌గా పనిచేశారు. తులనాత్మక ద్రావిడ భాషాశాస్త్రం. భారతీయ భాషల భాషాశాస్త్ర సంప్రదాయం (ముఖ్యంగా సంస్కృత వ్యాకరణం) తెలుగు భాషాశాస్త్రం మొదలైన రంగాలలో వీరు విశేషమైన కృషి చేశారు. ద్రావిడ భాషలలో తెలుగు తమిళంవంటి ప్రధాన భాషలపైనే కాక గోండి, తుళు, తోడ, కుఇ, పర్జిలాంటి ఇతర ద్రావిడ భాషలపై వీరు రాసిన పరిశోధన పత్రాలు వీరికి మంచి గుర్తింపును తెచ్చిపెట్టాయి.

ఆధునిక శాస్త్రీయ పద్ధతుల్లో తులనాత్మకంగా ద్రావిడ భాషా పరిశోధన చేసి వీరు వెలువరించిన 'ద్రావిడ భాషలు' అనే ఉద్గ్రంథం పూర్వ, వర్తమాన భావితరాల ద్రావిడ భాషా శాస్త్రజ్ఞులకూ విద్యార్థులకూ ప్రామాణిక గ్రంథం, ఒక దిక్సూచి. ఇది ఎన్నో విశ్వవిద్యాలయాల్లోని తెలుగుశాఖల్లో భాషా శాస్త్ర విభాగాల్లో దశాబ్దాలుగా తిరుగులేని పాఠ్యగ్రంథం. ద్రావిడ భాషా తత్త్వం గురించి, తెలుగు ధాతువుల ప్రాతిపదిక స్వరూప స్వభావాల గురించి, తెలుగు భాష నవీకరణ గురించి ఆయన ఎన్నో పరిశోధనా గ్రంథాలూ, వ్యాసాలూ రచించారు, ద్రావిడ భాషల అధ్యయనంలో కొత్త గవాక్షం తెరిచిన ఆచార్యుడు భద్రిరాజు కృష్ణమూర్తి తర్వాత ఈ రంగంలో అదే వాడిని కొనసాగించిన మేటి పి.ఎస్. సుబ్రహ్మణ్యం, అంతేకాదు ఆంగ్ల భాషా శాస్త్రజ్ఞుడు బిషప్ రాబర్ట్ కాల్డ్‌వెల్ చూపిన ద్రావిడ భాషల అధ్యయన మార్గంలో భద్రిరాజు వారసుడిగా ఆయన ఒరవడిని పరిశోధనాపటిమను అందిపుచ్చుకున్న ధీశాలి ఈయన.

పి.ఎస్.సుబ్రహ్మణ్యం గారి నిర్యాణంతో భారతీయ భాషాశాస్త్ర రంగమే కాదు ద్రావిడ భాషాశాస్త్ర రంగమూ ఒక గొప్ప వర్ణనాత్మక, చారిత్రక భాషాశాస్త్ర వేత్తను కోల్పోయింది. ద్రావిడ భాషల తులనాత్మక వ్యాకరణాన్ని తెలుగువారికి పరిచయానికి ఉద్దిష్ట గ్రంథం 'ద్రావిడ భాషలు'. ఇందులో తెలుగు, దాని సోదర భాషల నిర్మాణం, వర్ణనాత్మకత ఆధారంగా మూల ద్రావిడ భాషా పునర్నిర్మాణం, ద్రావిడ భాషల పరస్పర సాదృశ్య భేద నిర్ణయం, మూల ద్రావిడ భాషా

క్రమపరిణామం, మొదలైన అంశాలు ఉన్నాయి. మూల ద్రావిడ భాషా కాలం నుంచి ఇప్పటివరకూ తెలుగులోనూ, ఇతర ద్రావిడ భాషలలోనూ వర్ణాలూ, ప్రత్యయాలూ పొందిన పరిణామాలు ఇందులో వివరించారు. ద్రావిడభాషల తులనాత్మక వ్యాకరణాన్ని తెలుగులో విపులంగా వివరించే ప్రామాణిక గ్రంథం దీనికి ముందువరకూ వెలువడలేదు. తెలుగులో ఈ అంశం మీద ఇదే ప్రప్రథమ గ్రంథం, ఒక భాషాచరిత్రను సాధికారికంగా విశ్లేషించే విషయంలో శుద్ధచారిత్రక వర్ణనాత్మక వ్యాకరణం కన్నా తలనాత్మక వ్యాకరణం శక్తిమంతమం. మొదటిది రెండో దానికి అనుబంధం వంటిదని భాషా శాస్త్రజ్ఞుల నిర్ణయం. అందుకే చారిత్రకాంశాలు కూడా ఈ గ్రంథంలో ఉన్నాయి. తెలుగుభాషా చరిత్రని మూల ద్రావిడ భాషాకాలం నుంచి తెలుగువారు తెలుసుకొనేందుకు ఈ గ్రంథం ఉపయోగపడుతుందని గట్టిగా నమ్మిన వ్యక్తి ఆచార్య పి.యస్.సుబ్రహ్మణ్యం. ఇదే ద్రావిడ భాషల తులనాత్మక వ్యాకర ణాన్ని తెలుగులో సమగ్రంగా విశ్లేషించిన మొదటి గ్రంథం కూడా. ద్రావిడ భాషలపై ఇంత వివరంగా ఇలాంటి ఉత్తమ గ్రంథం తెలుగులో లేదు. ఇది పరమ ప్రామాణికగ్రంథం, అటు పరిశోధనా గ్రంథంగానూ, ఇటు పాఠ్య గ్రంథం గానూ మంచిపేరు పొందింది. అత్యాధునిక పరిశోధనల ఆధారంగా ఇందులో సకల ద్రావిడ భాషల గురించి చక్కని పరిచయం ఉంది. 'ఆధునికకాలంలో ద్రావిడభాషల వర్ణనాత్మక, తులనాత్మక పరిశోధన మీద ఆంగ్ల భాషలో గ్రంథాలు విరివిగా వచ్చాయి. ఈ గ్రంథాలలో ఉన్న అంశాలను సంగ్రహంగా తెలుగువారికి తెలుగులో వివరించడం కోసం 'ద్రావిడ భాషలు' రాశానని ఆచార్య సుబ్రహ్మణ్యం చెప్పారు.

సుబ్రహ్మణ్యం రాసిన మరో ప్రామాణిక గ్రంథం 'ఆధునిక భాషా శాస్త్ర సిద్ధాంతాలు' ఈ గ్రంథం తెలుగుభాషా సాహిత్యాలు, భాషాశాస్త్రం ప్రధాన పాఠ్యాంశాలుగా విశ్వవిద్యాలయంలో చదివే విద్యార్థులు భాషా శాస్త్రాన్ని గురించి తెలుసుకోవడానికి ఉద్దిష్ట మైంది. ఇందులో మొదటి విభాగంలో భాష, వ్యాకరణాల స్వరూపం పరస్పర సంబంధాలు, రెండోవిభాగంలో వర్ణనాత్మక భాషాశాస్త్ర పద్ధతులూ, మూడో విభాగంలో తులనాత్మక చారిత్రాత్మక భాషా శాస్త్ర పద్ధతులూ ఉన్నాయి. భాషాశాస్త్ర సిద్ధాంతాలను క్షుణ్ణంగా తెలుసుకొన్నాక ఆదికాలం నుంచి వీటి పరిణామం తెలుసు కోవడం మంచిదనే ఉద్దేశంతో భాషాశాస్త్ర పరిణామ చరిత్రను నాలుగో విభాగంలో సుబ్రహ్మణ్యం గారు సమీక్షించారు. తెలుగులో భాషా శాస్త్రానికి సంబంధించిన గ్రంథాల్లో ఇదే ప్రామాణికం.

అంతేకాక పాణినీయన్ లింగ్విస్టిక్స్ అనే గ్రంథాన్ని బాలవ్యాక రణానికి ఆంగ్లవ్యాఖ్యనూ సమకూర్చారు. ద్రావిడ వ్యుత్పత్తి కోశానికి సప్లిమెంటరీని తీసుకువచ్చిన ఘనతకూడా వీరికే దక్కింది.

ఆధునిక యుగంలో భాషాశాస్త్రం కొత్త మలుపు తిరుగు తోంది. కొత్తకోణాలను ఆవిష్కరిస్తోంది. విజ్ఞానశాస్త్రం తన రెక్కలు విప్పుకొని గగనపథంలోకి ఎగబాకుతున్న నేపథ్యంలో భాషాశాస్త్రం గురించీ, దాని మౌలికస్వరూప స్వభావాల గురించి, దాని కీలక మైన సిద్ధాంతాల గురించీ తెలుసుకోవలసిన అవసరం ఎంతో ఉంది. సిద్ధాంతాలకూ, ప్రయోగాలకూ సమన్వయించగల పి.ఎస్ గారి లాంటి భాషాశాస్త్రజ్ఞులు ఇక మనమధ్య లేకపోవడం నిజంగా తీరని లోటే. ❋

(**అశోకుని బిరుదులు** - 33వ పుట తరువాయి)

చైత్యం దగ్గర తవ్వినపుడు బయల్పడిన ఒక రాతిశాసనం (ఇది కూడా మౌర్యుల రీతిలో పాలిష్ చేయబడి వుంది) ధాన్యకటక స్తూపం అశోకుని కాలంలో విస్తృతమే కాక సుదృఢంగా చేయబడింది. అందులో బయల్పడిన బుద్ధుని పరమ పవిత్ర ధాతువులు అశోకుడు 84 వేల స్తూపాలను కట్టించడంలో భాగంగా నిక్షిప్తం చేసినవే. ధమ్మవ్యాప్తికోసం మైసోలియా అని పిలువబడిన మచిలీపట్నం ప్రాంతానికి మహాదేవుడనే బౌద్ధ భిక్షువుకు పంపిన సంగతిని కూడా మనం గుర్తు చేసుకోవాలి.

అశోకుని ఎర్రగుడి 13వ పెద్ద శాసనంలో (యోనకంబొసెసు నాభక నాభపంతిసు భోజపతిని శేసు అంధ పాలదెసు సవిత దెవానం పియస ధమ్మానుసధి అనువతంతి) దేవానాం ప్రియుని పాలనలో నున్న యోనక, కంభోజ, నాభన్, నాభపంక్తి, భోజపతినిక, అంధ్ర(ఆంధ్ర), పాలదె లాంటి అన్ని ప్రాంతాల్లోనూ ధమ్మాన్ని తాను చెప్పినట్లుగానే ఆచరిస్తున్నారని చెప్పుకొన్నాడు. అదీగాక చంద్రగుప్త మౌర్యుని ఆస్థానంలో ఉన్న గ్రీకు రాయబారి మొగస్త నీసు తన ఇండికా అనే గ్రంథంలో అండరే (ఆంధ్రుల) కు దుర్భేధ్యమైన 30 పట్టణాలు 1,00,000 సైనికబలం, 2000 గుర్రాలబలం, 1000 ఏనుగుల బలముందని రాసిన సంగతిని స్ట్రాబో మళ్ళీ ఉటంకించి ఆ సమాచారాన్ని మనకందించాడు.

ఎర్రగుడి, రాజుల మందగిరిలోని అశోకుని రాతి శాసనాల్లో తన పేరు చెప్పకుండా తనను తాను దేవానంపియ, పియదసి రాజా అని చెక్కించుకొన్నాడు. దేవానాంపియ అంటే దేవతలకు ప్రియమైన వాడనీ, పియదసి అంటే చూడబుద్ధయిన విందు, చూడాలనిపించే రాజు అని అర్థం. అతడు (ఒక్క కళింగ యుద్ధం తప్ప) ఎన్నో సమాజ హితమైన, పశుపక్ష్యాదులు, మానవాళి, శ్రమణులు, బ్రాహ్మణులు, ఇతర మతాల వారిని సమానంగా గౌరవించమని, తన శాసనాల్లో చెప్పుకొన్నాడు. అంతేకాదు, అన్ని శాసనాల్లోనూ అతడు ప్రజాహిత, సమాజహిత సూచనలే చేశాడు. ఉదాహరణకు జీవరాశులపట్ల కరుణ, (చిన్నరాతి శాసనం-చిరాసా) 11 పెద్ద రాతిశాసనం (పెరాశా- 111-14) జీవరాశు లకు హాని కలిగించకపోవటం (పెరాశా 9,11, స్తంభ శాసనం (స్థ.శా-2,7) తల్లి తండ్రిపట్ల విధేయత (చిరాశా, పెరాశా, 4,9,13 స్థ.శా 7) పెద్దలపట్ల విధేయత, భక్తిప్రపత్తులు(చిరాశా 2, పెరాశా 6,9,13, స్థశా 7) బ్రాహ్మణులు, సమనులపట్ల ఔదార్యం (పెరాశా 3,4,9,13 స్థ.శా.7) బానిసలు, సేవకులపట్ల మర్యాదతో కూడిన ప్రవర్తన (పెరాశా 9,11,13, స్థ.శా 7) స్నేహితులు, బంధువులు, తోటి వారిపట్ల ఔదార్యం (పెరాశా 3,4,9,13) సత్యాన్నే పలకాలి (చిరాశా 2, స్థ శా 2,7) ఆలోచనలో పరి శుద్ధత (స్వచ్ఛత) కరుణ (పెరాశా 7, స్థ.శా 2,7) ఇతరులతో మాట్లాడే టప్పుడు స్వీయనిగ్రహం (పెరాశా 7,12) విద్యార్థులు గురువులను గౌరవిం చటం (చిరాశా 2) మితమైన ఆస్తులు కలిగి వుండటం, మితంగా ఖర్చు చేయటం (పెరాశా 3) వయసుమళ్ళిన వారిపట్ల గౌరవప్రదంగా ప్రవర్తిం చటం(స్థ.శా 7), పేదలు అనాథల పట్ల మర్యాదగా ప్రవర్తించటం (పెరాశా 7), తనపై అధికారులపట్ల విశ్వాసంతో మెలగటం (పెరాశా 13) ప్రతి వారూ తమ దైనందిన ప్రవర్తన నుంచి ఉగ్రత్వం, క్రూరత్వం, ఆగ్రహం, ఈర్ష్య, గర్వం వదులుకోవటం (స్థ.శా 2) ఉపవాసాన్ని ఆచరించటం (స్థ.శా.4) లాంటి ఎన్నింటినో చెప్పుకోవచ్చు. ఇన్ని మంచిపనులు చేసిన రాజును అందుకని దేవతలకు ప్రియమైన వాడు, ఎప్పుడూ చూడాలని పించే వాడు అన్న అర్థంలో అశోకుడు ఉచితమైన దేవానాం ప్రియ, ప్రియదర్శిరాజా అన్న బిరుదుల్ని ధరించాడు. ❋

-డా॥అద్దంకి శ్రీనివాస్
98488 81838

# 'వర్ణన రత్నాకరం' సంకలనకర్త దాసరి లక్ష్మణస్వామి



2016 జనవరి 'అమ్మనుడి' సంచికలో 'వర్ణన రత్నాకరం' అనే మహత్తర పద్య సంకలనం గురించి పరిచయం చేశారు డా॥అద్దంకి శ్రీనివాస్. తెలుగువారిలో ఎంతటి ప్రతిభావంతులైన రచయితలు, కవులు పుట్టి అత్యద్భుత గ్రంథాలను వెలయించినా వారికి తగినంత ఖ్యాతి రాకపోవటం వెనుక ఈ జాతి ఉత్థాన పతనాల చారిత్రక కారణాలున్నాయి. వాటితోపాటు మేధోవర్గాల ఏకాకితనం, పాలకుల స్వార్థ రాజకీయాలు, పట్టనితనం తోడయ్యాయి. సామాజిక అవ్యవస్థలో పెరిగిన జాతి భావరాహిత్యం కూడా ఇందుకు తోడ్పడింది. కాకపోతే ప్రపంచస్థాయిలోనే గొప్పదైన 'వర్ణన రత్నాకరం' వంటి పద్య సంకలనం 80 ఏళ్ళుగా అందుబాటులో లేకుండా పోవడమేమిటి? దీని గురించి తెలుగు ఉపాధ్యాయ, పండిత వర్గాల్లో కూడా అనేకమందికి ఎరుక లేకపోవడమేమిటి? బేతవోలు రామబ్రహ్మం గారి వంటి పండితుని పూనిక వల్ల సహచరులతో పాటు, ఆయన చేసిన అవిరళ కృషి ఫలితంగా పాఠకమిత్ర వ్యాఖ్యతో ఇన్నాళ్ళకు 20 సంపుటాలుగా 'పద్యరత్నాకరం' సంకలనం మనకు అందుబాటులోకి వచ్చింది.

ఇంతటి గొప్ప సంకలనానికి కర్త కీ.శే.దాసరి లక్ష్మణస్వామి నాయుడు.

## వర్ణన రత్నాకరము - కవి పరిచయం

'వర్ణన రత్నాకరము' ఇది తెలుగు వారే కాదు సాహిత్యవేత్తలూ సరిగా వినని సంకలన గ్రంథం. అనితరసాధ్యమైన కృషి, సాహిత్యసేవ కాలగర్భంలో కలసిపోవటం మనకి కొత్తేమీ కాదు. క్షీణయుగమని పక్కనపెట్టిన సాహిత్యంలోని అక్షీణ ప్రతిభనీ సృజననీ దివిటీ పట్టి చూపించిన ఈ గ్రంథం 80 ఏళ్ళ క్రితం ప్రచురితమయ్యింది. దీనికి గుర్తింపు రాకపోవటం విచారించదగ్గ విషయం. దిగ్గంతులైన ఆనాటి సాహిత్యవేత్తలందరూ ఏకకంఠంతో ప్రశంసించిన గ్రంథం.

8200 పద్యాలు. నాలుగు సంపుటాలు. 600 పైగా కవుల వర్ణనలు... ఇదీ ఈ సంకలనం విస్తృతీ విశేషమూ. ఒడ్డూ పొడవులోనే కాదు నాణ్యతలోనూ దీని సరసన నిలిచే మరో గ్రంథం ఆంధ్రదేశం లోనే కాదు ప్రపంచంలోనే మరెక్కడా లేదు. ఇంతటి కృషి ఒక్క చేతిపై ఏ సాంకేతికత, దన్నూ లేని కాలంలో జరిగింది. నమ్మటం సాధ్యమా! ఒక జీవితకాలం వెచ్చించి సాధ్యమేనని చేసి చూపించిన ఘనుడు దాసరి లక్ష్మణస్వామి. ఇతడే ఈ 'వర్ణన రత్నాకరము' నిర్మాత.

## దాసరి లక్ష్మణస్వామి జీవిత విశేషాలు

తూర్పుగోదావరి జిల్లా పిఠాపురంలో కొండయార్యుడు అప్పమాంబ దంపతులకు 10-4-1889న జన్మించిన దాసరి లక్ష్మణస్వామి బహుముఖ ప్రజ్ఞాశాలి. సంగీత సాహిత్యాలు, నాటక రచన- నటన, బహుభాషా కోవిదత్వం (తెలుగు, తమిళం, హిందీ, ఉర్దూ, ఆంగ్లం) వీరి సొత్తు.

దీనపోషకశతకం (1914) విజయవిలాస నాటకం (1915) భర్తృహరి ప్రబోధ నాటకం (1971) భక్తజన మనోరంజనం (1919- కీర్తనలు) లుబ్ధధనావస్థ (నామాంతరం- వేశ్యాసహవాస ఫలితం) చతుర్భాషా నిఘంటువు (తెలుగు, తమిళం, హిందీ, ఆంగ్లం) నీతికథా రత్నావళి (1931) సీతావిజయం (లింగకవి గంగకవి- శతకంఠ రామాయణానికి వచనం 1934) వర్ణన రత్నాకరము (1,2 భాగాలు 1929;3, 4 భాగాలు 1930) నీతిపద్యరత్నాకరము, చమత్కార చాటుపద్యములు, ముక్తిసాధనము, అమృతకలశము, సర్వధర్మరత్నాకరము, (ప్రథమభాగం) ఆంధ్రవచన రామాయణం వీరి ముద్రిత రచనలు.

సర్వధర్మరత్నాకరము (2,3,4 భాగాలు) సర్వమతరత్నాకరము, సకలార్థనిధి, హరిశ్చంద్ర నాటకము, మైరావణ నాటకము అముద్రితాలు. వీటన్నింటిలో వర్ణన రత్నాకరం కలికితురాయి.

లక్ష్మణస్వామి గారి జీవితంలో ఒక పార్శ్వం సాహిత్యమైతే మరో పార్శ్వం నాటకరంగం. మల్లయుద్ధం, దర్జీ పని కూడా వీరికి తెలుసు. కోడి శ్రీరామ్మూర్తి, ఆలమూరి పట్టాభిరామయ్య, కలగాని రామయ్య, ముప్పిడి జగ్గారావు, శొంఠి నారాయణమూర్తి ద్విభాష్యం సుబ్బారావు, వారణాసి భద్రాద్రి వంటి తొలినాళ్ళలోని ప్రసిద్ధ నటులు లక్ష్మణస్వామి గారికి బాగా పరిచయం. వీరందరూ ఆయా రంగాలలో ఆయనపై ప్రభావం చూపారు. పురాణపండ కామేశ్వరరావు. ఆచంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మ వంటి న్యాయవాదులూ వీరికి తెలుసు.

ఎందరో ప్రసిద్ధ అప్రసిద్ధ కవులనూ, వివిధ రంగాలలో తనకు సమకాలీనులైన ఉద్దండులను పరిచయం చేస్తూ సాగిన 'నా జీవిత యాత్ర'అనే వీరి 'ఆత్మకథ' ఒక విజ్ఞాన సర్వస్వం లాంటిదన్నారు గిడుగు సీతాపతి. 'వివిధ పదార్థ ప్రదర్శనశాల' ఇవి కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రి గారి మాటలు. చరిత్రకు ఆకరం అన్నారు నిడదవోలు వారు. 'స్వీయచరిత్రల చరిత్ర' ఈ కితాయి ఈయుణ్ణి వారిది. విశ్వనాథ, వేంకటపార్వతీశ్వరకవులూ సదభిప్రాయాలను వెలిబుచ్చారు. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి ఇలా మెచ్చుకున్నారు.

**స్వీయ చరిత్రలందు దమ చెయ్వులు మాత్రము గల్గునట్లుగా**
**జేయుందు రంద రీతని విశిష్ట చరిత్ర మునందు దేశ దే**
**శాయత వర్తమాన విషయంబులు సత్కవిరాజ పండితా**
**మేయ వినోదమున్ గలవు మేల్మియశోంచిత శాస్త్ర చర్చలున్'**



వీరి జీవిత చరిత్ర విషయమంతా ఒకే విధంగా ఏకరువు పెట్టినది కాదు. దశలవారీగా, అంశాలవారీగా సంఘటనల పేర్పుముచ్చట గొలుపుతుంది. అక్కడక్కడా ఛలోక్తుల తళకు. ఇది రెండు భాగాలు. 1956–1962 లలో ముద్రితం. సమకాలీన సాహిత్యం, నాటకరంగం, సమాజాలను తెలిపే ఆధారగ్రంథం, చరిత్రకు తెలియని ఎందరో వ్యక్తుల ప్రస్తావన, ప్రతిభా విశేషాలు, దాతృత్వగుణాలకు వెలుగు. పిఠాపురం రాజాస్థాన చరిత్రను నిర్మించే వారికి ప్రధాన ఆకరం. లక్ష్మణస్వామి ఒకరకంగా పిఠాపురం రాజాస్థాన ఉద్యోగి. అంతరంగికుడు. అందుకే వారి జీవితాలలోని ప్రధాన ఘట్టాలను తేదీలతో సహా నమోదు చేశారు. పిఠాపురం యువరాజు ఒకవైపు వాల్మీకి రామాయణాన్ని ఓలేటి వేంకట రామస్వామి గారితో చెప్పించుకొంటూ మరోవైపు ఆంగ్లంలోని 'బైబిల్ ఆఫ్ ద బైబిల్స్' గ్రంథాన్ని అనువదించటంలో గల మతసామరస్యం లక్ష్మణకవి చెప్పకపోతే లోకానికి ఎలా తెలుస్తుంది?

ఆంధ్ర ఆస్తికమహాసభ, గోదావరి పుష్కరాలు, బ్రహ్మసమాజ వార్షికోత్సవసభ, త్యాగరాజోత్సవం, ఆంధ్రసాహిత్య పరిషత్సభ, విద్యానందపుస్తక భాండాగారం, శ్రీసూర్యరాయ పుస్తక భాండాగారం, ఆంధ్రభాషాభివర్ధిని నాటకసంఘం, గోదావరీ మండలసభ, విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలలగురించిన సమాచారం ఈ జీవిత చరిత్రలో ఉంది.

హోమియోపతి వైద్యం, డాగ్‌షో, నందిగ్రామ వెంకటరత్నంగారి చిత్రాలు, అస్పృశ్యతా నివారణ కోసం చేసిన కృషి, హిందూత్రియాట్రికల్ నాటకసంఘం వారికీ, సింగితం అబ్బాయి నాటకసంఘం (కాకినాడ) వారికీ ఉన్న విభేదాలు; దేశబంధు, సమదర్శిని, గృహలక్ష్మి, ధర్మసాధని, భారతి వంటి పత్రికల ముచ్చట్లు ఇందులో ఉన్నాయి.

మహాపురుషుల చరిత్రే 'తెలుగు వారి సాహిత్య సేవకు' దర్పణం. జీవిత చరిత్రలో తత్కర్త కనబడాలి. అదే ఉత్తమ జీవితచరిత్ర, 'నా జీవితయాత్ర' లోనూ దాసరి వారు కన్పిస్తారు. చదివితే తెలుస్తుంది. దీనినిండా వర్ణన రత్నాకరము గురించే రాశారు. తమ సంతతికి 'రత్నాకరము' అని పేరు పెట్టారు. వర్ణన రత్నాకరం కోసం తన ఇల్లే కార్యాలయంగా ఏర్పాటు చేశారు.

**వర్ణన రత్నాకరము**

వర్ణన రత్నాకరం ఒక జీవితకాల కృషి, ఫలితం, సాహిత్యాభిరుచి వల్ల సంపాదించిన గ్రంథాలన్నింటినీ పరిశీలించి పలువురు కవులు రాసిన ఒకే వర్ణనల్ని ఒకచోట ఎత్తి రాయటంతో వీరి కృషి ప్రారంభం, ఇందులో ఎన్నో చిక్కులు. పరిష్కరణలు, పాఠ పరిశీలన, గ్రంథ సేకరణ, విషయ విశ్లేషణ, ఇవీ ఆ సమస్యలు.

వేంకటరామకృష్ణకవుల ప్రోత్సాహం, పన్నాల మల్లికార్జున శాస్త్రి తోడ్పాటు, తేవప్పెరుమాళ్ళయ్య, శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగార్ల పరిష్కరణలతో వర్ణన రత్నాకరం ఆవిర్భవించింది. పేరు పెట్టింది తేవప్పెరుమాళ్ళయ్యగారే, శ్రీరాజారావు వెంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దూరుగారు కృతి భర్త. ఆయన "సముద్రానికి ఏతమెత్తడమే మీ కృషి" అన్నారట, పిఠాపురం రాజావారి గ్రంథాలయం, సూర్యరాయాంధ్ర నిఘంటు గ్రంథాలయం, కందుకూరి వారి పుస్తక భాండాగారం వీరి పద్య సేకరణకు ఉపయోగపడ్డాయి.

శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయంలో మేనేజరుగా ఉన్న తేవప్పెరుమాళ్ళయ్య మనమందరం కలిసి చేసిన పనిని లక్ష్మణస్వామి ఒక్కడే చేశాడన్నారు. వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి గారిలా వెన్నుతట్టారు.

**'ఆదరినుండి యీదరికి నాంధ్రమయంబు ప్రబంధ సాగరం**
**బీది మునింగిలో తరసి యెక్కడ సున్నవో యెత్తి తెచ్చి య**
**ష్టాదశ వర్ణనామణులఁజక్కఁగ హారములన్ రచించి యా**
**మోదమునన్ సరస్వతికి బూన్చి కృతార్థతఁగంటి లక్ష్మణా'**

'వర్ణన రత్నాకరము' తెలుగు సంకలన గ్రంథాలన్నింటికీ తలమానికం, 11–20 శతాబ్దుల మధ్య కల కవుల ముద్రిత– అముద్రిత కావ్యాల నుంచి సేకరించిన సంకలనం.

ఒకే అభిప్రాయంతో ఉన్న పలువురు కవుల పద్యాలలో ఎక్కువగా భావభేదాన్ని అనుసరించి వర్ణనాంతరాలను స్వీకరించడం విశేషం. పద్యాలను సేకరించటం ఒక ఎత్తు. వాటిని ఒక క్రమంలో పేర్చటం మరో ఎత్తు, మొదట ప్రాచీన గ్రంథ నామాలను అకారాదిక్రమంలో చేర్చి, వాటిలోని వర్ణన పద్యాలను ప్రత్యేక శీర్షిక కింద చేర్చారు. అశ్వాస, పద్య సంఖ్యలను సూచించలేదు. అయితే లక్ష్మణస్వామి తన గ్రంథాన్ని పెద్దలముందుంచారు. ఇదొక సుగుణం. శ్రీ జయంతి రామయ్య పంతులు, కట్టమంచి రామలింగారెడ్డి, వేదం వేంకటరాయ శాస్త్రి, వావిలికొలను సుబ్బారావు పంతులు, కాశీనాథుని నాగేశ్వర రావు పంతులు, కొమర్రాజు వేంకటలక్ష్మణరావుల అభిప్రాయాల్ని కోరారు. శివసా వహించారు.

'కవికాలక్రమంలో ముద్రించకపోతే ఆంధ్రకవిత్వ, క్రమపరిణామం తెలుసుకొనే వీలు ఉండదు' అన్నారు జయంతిరావు. కట్టమంచివారు, వడ్డాదిసుబ్బరాయకవి ఆశ్వాస పద్యసంఖ్యలు చేర్పమన్నారు.

ఈ రెండు మార్పులూ చేయటం సామాన్యమైన విషయం కాదు. శ్రమ కోర్చి మార్పు చేశారు. అది లక్ష్మణస్వామి గారి వినయం. **ఇప్పుడీ వర్ణన రత్నాకరంలో ఏ వర్ణననయినా తీసుకొని నన్నయ నుండి కందుకూరి దాకా కవిత్వం ఎలా పరిణమించిందో గమనించవచ్చు. తెలుగు సాహిత్య ప్రియులకే కాదు, పరిశోధకులకు, భాషావేత్తలకు, సామాజిక శాస్త్రవేత్తలకు ఈ గ్రంథం ఉపయుక్తం. పరిశోధనలకు కావలసిన ముడిసరకునంతా ఒక చోటికి చేర్చి అందిస్తుంది. పరిశోధకుల పని సులువైపోతుంది.**

**శిల్పం, అభివ్యక్తి, భాష, శైలి, ఇత్యాద్యంశాలన్నీ నన్నయ నుంచి**

**ఎలా పరిణమించాయని పరిశీలించటం ద్వారా సాహిత్య విమర్శలో కొంగొత్త ద్వారాలను త్వరితంగా సమగ్రంగా తెరవడానికి వీలు చిక్కుతుంది.**

కృతులూ అనుకృతులూ విడుపులూ ఒడుపులూ తెలుస్తాయి. కవుల్లో దొంగలెవరో దొరలెవరో కూడా కనిపెట్టవచ్చు. భిన్నకాలాలలో భిన్న సంస్కృతి సంప్రదాయాలు, వాటి ఎత్తు పల్లాలు, సామాజిక స్థితిగతులు, బలాలు బలహీనతలూ ఒకటేమిటి... ఏరుకున్న వాడికి ఏరుకున్నంత, ప్రబంధరీతిలో విషయాను క్రమణిక రాశారు. అది పురవర్ణనలతో ప్రారంభమవుతుంది. వుయ్యూరు సంస్థానాధిపతి శ్రీరాజావేంకటాద్రి వారు అకారాది క్రమంలో చేర్చమన్నారు. చేర్చారు. కవి కాలక్రమం, ఆశ్వాసపద్య సంఖ్యలు, అకారాదిక్రమ వర్ణ్యానుక్రమ ణికలతో ఇప్పుడీ గ్రంథం సాహిత్య ప్రియులకు అందుబాటులో ఉంది.

ఓలేటి వేంకటరామశాస్త్రులు, విక్రమదేవవర్మ, అచంట వేంకట సాంఖ్యాయనశర్మ, బుర్రా శేషగిరిరావు, గిడుగు వేంకట రామమూర్తి పంతులు, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు, కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, నడికుదుటి వీరరాజకవి, వేంకట పార్వ తీశ్వర కవులు, శేషాద్రి రమణ కవులు, మంత్రిప్రగడ భుజంగరావు, కోటగిరి వేంకట కృష్ణారావు, చెలికాని లచ్చారావు, కేతవరపు వేంకట శాస్త్రి, తల్లా ప్రగడ సూర్యనారాయణ శాస్త్రి, వత్సవాయి వేంకట నీలాద్రిరాజు, మేడిపల్లి వేంకట రమణాచార్యులు, పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి, పప్పు మల్లికార్జునరావు వీరందరూ దాసరి లక్ష్మణ స్వామి కృషిని కొనియాడకుండా ఉండలేకపోయారు.

ఇది ఓలేటి వేంకటరామశాస్త్రి గారి ఆనందం-

**ఆంధ్ర కావ్య ప్రపంచంబు నందు గల్గు**
**వర్ణనములెల్ల నరయంగ వలయునన్న**
**నరయ గావచ్చు వీదు రత్నాకరమున**
**గరతల సమర్పితామలకంబు పగిది**

**తెలుగుభాషను బెంపు నొందింపఁజేయ**
**వలయు పనులెన్నొ యున్నవి వానిలోన**
**నొకటి కావించి నీవు ధన్యుండవైతి**
**సూక్ష్మ బుద్ధిని దాసరి లక్ష్మణకవి**

ఇది మంత్రిప్రగడ భుజంగరావుగారి ఉబ్బితబ్బిబ్బు కాదు. సత్యం-

ఇందరు పండితులు మెచ్చిన సంకలనం లక్ష్మణస్వామి గారు కూర్చడం ఒక విశేషమైతే...ఈ గ్రంథ ముద్రణకు పండితులు, కవులే కాదు సామాన్యులు కూడా తల ఓ చెయ్యి వేయటం నాటి సమాజంలో ఉన్న సాహితీప్రియంభావుకతకు నిదర్శనం.

తేవప్పెరుమాళ్ళయ్య గారితో సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయంలో పండితులుగా ఉన్న శ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రి, శ్రీ కూచినరసింహం, పేరి పేరయ్య శాస్త్రి- దాసరి వారి కృషి అద్వి తీయమన్నారు. ప్రోత్సహించారు. జయంతి రామయ్య పంతులుగారు- సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయంలో సైతం దొరకని గ్రంథాలు దాసరి లక్ష్మణస్వామి దగ్గర దొరుకుతాయన్నారు.

శ్రీరంగమాహాత్మ్యం పేరుతో ముగ్గురు కవులు రాసిన వేర్వేరు గ్రంథాలు ఈ వర్ణన రత్నాకరంలో ఉన్నాయి. ఇంకా సోమదేవ రాజీయం- కూచిమంచి జగ్గకవి, యాదవ రాఘవ పాండవీయం- నెల్లూరి రాఘవకవి, మత్స్యపురాణం- హరిభట్టు, భల్లాణ చరిత్రం- పోచిరాజు వీరన్న, షట్చక్రవర్తి చరిత్రము- మల్లారెడ్డి, ఒడయనంబి విలాసం - అజ్జరపు పేరయ్యకవి, మూర్తిత్రయోపాఖ్యానం- దంతు లూరి బాపిరాజు, శ్రీరంగ మాహాత్మ్యం - కట్టావరదరాజు, నల్లాన నృసింహాచార్యులు, భైరవకవి (విడివిడిగా) కవిచకోరచంద్రోదయం- అల్లమరాజు రామకృష్ణకవి, కవిజన చకోర చంద్రోదయం- నారప రాజు కాంతకవి, కార్తిక మాహాత్మ్యం- కుందుర్తి వేంకటాచలకవి, కార్తిక మాస మాహాత్మ్యం- మండపాక కామేశ్వరకవి, కాళిందీ పరిణయం- శొంఠి భద్రాద్రి రామకవి, కిరాతార్జునీయం- గోపాలుని సింగయ్య, కుచేలోపాఖ్యానం- గట్టు ప్రభువు, కుబ్జాకృష్ణ విలాసం- అక్కిన ప్రగడ హరిదాసు, కుమార నృసింహము- కొక్కొండ వెంకట రత్నకవి, వంటివి కొన్నే. చెప్పుకోదగ్గవి అసంఖ్యాకం. తమ పేరు కూడా వినిపించకుండా ఎందరో కవులు ప్రతిభ ఉండి కూడా కాల గర్భంలో ముద్రితాముద్రితగ్రంథులై నిలిచిపోయి ఉండేవారు. వారికో గుర్తింపు... మెచ్చుకోలు... అందేలా చేసిన ఘనత లక్ష్మణస్వామి గారిదే, ఈ ఘనతలో ఓ నిబద్ధత, ఓ విశాల దృక్పథం.

15వ శతాబ్ది పూర్వపు కవులు పట్టుమని 50 మంది కూడా ఈ సంకలనంలో లేరు. 17,18,19 శతాబ్దుల కవులే అధికంగా ఉన్నారు. ఈ యుగ సాహిత్యం పైనే సాహిత్య లోకంలో చిన్న చూపు. మితిమీరిన శృంగారం, శబ్దాడంబరం, చిత్రకవితా విన్యాసం హెచ్చు మీరి భావం పల్చబడిందనే ఆక్షేపణ, సాహిత్య చరిత్రకారులూ దీనిని స్థిరీకరించారు. అది తప్పనీ... ఈ యుగ సాహిత్యంలోనూ అంతకు ముందెన్నడూ కనీ వినీ ఎరుగని అందాలున్నాయనీ మేలిమి రత్నాలను ఏరి చూపించారు దాసరివారు.

ఏ ఒక్క కవికీ అధిక ప్రాధాన్యమివ్వలేదు. తగ్గించనూ లేదు. భావంలో కొత్తదనం, అభివ్యక్తిలో చురుకుదనం ఉంటే చాలు. ఏ చిన్న కవినీ వదల్లేదు. అవి లేని పెద్దకవినీ పట్టించుకోలేదు. ఇది విజ్ఞత, సంస్కారం మేళవింపుతో చేసిన సంకలనం. కవులపట్లగానీ, యుగాలపట్లగానీ, ప్రక్రియలపట్లగానీ పక్షపాతం శూన్యం కుల, వర్గ, ప్రాంత భేదాలకు అతీతం. అన్ని మండలాల కవులూ ఇందులో ప్రతిభతో పరుచుకున్నారు. తాను తెలగకులజుడనని స్పష్టంగా చెప్పు కొన్నా అన్ని వర్గాల కవులనూ తమ సంకలనంలో చేర్చారు ప్రతిభ కొలమానంగా.

చిలకమర్తి వారన్నది నిజం. **వర్ణన రత్నాకరం ఎవడి దగ్గర ఉంటుందో తెలుగు సాహిత్యం మొత్తం వాడి దగ్గర ఉన్నట్లే. వర్ణ నాంశాలను ఎంచుకోవటంలో దార్శనికత ఉంది.**

చివరగా ఒక్కమాట...

పెద్ద కవులకూ, నేతలకూ, సంస్కర్తలకూ 100 ఏళ్ళని, 125 ఏళ్ళని-ఆయా సందర్భాల్లో పెద్ద కార్యక్రమాలు చేపడతాం కదా! ఇప్పటికి దాసరి లక్ష్మణకవి పుట్టి 127 ఏళ్ళవుతుంది. ఆయన గురించీ, ఆయన కృషి గురించీ తెలుగు వారికీ, బయటివారికీ కూడా తెలియ జెప్పాల్సిన అవసరం లేదా? ఇప్పటికైకా ఆయన గురించి తగినంత ప్రచారం చేయవలసిన అవసరాన్ని మనవాళ్ళు గుర్తిస్తారా? ❋

**తెలుగులో సంతకం - స్వాభిమాన సంకేతం**

-రమేష్ పట్నాయక్

# సక్సెస్ పాఠశాలల నుండి తెలుగుమాధ్యమ విద్యార్థుల గెంటివేత!

**పా**ఠశాల విద్యలో సంస్కరణల గురించి, అభివృద్ధి గురించి విద్యామంత్రి మాత్రమే గాక, ఆర్థిక మంత్రి, ఆ పైన ముఖ్యమంత్రి కూడా మాట్లాడటం గమనిస్తున్నాము. అయితే, ప్రకటిత ఆశయాల కంటె అమలుచేస్తున్న విధానాలపైననే ఫలితాలు ప్రధానంగా ఆధారపడి ఉంటాయి. ప్రకటిత లక్ష్యాలకు, విడుదల అవుతున్న రాజపత్రాలకు మధ్య ఎంతమేరకు సయోధ్య ఉన్నదన్నదే మనముందున్న చర్చనీయాంశం.

విద్యా లక్ష్యాలు, విద్యావస్తువు, బోధనామాధ్యమం, బోధనా, పరీక్షా పద్ధతుల మీద విభిన్న వాదనలు ఉన్నా ప్రమాణాలుగల విద్యకు మౌలిక వసతుల కల్పన మరియు అవసరమైనంతమంది ఉపాధ్యాయుల నియామకం ముఖ్యమైన అవసరాలని అందరూ అంగీకరిస్తున్నారు. ఈ క్రమంలోనే ప్రాథమిక పాఠశాలలలో విద్యార్థి, ఉపాధ్యాయ నిష్పత్తి, ప్రస్తుతమున్న 30:1 నుండి 20:1 కి మెరుగు పరచాలని, ఆ క్రమంలో అధికాధిక ప్రాథమిక పాఠశాలలలో ప్రతి తరగతికి ఒక ఉపాధ్యాయుడు ఉండే స్థితి సాధించాలనే డిమాండు ముందుకు వచ్చింది. 2014 అక్టోబరు నుండి 2015 నవంబరు మధ్య కాలంలో ప్రభుత్వ ప్రాథమిక పాఠశాల వ్యవస్థ అనేక ఒడిదుడుకులను ఎదుర్కొని, క్లస్టరైజేషన్, భారీ రేషనలైజేషన్ ప్రమాదాలను దాటి, కొన్ని మార్పులకు గురై ఒక క్రొత్త స్థితికి చేరుకుంది.

రాష్ట్ర ప్రభుత్వం వేలాది ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలలను పునర్వ్యవస్థీకరిస్తూ 2015 నవంబరు 3వ తేదీన జిల్లాల వారీగా 86 నుంచి 98 సంఖ్యలు గల 13 జి.ఓ.లను విడుదల చేసింది. 3886 ప్రాథమిక పాఠశాలలను ఆదర్శ పాఠశాలలుగా ప్రకటించి, వాటికి సమీపంలో ఉన్న 1349 ప్రాథమిక పాఠశాలలను వాటిలో విలీనం చేసింది. విలీనాల అనంతరం విద్యార్థి నమోదు 80 దాటిన ప్రాథమిక పాఠశాలలను ఆదర్శ పాఠశాలలుగా గుర్తించడం, తరగతికి ఒక ఉపాధ్యాయుడు ప్రాతిపదికన ఐదు పోస్టులు మంజూరు చేయడంతో పది సంవత్సరాలుగా విద్యారంగ ఉద్యమం చేస్తున్న ఒక డిమాండ్‌ను ప్రభుత్వం ఆదమోదించినట్లయింది. అయితే అదే జీ.ఓ.ల ద్వారా మరి 1476 ప్రాథమిక పాఠశాలలను మూసివేసి ఆయా పాఠశాలలలో చదువుతున్న బాలలను పొరుగూరి పాఠశాలలకు వెళ్ళి చదువుకోమని సూచించారు. సదరు మూసివేయబడిన పాఠశాలలలో అంతవరకూ విద్యనభ్యసిస్తూ ఉండిన సుమారు 30 వేల మంది బాలలు వారికి సూచించబడిన పొరుగూరి పాఠశాలలకు వెళుతున్నారో లేదో ప్రభుత్వం పట్టించుకోవడం లేదు. అదలా ఉండగా



ఆదర్శ పాఠశాలలకు ప్రాధాన్యత పేరుతో మిగిలిన సుమారు ఇరవై ఐదు వేల పాఠశాలలపై మరింత నిర్లక్ష్యం పెరుగుతున్న సూచనలు కనిపిస్తున్నాయి. మొత్తంపై గోరంత లాభం కొండంత నష్టంగా ఉంది.

ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలలలో ఆదర్శ పాఠశాలలు పదిశాతం మాత్రమే. మిగిలిన 90 శాతం పాఠశాలల అభివృద్ధికి చర్యలు తీసుకోవడం ఎంతైనా అవసరం. బాలల నమోదు 61-79 గల పాఠశాలలకు 4వ ఉపాధ్యాయ పోస్టు ఇస్తే, ఆ పాఠశాలలు సంవత్సర కాలంలో నమోదును 80కి పెంచుకుని ఆదర్శ పాఠశాల గుర్తింపును, దానితో పాటు వచ్చే ప్రయోజనాలను సంపాదించుకోగలవు. అందుకు ప్రభుత్వం ముందుకు రావడం లేదు. ప్రతి ప్రాథమిక పాఠశాలను ఆదర్శ పాఠశాలగా అభివృద్ధి చేసే క్రమాన్ని అనుసరించవలసిన ఆవశ్యకత ఉంది. అలా చేయకపోతే ఆదర్శ పాఠశాలలు ఒక కొత్త దొంతరగానే మిగిలిపోతాయి. మిగలక పోవచ్చు కూడా! అలాగే, విద్యార్థుల నమోదు 41-60 గల ప్రాథమిక పాఠశాలలకు కనీస వసతులు కల్పించి మూడవ ఉపాధ్యాయ పోస్టు మంజూరు చేస్తే ఆ పాఠశాలలు నిలదొక్కుకోగలగుతాయి. క్రమంగా అభివృద్ధి చెంద గలుగుతాయి. ఈ విషయంపై ప్రభుత్వానికి ఎటువంటి శ్రద్ధాలేదు. అదలా ఉండగా, విద్యా హక్కు చట్టం ప్రకారం అవాసప్రాంతానికి ఒక కిలోమీటరు దూరంలోపున ప్రాథమిక పాఠశాల అందుబాటులో ఉండాలి. పాఠశాలలో విద్యార్థుల సంఖ్య 30 లోపున ఉన్నా, 20 లోపున వున్నా ఇద్దరు ఉపాధ్యాయులను నియమించాలి. కాని, ప్రభుత్వం ఈ పాఠశాలలను ఏకోపాధ్యాయ పాఠశాలలుగా దిగజార్చి మూసివేతలకు దారులు వేస్తూంది. భవిష్యత్తులో మరిన్ని ఆదర్శ పాఠశాలలు ఏర్పడతాయా లేక మరిన్ని పాఠశాలలు మూత పడతాయా అన్నది ప్రభుత్వ విధానాలపైనా, ప్రజల ఒత్తిడిపైనా మరియు ఉపాధ్యాయుల శ్రద్ధపైన ఆధారపడి ఉంటుంది.

అనేక ప్రైవేటు పాఠశాలల కంటె ప్రభుత్వరంగ ఉన్నత పాఠశాలలు మెరుగ్గా ఉన్నాయి. ఈ మధ్య రాష్ట్రంలో ఉన్నత పాఠశాలలకు ర్యాంకింగ్ ఇస్తే 11 జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలు, ఒక ప్రభుత్వ ఆవాస పాఠశాల మాత్రమే "ఏ" గ్రేడు సంపాదించాయి. ఒక్క ప్రైవేటు పాఠశాలకు కూడా "ఏ" గ్రేడు రాలేదు. అన్ని సామాజిక వర్గాలకు ప్రమాణాలు గల, సృజనాత్మకమైన విద్యను అందించడంలో ప్రభుత్వ రంగమే మొనగాడుగా నిలబడింది. అయితే గల పదేళ్ళుగా ప్రభుత్వాలు అనుసరిస్తూన్న విధానాలు, పరికల్పన చేస్తూన్న ఆలోచనలు ఉన్నత పాఠశాలలలో ప్రమాణాలను క్రమంగా బలహీన పరుస్తున్నాయి.

ప్రతి ఉన్నత పాఠశాలకు ఒక ప్రధానోపాధ్యాయ పోస్టు ఉంటుంది, కాని, మండల విద్యాశాఖాధికారి పోస్టులు ఖాళీగా ఉండడం వలన అనేకమంది ప్రధానోపాధ్యాయులు మండల విద్యాశాఖాధికారులుగా కూడా పనిచేస్తున్నారు. ఈ పరిస్థితి ఆయా పాఠశాలల అభివృద్ధికి అటంకంగా తయారయ్యింది. ప్రతి 250 మంది విద్యార్థులకు, ఒక వ్యాయామ ఉపాధ్యాయుడు అవసరం. అయితే ప్రభుత్వం ఈ అవసరాన్ని గుర్తించడం లేదు. విద్యార్థుల నమోదు 820 వరకు ఒక వ్యాయామ విద్య పోస్టును మాత్రమే మంజూరు చేస్తూంది. పనివిద్య, కళ విద్యవంటి పోస్టుల మంజూరు, నియామకం మరింత అధ్వాన్నంగా ఉంది. సజ్జక్టుల విషయానికి వస్తే- మూడు భాషలు, ఒక సోషల్, రెండు సైన్సులు, ఒక గణితం బోధనలకు ఏడుగురు ఉపాధ్యాయులు అవసరం. ఆ స్టాఫ్ ప్యాటర్న్ ప్రభుత్వం అమోదించిందే. అయితే పోస్టుల రేషనలైజేషన్ నిబంధనలు ఇందుకు విరుద్ధంగా ఉన్నాయి. తెలుగు మరియు ఆంగ్లము. రెండు మాధ్యమాలున్న సక్సెస్ పాఠశాలలలో 6వ తరగతి నుంచి 10వ తరగతి వరకు ఐదు తెలుగు మాధ్యమం తరగతులకు ఏడుగురు సబ్జెక్టు ఉపాధ్యాయులు అవసరం. అలాగే 6వ తరగతి నుంచి 10వ తరగతి వరకు ఐదు ఆంగ్లమాధ్యమం తరగతులకు మరి ఏడుగురు సబ్జెక్టు ఉపాధ్యాయులు అవసరం. కాగా, ఇంగ్లీషు మీడియం తరగతులను ప్రభుత్వం సమాంతర పాఠశాలగా గుర్తించకుండా నాలుగు పోస్టులు (గణితం, సోషల్, ఇంగ్లీషు, జీవశాస్త్రం)మాత్రమే మంజూరు చేస్తుంది. ఫలితంగా, అనేక సందర్భాలలో ఉపాధ్యాయులు రెండు సెక్షన్లకు కలిపి పాఠం చెప్పవలసి వస్తుంది. 2011లో విడుదల చేసిన జి.ఓ 55 ప్రకారం రెండు సెక్షన్లు కలిపి 120 వరకు కూడా ఉండవచ్చు. అటువంటి సందర్భంలో తరగతి గదులు కూడా పట్టడం లేదు. సగంమంది విద్యార్థులు తరగతి గది బయట కూర్చొనవలసి వస్తుంది. విద్యార్థుల యూనిట్ పరీక్షల పేపర్లు దిద్దడం చాలా కష్టమైన పనిగా మారిపోయింది.ఇక విద్యార్థి అభివృద్ధిపై వ్యక్తిగతమైన శ్రద్ధ అసాధ్యమయిపోయింది. ఈ పరిస్థితి రాష్ట్రీయ మాధ్యమిక శిక్షా అభియాన్ నిబంధనలకు పూర్తిగా విరుద్ధం. రాష్ట్రీయ మాధ్యమిక శిక్షా అభియాన్ నిబంధనల ప్రకారం వేరు వేరు మాధ్యమాలను సమాంతర పాఠశాలలుగా గుర్తించాలి. ఒక మాధ్యమంలో ఒక తరగతిలో విద్యార్థుల సంఖ్య 50 దాటితే రెండవ సెక్షన్, 80 దాటితే 3వ సెక్షన్, 120 దాటితే 4వ సెక్షన్ ప్రారంభించాలి. ప్రతి ఐదు సెక్షన్లకు ఏడుగురు సబ్జెక్టు టీచర్లను నియమించాలి. పని విద్య, కళ విద్య, వంటి ఉపాధ్యాయులు అదనం. జీ.ఓ. 55ను రద్దు చేయాలని, అంగ్లమాధ్యమ తరగతులను సమాంతర పాఠశాలగా గుర్తించాలని, స్టాఫ్ ప్యాటర్న్ అమలు చేయాలని ఉపాధ్యాయ సంఘాలు చేస్తున్న డిమాండ్లను ప్రభుత్వం పట్టించుకోవడం లేదు. ఇదే పరిస్థితి మరికొంత కాలం కొనసాగితే ప్రభుత్వ ఉన్నత పాఠశాలలు మరింతగా సంక్షోభానికి గురయ్యే ప్రమాదం ఉంది.

ప్రభుత్వ ఉన్నత పాఠశాల వ్యవస్థను క్రిందుమీదులు చేసే మరొక సమస్య ముంచుకొస్తుంది. నూతన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 3,428 సక్సెస్ పాఠశాలలో ఇంతకు ముందు చెప్పుకున్నట్లు తెలుగు, ఆంగ్ల మాధ్యమాలు రెండూ ఉన్నాయి. ఈ పాఠశాలల్లో విద్యార్థులకు తెలుగు మాధ్యమాన్ని ఎంచుకునే అవకాశం కూడ ఉంది. ఇప్పటికీ ఈ పాఠశాలల్లో రెండువంతుల మంది విద్యార్థులు, ప్రధానంగా మొదటి తరం విద్యార్థులు తెలుగుమాధ్యమాన్నే ఎంచుకుంటున్నారు. గత సంవత్సరం ఆగస్టు 14న విడుదల అయిన జీ.ఓ. 53 సక్సెస్ పాఠశాలలో తెలుగుమాధ్యమాన్ని తొలగించాలని నిర్దేశిస్తూంది. నిరసనలు వ్యక్తం కావడంతో ఆ జీ.ఓ.ను ఆనాడు తాత్కాలికంగా నిలువుదల చేశారు. సదరు జీ.ఓ.ను తిరిగి పునరుద్ధరించాలనే ప్రయత్నాలు ప్రారంభమయినాయి. ఈ సక్సెస్ పాఠశాలలో ఆంగ్లమాధ్యమంలో 4,20,066 మంది విద్యార్థులు, తెలుగు మాధ్యమంలో 9,19,114 మంది విద్యార్థులు చదువుతున్నారు. సదరు జీ.ఓ. 53 పునరుద్ధరించ

తరువాయి 50 పుటలో..



# 'తెనుగులెంక' సూక్తులు-9

**"అన్నదాత రైతు విన్నన పాలైన**
**నెట్లు నిల్చు శాంతి యీ జగాన**
**పడవ మున్గెనన్న బాటసారుల బ్రతు**
**కడుగనేల యెంత బెడదవచ్చె"**

'తెనుగు లెంక' 'అభినవ తిక్కన'
**తుమ్మల సీతారామమూర్తి.**

**దే**శంలోని ప్రజలందరి ఆకలి మంటలను ఆర్పి, ఆహారాన్ని అందించి ఆనందింప జేసేవాడు రైతు. ఆరుగాలం కష్టించి, రుధిరాన్ని స్వేదంగా మార్చి మట్టినుండి పుత్తడిని సృష్టించేవాడు రైతు. అలాంటి రైతు పండించే పంటను ఆస్వాదించే ప్రజలు, నాయకులు రైతుల గురించి ఆలోచించక పోవడం విచారించ దగ్గ విషయం. రాజకీయ నాయకుల ఉపన్యాసాలలో, కవుల రచనల్లో రైతుల గొప్పతనం, త్యాగధనం వర్ణించబడుతుంది. పార్లమెంటు నుంచి పల్లెల్లోని గల్లీలవరకు రైతు అన్నదాత అని, దేశానికి వెన్నెముక అని కీర్తించేవారు, రైతుల కష్టాలను తొలిగించడానికి చేసే ప్రయత్నం మాత్రం కంటికి కనిపించదు.

సమస్యల సుడిగుండంలోకి వెళుతున్నామని తెలిసినా, ముందున్నది ముండ్ల బాట అని తెలిసినా ధైర్యంగా ముందుకు అడుగులువేస్తూ రైతు సాగుచేస్తాడు. ఎదపెట్టే విత్తనాలు మంచివో, కల్తీవో తెలియదు. ఎరువులు పురుగుమందులు పని చేస్తాయో, లేదో తెలియదు. అతివృష్టి, అనావృష్టి ఎప్పుడు పంటను నాశనం చేస్తుంటాయో తెలియదు. పంట ఎంత పండుతుందో, పండినపంటకు గిట్టుబాటు ధరవస్తుందో రాదో తెలియదు. ఇన్ని సందేహాలమధ్య, నమ్మకంతో, ఆశావహ దృక్పథంతో వ్యవసాయం చేసే యోగి పుంగవుడు రైతు.

భారతదేశంలో వ్యవసాయం గురించి తెలిసిన వ్యక్తులు ప్రధానమంత్రిగానో, వ్యవసాయ శాఖ మంత్రిగానో పనిచేయక పోవడం రైతుల దురదృష్టం. రైతుల గురించి మొసలి కన్నీరు కార్చేనాయకులు, వ్యాపారవేత్తలకు ఎర్ర తివాచీ పరచి, ఎన్నో రాయితీలు ఇచ్చే ప్రభుత్వాలు, రైతుల శ్రమను గురించి ఆలోచించవు. ఒక వ్యాపారవేత్త తాను సృష్టించిన వస్తువుకు తగిన ధరను తానే నిర్ణయిస్తాడు. అమ్ముకుంటూ అధికలాభాన్ని ఆర్జిస్తాడు. కాని రైతు పండించే పంటకు వ్యవ సాయం గురించి తెలియని నాయకులో, అధికారులో గిట్టుబాటు ధరను నిర్ణయిస్తారు. తాను పండించిన పంటకు ధరను నిర్ణయించే అధికారం లేనివాడు ఒక్క రైతేనేమో!

వ్యాపారవేత్తలకు కోట్లాదిరూపాయలు అప్పనంగా అప్పుగా అప్పగించే బ్యాంకులు, రైతులకు ఋణం ఇవ్వడానికి సవాలక్ష సార్లు తిప్పుకుంటారు. బ్యాంకులిచ్చిన సొమ్మును దారి మళ్ళించి, వ్యాపారవేత్త డబ్బు చెల్లించ లేనని మొండికేస్తే, 'వన్‌టైమ్ సెటిల్‌మెంటు' పేర వడ్డీకి, అసలుకి రాయితీలు ఇచ్చే బ్యాంకులు, ప్రభుత్వాలు, ప్రకృతి వైపరీత్యాల వలన నష్టపోయి, అప్పులు చెల్లించ లేక, ఆత్మహత్యలకు పాల్పడే రైతులకు ఋణమాఫీ చేస్తామంటే కుంటి సాకులతో నిరాకరిస్తాయి. గణాంకాలు పరిశీలిస్తే అప్పులు తీర్చలేక ఆత్మహత్యలు చేసుకున్న ఆత్మాభిమానులైన కర్షకులు కనిపిస్తారుగాని, అప్పులు చెల్లించలేక ఆత్మహత్యలు చేసుకున్న వ్యాపారవేత్తలు కనిపించరు. వ్యవసాయం జూదంగా మారిందనే విష యాన్ని గుర్తించిన వారెందరో, వ్యవసాయాన్ని విడిచి పెట్టారు. రైతులందరూ వ్యవసాయం మానివేస్తే, దేశానికి అన్నం ఉండదు. ప్రజలు ఆకలితో మలమల మాడిపో తారు, అందుకే తుమ్మలవారు–

"అన్నదాత అయిన రైతు అవమానం పాలైతే లోకంలో శాంతి ఉండదు. పడవమునిగిపోతే బాటసారు లకు దారి లేనట్లే, రైతు ఆహారం పండించకపోతే ప్రజలు బ్రతుకలేరు. వారికి కష్టాలు తప్పవు" అని చెప్పారు. ఇది నిజం. రైతుల గురించి ఇప్పటి కయినా ప్రభుత్వాలు ఆలోచించాలి. అవసరాలు గుర్తించి ఆదుకోవాలి.

**–డాక్టర్ నాగభైరవ ఆదినారాయణ,**
98497 99711

కవిత

# ఉగాది గీతం



**గుర్రాల రమణయ్య**
99639 21943

**కో**యిలా కోయిలా పాడవమ్మ నేడైన
వాడుతున్న తెలుగు తీగ పుష్పించగ యిపుడైన

నేటిపాట నీటి తేట తేనె ఊటలా ఉండాలి
తెలుగుజాతి వెలుగు దీప్తి భాసిల్లిన రీతి పండాలి
మొలకనవ్వు వేపపువ్వు గల గలాడినట్లుగా
పిందెమావి కనరు రుచులు బతుకు నిండినట్లుగా
చెరకు గడల పలుకుబడులు ననలు గూడి తీయగా
చింత తీరి అలవిమీరి ఉగాది లాగ హాయిగా
మధురమైన అమ్మమాట కమ్మనైన పాటగా

కోయిలా కోయిలా పాడవమ్మ నేడైన
వాడుతున్న తెలుగు తీగ పుష్పించగ యిపుడైన

జగతి కొరకు జనత కొరకు మమత కొరకు సమత కొరకు
తెలుగు వెలుగు తెలుగు పలుకు తెలుగు దనపు దారులొలుకు
తెలుగు జ్యోతి తెలుగు కీర్తి పరభాషను మించువరకు

కోయిలా కోయిలా పాడవమ్మ నేడైన
వాడుతున్న తెలుగు తీగ పుష్పించగ యిపుడైన

ఇంటింటా తెలుగుపంట బ్రతుకంతా పండగా
తెలుగు ఆది ఉగాది గీతి ప్రతియింటా పాడగా
మామిడాకు తోరణాలు ప్రతి గడపన భాసిల్లగా
పంచెకట్టు పైట పరువం ప్రతివాడన విరాజిల్లగా
కలబోసిన షడ్రుచుల పచ్చడైన ప్రతి మనసు
అచ్చతెలుగు పదాలధార పలుకు పలుకున ధ్వనించగా
ముద్దులొలుకు బిడ్డపలుకు ప్రతి తల్లిని మురిపించగా
వసంతోత్సవ శుభవేళ వీనులవిందు చేయగా
కోయిలా కోయిలా పాడవమ్మా నేడైన
వాడుతున్న తెలుగు తీగ పుష్పించగ యిపుడైన..

-బద్రి కూర్మారావు
97047 98643

# రెల్లిభాషకు నిఘంటువును, సాహిత్యాన్ని సమకూర్చిన దళితకవి చెన్నా సన్యాసిరావు

చెన్నా సన్యాసిరావు గారు 1937 సంవత్సరంలో విశాఖ పట్నంలో రెల్లి కులంలో జన్మించారు. రెల్లి కులం ఉత్తరాంధ్రలో ఒక అణగారిన దళితకులం. ఈ కులస్థులకు ఒరియాభాషను పోలిన ఒక ప్రత్యేక భాష ఉంది. దానికి లిపిలేదు. రెల్లి, హడ్డి, ఘాసీ, పాకీ, అని పిలువబడే ఈ దళిత కులంలో ఎక్కువమంది పాకీ (పారిశుధ్య) కార్మికులుగా ఉన్నారు. వేసవి కాలంలో మామిడితోటలకు కాపలాగా ఉంటారు. స్త్రీలు పట్టణ గ్రామీణ ప్రాంతాలలో ఎక్కువగా పళ్లు అమ్ముకొని జీవిస్తారు. వీరిలో ఎక్కువమంది నిరుపేదలే. అటువంటి సామాజిక వర్గంలో జన్మించి విశాఖపట్నం ఎ.వి.యన్. కళాశాలలో విద్యాభ్యాసం పూర్తి చేసి న్యాయవాదిగా వృత్తిని ఆరంభించి, తరువాత ప్రొబేషన్ అఫీసరుగానూ, విశాఖ పోర్టు ట్రస్టులో పర్సన్నెల్ ఆఫీసరుగా పని చేసిన చెన్నా సన్యాసిరావు గారు పదవీవిరమణ గావించారు.

చెన్నా సన్యాసిరావు తన కులస్థుల సామాజిక, ఆర్థిక, విద్య, ఉద్యోగ వెనుకబాటుతనం గూర్చి సంస్కృతిగూర్చి పరిశోధనాత్మకంగా పరిశీలించి ఎన్నో వ్యాసాలు, కవితలు వ్రాశారు. గ్రామాలఅవతలకు నెట్టబడిన దళితుల జీవితాలను గూర్చి "ఊరవతల సూరీడు" అనే కవితా సంకలనం తీసుకువచ్చారు. అందులో తన కులం వారు అనుభవిస్తున్న అంటరానితనం గూర్చి వ్రాశారు. ఇతర పత్రికలలో అప్పుడప్పుడు దళితుల సమస్యలు, మతమార్పిడిలు గూర్చి వ్యాసాలు వ్రాశారు. తను పుట్టిపెరిగిన రెల్లి కులం గూర్చి 1999లో రెల్లి కులస్థుల ఉనికి, పుట్టుక, ఆచార వ్యహారాలు, భాషవంటి సామాజిక కోణంలో 'రెల్లి చరిత్ర' పుస్తకం వ్రాశారు.

తరువాత ఆయన చూపు అంతరించిపోతున్న తన అమ్మనుడి అయిన రెల్లి భాషపై పడింది. అందుకే ఏ విశ్వవిద్యాలయాల సంస్థల సహాయము లేకుండా పదికాలాల పాటు నిలిచే రెల్లిభాష నిఘంటువు (2004)ను రచించారు. యునెస్కో లెక్కల ప్రకారం అనేక మాతృ భాషలు కనుమరుగైపోతున్నాయి. అందులో రెల్లి భాషకూడా ఒకటి. అటువంటి లిపిలేని భాషకు నిఘంటువు (రెల్లి -తెలుగు) వ్రాయడం అంత సులభమైన విషయం కాదు. అందులో ఆయన కృతకృత్యుడు అయినప్పటికీ అతనికి రావలసినంత గుర్తింపూ రాలేదు. బహుశా కొంతమంది స్వకులస్థులు గుర్తించి ఉండవచ్చు. రాష్ట్రంలో అక్క డక్కడకు వలసపోయిన ఉత్తరాంధ్ర రెల్లి కులస్థులు కొన్నిచోట్ల సదస్సులను నిర్వహించి చెన్నా సన్యాసిరావు గారి పుస్తకాన్ని పరిచయం చేశారు.

తరువాత రెల్లి భాషకు సంబంధించినటువంటి జానపద గేయాలను సేకరించి "రెల్లి జానపద గేయాలు" (2008) అనే పుస్తకాన్ని ప్రచురించారు. బర్మానుండి వలస వచ్చిన బర్మా కాంది శీకులు గూర్చి "రేపాట్రియేట్స్ ఫ్రమ్ బర్మా" అనే ఆంగ్ల పుస్తకాన్ని వ్రాయడానికి సమాచారం సేకరించారు. కాని అది ప్రస్తుతం లభ్య మవటం లేదు.

పిల్లలకోసం బాబాసాహెబ్ అంబేద్కర్ (2009) అనే పుస్తకాన్ని వ్రాశారు. రెల్లి భాషలో ఒక సామాజిక నాటికను (2011)లో వ్రాశారు. 'రెల్లిమంగ' అనే సామాజిక నాటికను 2013లో వ్రాసి అందులో రెల్లి స్త్రీలు అనుభవిస్తున్న కష్టాలు గూర్చి, అగచాట్లు గూర్చి వ్రాశారు. ఇటీవల రెల్లి భాషకు లిపిని కూడా సూచించారు.

అలాగే దళిత కులాలు ఎందుకు హిందూమతాన్ని వీడి ఇతర మతాలలోకి వెళ్తున్నారో, వాళ్లు మతాన్ని వీడకుండా ఉండాలంటే ఏమి చేయాలో వంటి వాటిపై వ్యాసాలు వ్రాశారు. యానాం, విశాఖ పట్నం, విజయనగరం, శ్రీకాకుళం, విజయవాడ వంటి ప్రాంతాల్లో సాహిత్య సభలలో పాల్గొన్నారు. అరసం కార్యవర్గసభ్యులుగా, అంబేద్కర్ మెమోరియల్ సొసైటీ కార్యదర్శిగా పనిచేశారు.

మాతృదేశాన్ని ప్రేమిస్తున్నట్లే మాతృభాషను కూడా ప్రేమించి తన మాతృభాష అయిన రెల్లి భాష అంతరించకూడదని దానిని పరిరక్షించుకోవాలని తపన పడ్డారు.

"రెల్లి చరిత" అనే పుస్తకం ద్వారా 2000లో పరిచయమైన చెన్నా సన్యాసిరావు గారిని కలిసినప్పుడల్లా ఈ లోకాన్ని వీడేముందు తనజాతికి సమాజానికి ఏదో చెయ్యాలని తపన పడేవారు. అనుకో కుండా 2015 ఆగస్టు, 25న ఈ లోకాన్ని వీడారు. సవరభాషకు సేవ చేసిన గిడుగు రామమూర్తి గారి లాగ రెల్లిభాషకు చెన్నా సన్యాసి రావుగారి కృషి కూడా చాలా ఉంది. తన కులస్థుల ద్వారాగాని, ఇతర సామాజికవేత్తల ద్వారా గాని, తన ఆశయాలు నెరవేరాలని ఆశిస్తూ రెల్లి సమాజం కోసం ఎంతో కృషి చేసిన చెన్నా సన్యాసిరావు గారు ఆ సమాజం ఉన్నంతకాలం జీవించే ఉంటారు. ❋

## స్పందనను వ్రాయండి

**'అమ్మనుడి'**లో రచనలపై
మీ స్పందనను వ్రాసి పంపండి!
సంపాదకుడు
'అమ్మనుడి', జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ
కళాశాల వీధి, మాచవరం, విజయవాడ-520 004.
ఇ-మెయిల్ : *ammanudi@gmail.com*

–జ్వలిత
99891 98943

# 'రుంజ'

ప్రాచీన కాలం నుండి శ్రామికుడు, చేతివృత్తి కులాల ఆధారంగా జానపదకళలు కొనసాగుతూ వచ్చాయి. అటువంటి అతి ప్రాచీన కులాధారిత కళల్లో ఒకటి రుంజ. పౌరాణిక భూమిక కలిగి 'పార్వతీ కళ్యాణం' సమయంలో ప్రారంభమయి యిప్పుడు కొనూపిరితో కొట్టుమిట్టాడుతున్నది. కారణాలేవయినా అంతరించి పోతున్న కళల్లో మొదటిదిగా చెప్పదగినది 'రుంజ'. తెలుగు రాష్ట్రాలు రెండింటిలో కేవలం ఇద్దరు ముగ్గురు కళాకారులు మాత్రమే మిగిలి ఉన్నారు.

శబ్ద ప్రధానమైన రుంజ వాయిద్యాన్ని రుంజ కులస్తులు మాత్రమే మోగించగలరు. రుంజ కళను వాయిద్యం పేరుతోనే పిలవబడడం దీని ప్రత్యేకత. రుంజ అనేది విశ్వబ్రహ్మ (విశ్వబ్రాహ్మణ/ విశ్వకర్మ) కులానికి ఉపకులం. వారివారి కులపురాణాలను చరిత్రను గానం చేస్తూ విశ్వబ్రహ్మలను మాత్రమే యాచిస్తూ వారిపై ఆధారపడిన కులం రుంజ. ఈ కళలో కళాకారులకు ఎటువంటి ఆహార్యం వుండదు. ప్రదర్శనానుగుణంగా బిగ్గరగా అరవాల్సున్నందున పేద కడుపుకు బలంగా పై కండువాను నడుముకు బిగిస్తారు. భక్తి, వీర రసప్రధానమైన కళ రుంజ. శబ్దప్రధానమైన రుంజ కళలో దాదాపు మూడడగుల ఎత్తుతో పద్దెనిమిది నుండి ఇరవై అంగుళాలవ్యాసార్థంతో వుండే భారీ వాయిద్యం యిది. పై భాగం కంటె కింది భాగం వెడల్పు తక్కువుండే. గుండ్రటి యిత్తడి డోలక్‌కు రెండు వైపుల గుండ్రటి ఇనుప కడియాలకు(రింగులకు) చర్మం బిగించి కళాకారులే స్వయంగా తయారు చేసుకుంటారు రుంజను. దీని తయారీకి పూర్వం జింక చర్మం ఉపయోగించేవారు తరువాత మేకచర్మం ఉపయోగిస్తున్నారు. అన్ని వాయిద్యాల కంటే పెద్దది 'రుంజ'. గర్భిణీ స్త్రీలు, హృద్రోగులు భరించలేనంత పెద్ద శబ్దం వస్తుందని, నా చిన్నపుడు నెలలు నిండిన స్త్రీలను ప్రదర్శనకు దూరంగా వుంచడం నాకిప్పటికీ జ్ఞాపకం.

మూలస్తంభ పురాణం/ విశ్వబ్రహ్మపురాణం ప్రథమాశ్వాసంలో రుంజ గురించి వివరించబడింది. పంచబ్రహ్మల జననం, రుంజ ఆవిర్భావం, దక్ష యజ్ఞం, పరమేశ్వర పరిణయం (పార్వతీకళ్యాణం) మొదలయిన ఇతివృత్తాలను రుంజ కళలో ప్రదర్శిస్తారు. ఈ వాయిద్యం పై 32 రకాల వాయిద్యాలను సప్తతాళాలను మోగిస్తూ విశ్వబ్రహ్మ పురాణాన్ని వివరిస్తారు కళాకారులు. పుల్లలనుపయోగించి డోలు, బాండు, డప్పు, తీన్‌మార్ వంటివి మోగిస్తారు.

విశ్వబ్రహ్మల ఉపకులమైన రుంజ వారు విశ్వబ్రహ్మల కుటుంబా లలో జరిగే బాలసారె (బారసాల) ఉపనయనం, పెళ్ళి మొదలయిన సమయాల్లో రుంజను ప్రదర్శిస్తారు. దహనసంస్కారాలు, నంది ప్రతి ష్ఠాపన సమయంలో శరభ పలకడం, ఖడ్గాలు చెప్పడంలో వీర, రౌద్రరసాలను రుంజ కళా ప్రదర్శన చూస్తే పురాణశ్రవణంలో వినోదం, సంగీత కచ్చేరీలో ఆనందం, ఒక విజ్ఞాన ప్రదర్శనలో పొందే జ్ఞానాన్ని పొందవచ్చును.

### పార్వతీ కళ్యాణం

కృతయుగంలో రెండురకాల వివాహాలుండేవి. అవి గంధర్వ వివాహం, రాక్షస వివాహం. వివాహంలో రెండు రకాల వాయిద్యా లుండేవి. శంకరుడు శంభో అని శంఖం పూరించేవాడు. పార్వతి అమ్మవారు మురుకం వాయించేది. దాక్షయణీదేవి దక్షయజ్ఞంలో



భస్మమయి తరువాత హిమవంతుని పుత్రికగా జన్మించింది. పర్వత రాజ పుత్రిక పార్వతియని నామధేయం జరిగింది పరమేశ్వరుని కళ్యాణం జరగాలి. గంధర్వ వివాహం రాబోయే కలియుగంలో సరిపోదని మూడు పద్ధతులు ప్రవేశ పెట్టారు అవి (1) గురిప్రమాణం, (2) సాక్షి ప్రమాణం, (3) న్యాయ ప్రమాణం, గురి ప్రమాణం అంటే మట్టెలు మంగళసూత్రం కట్టడం. సాక్షి ప్రమాణం అంటే వాయిద్యం చప్పుళ్ళు సాక్ష్యం కోసం. న్యాయ ప్రమాణం అంటే పది మంది పెద్దలు కూర్చొని క్రమపద్ధతిలో ఈ విధంగా జరగాలని పద్ధతి చెప్పడం. ఈ మూడు పద్ధతులు దేవతలు ఆలోచించారు. కాని వస్తు సృష్టి ఎవరు చెయ్యాలి. దేవతలందరు కలిసి పెందోటపురంలో వున్న విరాట్‌బ్రహ్మను వేడుకున్నారు.

విశ్వబ్రహ్మ మేఘవాహనుడై త్రిమూర్తులకు దర్శనమిచ్చాడు. అప్పుడు త్రిమూర్తులు శివపార్వతుల కళ్యాణం జరుగబోతున్నది కనుక మెట్టెలు మంగళసూత్రాలు చేసివ్వాలని వేడుకున్నారు. అపుడు విశ్వ బ్రహ్మ తథాస్తు అని సృష్టికర్తను కనుక తప్పకుండా చేసిస్తాను అని అభయమిచ్చాడు. మళ్ళీ దేవతలు వాయిద్యాన్ని కూడా చేసివ్వాలని అడిగారు విశ్వకర్మను. అపుడు ఆ విశ్వకర్మ రజిత పర్వతాన్ని కరిగి రమణికి మెట్టెలు చేసెద, స్వర్ణపర్వతాన్ని కరిగి సూత్రాన్ని చేసెద కాని వాయిద్యం ఎట్లా వుండవలెనో? యని త్రిపురములందు యోచిం చాడు. త్రిపురము రాక్షసులకు నెలవు.

### రౌంజకాసురుని కథ

66 కోట్ల రాక్షసులకు చక్రవర్తి రౌంజకాసురుడు. అంధకా సురుడు, తారకాసురుడు, వరరక్కసుడు వంటి పదహారు మంది అన్నదమ్ములలో అగ్రజుడు. శివభక్తుడు రుంజకాసురుడు. అతని తండ్రి తాత ముత్తాతలు పరమేశ్వరునికై తపస్సు చేసి గొప్ప వరములు

పొందారు. తానుకూడా పొందాలని హిమగిరి ఇంద్రగిరి కైలాసపర్వతమున మధ్యకు పోయాడు ఇసుక లింగము చేసి దాని ప్రక్కవాడి సూది భూమిన మోపి గంజూర ఫలమున (నిమ్మపండు) సూది గుచ్చి సూది మొనమీద శిరసుంచి గోర తపస్సు చేశాడు త్రిమూర్తుల కోసం. తపస్సును మెచ్చి త్రిమూర్తులు దర్శనమిచ్చారు.

అట్టి తపస్సును మెచ్చిన విష్ణువు 'కోరిన వరమిచ్చెద లేరా గొప్పవాడవతవు లేరా' అని అభయం యిచ్చాడు. మూడురోజులు ఏకమై యుద్ధానికి వచ్చినా సూర్య చంద్రులున్నంతకాలం మరణం లేకుండా వరమివ్వమాన్నడు రౌంజకాసురుడు. విష్ణువు జగత్ అంటేనే జన్మించిన ప్రతీది గతించవలసిందే అని అర్థం కదా అని ముందు బ్రహ్మ. శంకరుల వద్ద వరాలు పొందమన్నాడు. బ్రహ్మ రౌంజకాసురునికి 32 ఆయుధాలతో ముప్పు లేకుండా వరమిచ్చాడు. శంకరుడు మృత్యువు లేకుండా నీ రక్త బిందువు భూమి మీద పడిన వెంటనే పెక్కు రాక్షసులు పుడతారు వారే నిన్ను రక్షిస్తారని వరమిచ్చాడు. తరువాత విష్ణువు వద్దకొచ్చి రౌంజకాసురుడు వరమియ్యమన్నాడు. చావకుంట యివ్వడం కాదుకాని అకాల మృత్యువు నుండి వరమిస్తాను మరణించిన ఏడుగడియల్లో తిరిగి బతుకుతవని వరమిచ్చాడు విష్ణువు.

వరాలు పొందిన అసురుడు కృష్ణానదికి అవతలి వైపునున్న నందికొండ నాగార్జునగిరి కోట అయిన తన రాజ్యానికి వచ్చి ఉక్కు ధ్వజస్తంభవ ఎత్తాడు. మీద ఇత్తడి శాసనంలో "త్రిలోకముల్లో 56 రాజ్యములందు నన్ను గెలుచువారు లేరు" అని రాయించి, తిరిగి తపోనిష్టలో కూర్చున్నడు.

దేవతలు రుంజకాసురుని తపోజ్వాలలు భరించలేక చైత్రవైశాఖ మానంలో చీమల వలె మాడిపోతున్నారు. దేవతలంతా పంచముఖ బ్రహ్మను వేడుకున్నారు. రక్షించమన్నారు. విశ్వబ్రహ్మయోచించి చూస్తె వరబలం చేత మనోగర్వంతో ఉన్నాడు రౌంజకాసురుడు. దేవతలందరు సైన్యంగానా వెంటరండని వారికి అభయిమిచ్చాడు. అయిదు మంత్ర బాణాలు తీసుకున్నాడు. ఐదు మంత్ర బాణాలతో మేఘ వాహనంపై రౌంజకాసురుని కోటను ముట్టడించాడు. ఉరుము మెరుపుల్తో భీభత్సం సృష్టించాడు. పట్టణం వెలుపలున్న ఉక్కుస్తంభాని కున్న శాసనాన్ని చదివాడు. "3 లోకాల్లో 56 రాజ్యాలల్లో నన్ను గెలిచే వాడు లేడు" అని వున్నది. రౌంజకాసురుని గర్వాన్ని గ్రహించాడు. భూమి మీదున్న బ్రహ్మాస్త్రమున (గడ్డిపోచను) మంత్రించి శాసనంపై ప్రయోగించాడట, భూమి దద్దరిల్లే ధ్వనితో ఆ శాసన స్తంభం తునాతునకలయ్యింది. రౌంజకాసురుడు ఆ భయంకర ధ్వని విన్నాడు, అతికోప చిత్తుడయి భటులకు ఆజ్ఞాపించాడు చూచి రమ్మని, వారు విశ్వబ్రహ్మను చూచి భయపడి తిరిగి వచ్చి రాజుతో ఒక వీరుడు మేఘవాహనములపై పంచముఖములతో వున్నాడు, శాసన స్తంభాన్ని క్షణంలో పడవేశాడు, అతనితో యుద్ధం మా వల్ల కాదన్నారు, వెంటనే రౌంజకాసురుడు 33 కోట్ల ఉక్కగత తీసుకొని స్వయంగా యుద్ధానికి వచ్చాడు. యుద్ధభేరి మోగిస్తూ రౌంజుడు యుద్ధాన్ని ప్రారంభించాడు. విశ్వకర్మ ఉరుముల మెరుపుల భీభత్సంగా యుద్ధం మొదలుపెట్టాడు రౌంజకాసురుని పై ప్రయోగించిన ఆయుధాలు అతనికి తగిలి టంగ్ మని శబ్దంతో కిందపడుతున్నాయి. ఆయుధం గుచ్చుకుంటే ఒక్క రక్తపు చుక్క భూమిన పడితే వెంటనే అనేకమంది రాక్షసులు పుడుతున్నారు.

అది చూచిన విశ్వకర్మ యుద్ధం చాలించి పెందోటపురమునకేగి తొమ్మిది మూలల హోమగుండం ఏర్పరిచి ధ్యానం చేసి, విశ్వనాం విశ్వభూతానాం అంటూ కులదైవమైన కామాక్షమ్మను ఆహ్వానించి విషయం చెప్పాడు, ఆదిశక్తి అవతారంలో రావాలని, ఆ అసురుని నెత్తురు నేలను తాకకుండా చేయమన్నాడు. ఇది ద్వాపర యుగం చేస్తాను రాబోయే కాలం కలియుగంలో సంగతేమిటని అనడిగింది ఆ తల్లి. అప్పుడు విశ్వకర్మ తల్లీ నాకు మను, మయ, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞ అనే ఐదుగురు కొడుకులున్నారు. వారు ప్రతి అమావాస్యకు బలి బంధు చేస్తారు. ప్రతి ఉగాది పండుగకు పనిముట్లు కడిగి కంకణాలు కట్టి తొమ్మిది రోజులు పండుగ చేస్తారు అని చెప్పాడు. అప్పుడు కామాక్షమ్మ అదిశక్తి రూపుదాల్చి ఆకాశమంత ఒక పెదవి, భూమంతా ఒక పెదవిగా బ్రహ్మాండమంతా నాలుక పరిచింది. ఆ విధంగా శంకరుని వరం పోయింది.

తరువాత బ్రహ్మ వరం 32 ఆయుధాలతో మరణం లేకుండటం. సూర్యుడు విశ్వకర్మకు మేనల్లుడు. అతణ్ణి పిలిచి పంచ భక్ష్యపరమాన్నాలు పెట్టాడు. భుక్తాయాసంతో పడకేసి– నిద్రించిన సూర్యుని శిరస్సు కు లక్కసానను అమర్చి సూర్యునికున్న 9 లక్షల కిరణాలలో 8 లక్షల కిరణాలను తీశాడు. ఆ 8 లక్షల కిరణాలతో లోలా చక్రము తయారు చేశాడు. 32 ఆయుధాలతో మరణం లేనట్లు వరము పొందిన రౌంజకాసురుణ్ణి 8 లక్షల ఆయుధాల కూర్పు లోలా చక్రంతో శిరస్సును ఖండించి తరువాత ఆ చక్రాన్ని ఏడు సముద్రాలలో కడిగాడు. అప్పుడా లోలా చక్రం విష్ణుమూర్తిని చేరి విష్ణు చక్రమయ్యింది. రౌంజకాసురుని తల లేని శరీరం పెద్దపర్వతం వలె నేల పై పడివున్నది. రెండు వరాలు పోయినవి, ఒక్కవరం ఉన్నది.

విష్ణువు వరం ఏడు గడియలు దాటితే మళ్ళీ బతుకుతాడు కనుక ఏడుగడియలు దాటకుండ వాయువు వాహనంలో రౌంజకాసురిని కళేబరంతో పెందోట పురమునకు పోయాడు. కళేబయాన్ని పంచ బ్రహ్మల ముందు పడేసి వీడు రౌంజకాసురుడు త్రిమూర్తుల వరాల్లో రెండు పోయనవి విష్ణుమూర్తి వరం ఏడు గడియలు దాటితే మళ్లీ బతుకుతాడు కనుక ఏడుగడియలు దాటకుండా పెద్ద వాయిద్యంతయారు చెయ్యమన్నాడు.

అప్పుడు ఆ పంచ బ్రహ్మలు సుత్తెలు కార్లు సమ్మెట్లు శ్రావణాలు తీసుకొని రౌంజకాసురుని అవయవాలు ఎక్కడిక్కడ తెగ నరికారు. బాహువులు చేతులు ఇనుప కడియాలు, అతని చర్మమే పై మూతల కున్న చర్మం, అతని పేగులే ఎర్రెర్రగుడ్డ తాళ్ళు. అతని నరాలే నూలుపగ్గాలు, కోరలే నాగవాసాలు. అతని పొట్టే కింద నున్న సిక్కం, అతని ముఖం "సింహం తల చిత్రం" అతని కళేబరం ఇత్తడి డోల్కా. రౌంజకాసురుని అవయవాలు ఒక్కటి పోకుండా రుంజతయారు చేసుకున్నారు.

కిందొక మూత పైనొకమూతతో వున్న రుంజనుతయారు చేసుకొని మల్లెశాలలో పెట్టుకున్నారు. ఎవరు మోగించక ముందే ఓంకార ఝంకార ప్రణవ నాదాలను మోగుతున్నది ఆ రుంజ.

## రుంజ కులావిర్భావం

అతనికి పువ్వువేసి పూజ చేస్తాముకాని వాయిద్యం వాయించడం మా వల్ల కాదని తప్పుకున్నారు దేవతలు. అప్పుడు విశ్వకర్మ అలోచించి గతం తెలిసిన దేవతలు భీతిల్లుతున్నారు ఈ వాయిద్యాన్నీ

సదామోసుకు తింగడానికి గతం తెలియని బాలుడు అవసరమని భావించాడు. (ఎల్లపుడుండుట కొరకు కలి యుగమున వాయించుటకు అని పాడుతారిక్కడ) విభూది పండును తెచ్చి శాంభవి అనగా డాకలి తెచ్చి దానికి నూలుపోగు చుట్టి రుద్రాక్ష కాయను పెట్టి లలాటమునవున్న చెమటను తీసి "ఓం విశ్వానాం విశ్వభూతానాం" అని సంప్రోక్షణ చేశాడట. ఆ విభూతి పండు పగల గొట్టుకొని రుద్రాక్షను మెళ్ళో వేసుకొని రుద్రాంగుని వంటి రుద్రమహేశ్వరుడు రుంజకులస్థుని జననం జరిగింది. అప్పుడు ఆ రుంజ వాయిద్యాన్ని అతని మెడకు వేశాడు విశ్వకర్మ.

అప్పుడా యువకుడు స్వామీ, నన్ను పుట్టించి ఇంత పెద్ద వాయిద్యాన్ని నా మెడకు వేశావు దీనిని నేనేం చెయ్యాలి అని అడిగాడు. త్రిమూర్తులు ఆ వాయిద్యాన్ని వినాలను కుంటున్నారు కనుక రెండు ఘడియలు వాయించమని విశ్వకర్మ ఆదేశంచాడు. అపుడు ఆ యువకుడు "ఇది ద్వాపరయుగం దీనిని వాయిస్తే మీరు సంతోషిస్తారు కాని రాబోయే కలియుగంలో దీన్ని వాయిస్తే ఫలితార్థమేమిటి" అని యువకుడు ప్రశ్నించగా "బిడ్డా నీకు మను మయ త్వష్ట శిల్పి విశ్వజ్ఞ అని ఐదుగురు' కుమారులు రక్త సంతతి వారు. నీవు ఉదక సంభుతునివి కనుక నీవు నాకు ఆరవ కుమారుడివి. వీరయిదుగురి వద్ద దాయికింత ఉపనయనానికింత, పెండ్లికింత, కడపకట్నమింత దక్షణతో పాటు ఎవరయినా చనిపోయిన జన్మించినా గోదానాల వస్త్రదానాలతో నిన్ను సత్కరిస్తారు నిన్ను రక్షిస్తారు కుమారా అని సెలవిచ్చాడు.

అప్పుడు అతడు కింతమూత మీది మూత సరి చేసి సృతి ప్రమాణం చేసి. వాయిద్యాన్ని మొదలు పెట్టాడు. ఆ రుంజ నాదానికి జలనదులు గిరుల కదిలిస్తూ పొంగాయి, నక్షత్రాలు జలజలరాలి కింద పడుతున్నయట, బ్రహ్మ విష్ణు త్రిమూర్తులు ఆటలాడుతున్నారు. జీవరాసుల పిండాలుకదిలి పడ్డయట, ఆరు నెలల పిండాలు సైతం రాలిపోతున్నయట, ప్రపంచమంతా అల్లకల్లోలమై పోతున్నదట. అప్పుడు దేవతలంతా కలిసి "ఓ దేవా! విశ్వకర్మ విరాట్ పురుష వాయిద్యం లేదంటే మహా గొప్ప వాయిద్యం చేశావు ఇంత గొప్ప ధ్వనిని దేవతలయినందున భరించ గలుగుతున్నాము. రాబోయే కలియుగంలో మానవులు భరించలేరు.సగం ధ్వని తగ్గించ వలసింది" అని వేడుకున్నారట. దానితో కింద ప్రక్క మూతతీసేశాడు.

పై ఒక్క మూతనందే 32 వాయిద్యాలు సప్తతాళాలు ఎంత మోగించినా సభాస్థలి ఊరి పొలిమేర దాటి వినపడకూడదని అప్పుడు నియంత్రణ వాక్కు పలికాడట. అప్పడి నుండి రౌంజవాళ్ళు రుంజ వాళ్ళుగా విశ్వబ్రహ్మలను యాచిస్తూ విశ్వబ్రహ్మలపై ఆధారపడిన విశ్వబ్రాహ్మణ ఉపకులంగా ప్రచారంలో ఉన్నది. విశ్వబ్రహ్మణ సన్నిధిలో, వారిని మాత్రమే అనుసరించి జీవించే వాళ్ళు. ఈ కథ మూల స్తంభపురాణంలో ప్రథమాశ్వాసంలోనిది.

రుంజ వాయిద్యంపై పంచబ్రహ్మల జననం, దక్షయజ్ఞం, విశ్వకర్మపరమేశ్వరుని కళ్యాణం (పార్వతి కళ్యాణం) 32 రకాల శబ్దాలు పుల్లలతో (బాండు, డప్పు, తీన్‌మార్ వంటివి) చేతులతో వాయించేవి రాగం తాళం పల్లవి (ఏడుతాళాలు) సప్తరాగాలు ఏడు తాళాలు1) ధృవాను 2) మటిమ 3) రూపగంచ 4)గంపాత్రిపుట 5) ఆటతాళం 6) సప్తతాళం వాయిస్తామని చెప్తారు అంగలకుర్తి రామ్మూర్తి అనే వృద్ధ రుంజ కళాకారుడు.

రుంజ కులస్తులు నల్గొండ, ఖమ్మం, వరంగలు, మహబూబ్‌నగర్ జిల్లాల్లో అతితక్కువ సంఖ్యలో ఉన్నారు. రుంజ వాళ్ళు ఖమ్మం జిల్లా ఇల్లెందు దగ్గర కొన్ని కుటుంబాలు, వైరాలో కొన్ని కుటుంబాలు కల్లెపల్లి ఇంటి పేరు ఉన్న వారు పూబెల్లిలో వున్నారు రామ్మూర్తి వాళ్ళ బాబాయి అందరు వాయిలుకొల్లులో ఏడు కుటుంబాలు మహబూబ్ నగర్ జిల్లా బూపతిపేటలో ఖమ్మం జిల్లాలో ముదిగొండలో రెండు కుటుంబాలున్నాయి. రుంజ కులం వారు వృత్తులు మార్చుకోని 30-50 కుటుంబాలు, 150-200 మంది ఉన్నట్లు అంచనా. కందుకూరి, అంగులూరి, అంగలకుర్తి అనే ఇంటిపేర్లతో ఉన్నారు.

గతంలో వీరికి విశ్వబ్రహ్మలకు కంచం పొత్తు మాత్రమే వుండేది. ఇప్పుడు వియ్యం కూడా ఉన్నట్టు తెలుస్తుంది. వీరిది రుద్రమహర్షి గోత్రం అయితే సువర్ణన గోత్రమని చెప్పుకుంటారు. యాచకులంటారని భయపడ్డవాళ్ళు వృత్తులు నేర్చుకున్నారు. చేతివృత్తులు, వడ్రంగం, వ్యవసాయ కూలీలుగా కొందరున్నారు. అతి కొద్దిమంది చదువుకున్నారు. వెల్డింగ్ షాపుల వంటివి నడుపుకుంటున్నారు. వరంగల్‌లో ఒక టీచర్-వరంగల్ జిల్లా మహబూబ్‌నగర్‌లో ఒక ఉద్యోగి ఉన్నట్టు సమాచారం, రుంజ కళను బతికస్తున్నవారు కటిక దరిద్రాన్ని అనుభవిస్తున్నారు. వీరికి కుల సర్టిఫికెట్టుండదు, రేషన్ కార్డుండదు, ప్రభుత్వం దృష్టిలో వీరులేరు. కనుక రుంజ వాళ్ళందరినీ ఒక కాలనీ లాగా ఏర్పాటుచేసి రక్షించ వలసి ఉన్నది. వరంగల్ జిల్లా గోవిందరావు పేటలో పర్వతం ఇంటి పేరున ఒకట్రెండు కుటుంబాలున్నట్టు వినికిడి. రుంజను నమ్మి జీవిస్తున్నది నాలుగు కుటుంబాలు మాత్రమే అన్నది అక్షర సత్యం రౌంజకాసురుని గురించి వేరేపురాణలలో వుందో లేదో తెలియదు. రామ్మూర్తి చెప్పిన దాన్నిబట్టి బాబాయి చిన్న నాయినలు ఐదుగురు అన్నదమ్ములు రాష్ట్రం దాటి వెళ్ళలేదు, తెలుగురాష్ట్రాల్లోనే ఉన్నారు. విశ్వబ్రహ్మణ పద్ధతులే వీరివి కూడా. తాతల కాలంలో శాకాహారులుగా వుండేవారు, తరువాత మాంసాహారులుగా మారారు. వారి తండ్రి గారి వరకు నిష్టగా పీఠం పెట్టి పూజ చేసి ధ్యానం చేసిన తరువాత భోజనం చేసేవారు.

వీరికి ఇళ్ళులేవు. సంచార జీవులుగానే వుండేవారు. ఎడ్ల బండ్ల మీద తిరిగేవారు, ఎడ్లు పశువులుండేవి. ఒక ఊరికి చేరిన తరువాత విశ్వబ్రహ్మలందర్నీ కూచ్చోబెట్టి దాయికింత నిర్ణయించిన తరువాత మను, బ్రహ్మ, విశ్వజ్ఞ అనే మూడుదాయిల అంటె ఒక్కోక్కదాయికి ఐదు రూపాయలు ఐదుసేర్లు బియ్యం యిచ్చేవారు. ఉపనయనం, పెళ్ళి, బాలసారె (బారసాల) విశ్వబ్రహ్మల ఏ కార్యమయినా 'రుంజ' వాయిద్యంతో మొదలయితాయి.

రుంజ వారు శైవ భక్తులు, పోతులూరి వీరబ్రహ్మంగారి చరిత్ర చెప్తారు. వీరి గురించి పరిశోధన చేసినవారు లేరు. 18 జాతులు ఏ విధంగా పుట్టినవి కులాలు మాతాలు ఏ విధంగా ఏర్పడినవి అనేది వాయిద్యం మీద చెస్తారు. రుంజ మూలస్తంభ పురాణంలో ఉన్నదే. ఆస్తులులేవు స్నానం సూర్యనమస్కారం యజ్ఞోపవీతం గాయత్రి యివన్నీ మామూలే. ప్రొ.పులికొండ సుబ్బాచారి 'రుంజ నాదం' అనే పుస్తకం రాశారు, 2010లో రుంజ పేరుతో విశ్వకర్మ కవులుకళాకారుల వేదిక ఏర్పాటుచేయబడింది. రుంజ పేరుతో కవితా సంపుటి తెచ్చారు జ్వలిత. ❋

## అనువాదాలు-అత్యవసరాలు

'అనువాదాలు అత్యవసరాలు' (అమ్మనుడి మార్చి సంచిక -పుట 22) అనే వ్యాసం చూశాను. అందులో రెండో పేరాలోని మొదటి వాక్యం ఇలా వుంది. 'తెలుగు సాహిత్యం అనువాదాలతోనే ప్రారంభమయింది'. ఈ అభిప్రాయం తప్పు. 'మహాభారత ఆంధ్రీకరణం' అనువాదం కాదు, అనుసృజన. తెలిసో, తెలియకో కొందరు చేసిన ప్రచారం వల్ల తప్పుడు అభిప్రాయం ప్రచారం అయింది. ఇది కొనసాగడం మంచిది కాదు.

–పోరంకి దక్షిణామూర్తి, హైదరాబాదు, ఫోన్ : 040–24146205

# పోటీ పరీక్షలలో తెలుగు వద్దా? - ద్వా.నా.శాస్త్రి

ఉభయ తెలుగు రాష్ట్రాలలో తెలుగు కనుమరుగైపోతోంది ఏ తెలుగు అన్నది అప్రస్తుతం. తెలంగాణ తెలుగైనా, ఆంధ్రా తెలుగైనా తెలుగే.

తెలుగు ఉనికినే ప్రమాదం వాటిల్లుతున్నప్పుడు ఈ విభేదాలను కొండంత చేస్తే నష్టపోయేది తెలుగేకదా? ఇరు రాష్ట్రాలు కలిసి తెలుగు వెలుగుకోసం ప్రయత్నించాలి. అందుకు మనం ఏం చెయ్యాలన్న ఆలోచన ముఖ్యం. మొదటగా పోటీపరీక్షలలో తెలుగు భాషా సాహిత్యాలపై వంద మార్కులకి తప్పనిసరి (కంపల్సరీ) ప్రశ్నపత్రం ఉండాలి. తమిళనాడు, కర్ణాటక, ఒడిశా వంటి రాష్ట్రాలలో మాతృభాషపై ఒక ప్రశ్న పత్రం ప్రభుత్వ ఉద్యోగాలకు తప్పనిసరిగా వుంది. అందులో అర్హత సాధిస్తేనే ప్రభుత్వ ఉద్యోగం వస్తుంది. లేకపోతే ఎన్ని మార్కులువచ్చినా అందులో అర్హత సంపాదించేంతవరకు ఉద్యోగం 'పెండింగ్'లో వుంటుంది. మన తెలుగు రాష్ట్రాలలో తెలుగు రాకపోయినా ప్రభుత్వ ఉద్యోగం వచ్చేస్తుంది. ఆంగ్లంవస్తేచాలు! ఎంత దారుణం! పోటీపరీక్షలైన గ్రూప్-1, గ్రూప్-2లలో పూర్వం తెలుగు భాషా సాహిత్యాలు ఒక "ఆప్షనల్"గా ఉండేది. అప్పుడు చాలామంది తెలుగు తీసుకొని ఉద్యోగాలు సంపాదించారు. ఆ తర్వాత సైన్స్ విద్యార్థులు వెనుకబడుతున్నారన్న సాకుతో ఆప్షనల్ పద్ధతిని రద్దుచేశారు. దీంతో పోటీపరీక్షలలో అప్పటివరకు వెలిగిన తెలుగుదీపం ఆరిపోయింది. గ్రూప్-1,గ్రూప్-2 పరీక్షలలో తెలుగు భాషా సాహిత్యానికి "ఆటలో అరటిపండు"లాగా అయిదారు మార్కులకి వుంది. తెలంగాణ ప్రభుత్వం కూడా గ్రూప్-1, గ్రూప్-2లలో తెలుగుకి ప్రాధాన్యత ఇవ్వకపోవటం అన్యాయం తెలంగాణ సాహిత్యానికి పెద్దపీట లేదు సరికదా అయిదారు మార్కులకి తెలుగు నిర్ణయించి చేతులు దులిపేసుకొన్నారు. అసలు తెలంగాణ రాష్ట్రం ఏర్పడటంలో కవులు, రచయితల పాత్ర మరువలేనిది. తెలంగాణ ఏర్పడితే మరుగునపడ్డ సాహిత్యం వెలుగులోకి వస్తుందన్న ఆశపై నీరు చల్లారు.

సాంకేతిక అభివృద్ధి వల్ల తెలుగు రాసే అలవాటు బాగా తగ్గిపోయింది. స్మార్ట్‌లూ ఆండ్రాయిడ్లూ, లాప్‌టాప్‌లూ వగైరాలు తెలుగును వెనక్కి 'నెట్టే'శాయి. "నాకు తెలుగు రాయటం రాదు" అనే కొత్త తరాన్ని గమనిస్తున్నాం. ఆంగ్ల మాధ్యమానికి ఈ సాంకేతిక పరిజ్ఞానం తోడై తెలుగు అప్రాధాన్యానికి తగ్గిపోవటం చూస్తున్నాం. తెలుగు పండితులు, తెలుగు అధ్యాపకులు వంటి పోటీ పరీక్షలలో కూడా "ప్రశ్న... సమాధాన" రూపపద్ధతి లేదు. "అబ్జెక్టివ్" పద్ధతి వచ్చింది. దీనివల్ల తెలుగు రాయనక్కర్లేకుండానే తెలుగు అధ్యాపకుడు, ఉపాధ్యాయుడు కావచ్చు. ఇదీ నేటి దారుణమైన స్థితి. ఉదాహరణకి-

పోతన భాగవతంలో లేనిది-

1. రుక్మిణీ కల్యాణం 2. వామన చరిత్ర 3. శకుంతలోపాఖ్యానం 4. ఏదీ కాదు ( )

ఇందులో సరైన సమాధానం అంకెల రూపంలో గుర్తించడమే తప్ప రాయనక్కరలేదు. అందుకని 'రుక్మిణి' 'కల్యాణం' 'ఉపాఖ్యానం' అనేవి ఎలా రాయాలో తెలీదు. ఇక్కడ 'లిపి' ముఖ్యం కాదు. ఒకవేళ ప్రశ్న పత్రంలో తప్పుగా రాసినా అభ్యర్థికి అనవసరం. ఆ అంకె రాస్తే చాలు. ఇదీ భయంకరమైన సంగతి. కొన్ని ప్రశ్నలు వ్యాస రూపంగా, మరికొన్ని 'అబ్జెక్టివ్'గా ఇవ్వవచ్చు. అసలు భాషాభిమానం అంటూ ఉండేనే గదా ఏ ఆలోచన అయినా రావటానికి! కొత్త పద్ధతిలో మూల్యాంకనం (వాల్యుయేషన్) తేలిక కాబట్టి అమలుచేస్తున్నామంటారు- తెలుగు భాష ఏమైపోయినా పట్టించుకోని యంత్రాంగం మనది. జాతీయ స్థాయిలో యు.పి.పి.ఎస్. నిర్వహించే సివిల్స్ పరీక్షలో (ఐ.ఎ.ఎస్. ఐ.పి.ఎస్ వంటివి) మాతృభాషను తప్పనిసరి చేశారు. అందులో అర్హత మార్కులు సంపాదిస్తేనే ఉద్యోగం వస్తుంది. తెలుగు మాతృభాషగా గల మన రాష్ట్రాలలో తెలుగు తప్పనిసరి కానే కాదు. తెలుగు మాతృభాషగా గల మన రాష్ట్రాలలో తెలుగు చదవటం, రాయటం రాకున్నా ప్రభుత్వ ఉద్యోగం వచ్చేస్తుంది. తమిళనాడు, కర్ణాటక, మహారాష్ట్ర వంటి రాష్ట్రాలలో మాతృభాష తప్పనిసరి! ఎన్ని రాష్ట్రాలు ఏర్పడినా, ఎంత హేమాహేమీలు ముఖ్యమంత్రులైనా, ఎన్ని బడ్జెట్లు వచ్చినా మాతృభాషను నిర్లక్ష్యం చేయడం పాలకులకు అలవాటయిపోయింది.

# అమ్మనుడి మార్చి 2016– 'తెలుగునుడి కోసం' చర్చ.

అమ్మనుడి లోని తెలుగునుడి చర్చ చాలా మంచి శీర్షిక. ఈ మన నుడి వాదును మొదలుపెట్టిన మీకు ముందుగా నా మెచ్చుకోలు. తెలుగు రాత–పద రూపాల సంగతి అవసరమైతే ముందు ముందు చూద్దాం. ఇప్పుడు ఈ పత్రికలో మీరు చూపిన మన తెలుగు అక్షరాల పద విశేషాల పరామర్శ మాత్రమే కావిస్తున్న. మితంగా హితంగా తెలుగు అక్షరాలు 36 అని మీరు చూపిన వాటిలో అచ్చులు 13 ఇవి.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఏ ఏ ఐ ఒ ఓ ఔ ం

చివరి సున్న అచ్చు కాదు. అచ్చుల హల్లుల లక్షణాలు కల ఉభయాక్షరం. ఉభయాక్షరాలు మూడు. ం ఁ ః, చివరిది సంస్కృతం నుంచి వచ్చింది. సున్న, అరసున్న మనవే. అరసున్నకు ధ్వనిలేదు. ఇప్పుడు గ్రాంథిక భాషలోని కొన్ని పదాలకు ఇప్పుడు సున్న లేక ఒకప్పుడు సున్నా ఉండే పదాలకు వాడు –వాండు /వాఁడు అని అరసున్న వాడే వాళ్ళు. ఇంకా ద్రుతాంత (న్ అంతముందున్న పదాలకు కూడా వాడుక ఉంది. అమ్మ చూచె, అమ్మఁజూచె అర్థభేదం గుర్తించవచ్చు. హిందీలోని माँ కు వలె, తెలుగులోని తిర్థాను స్వారానికి ధ్వని ఉంటే బాగుండేది. అప్పుడు మాఁవ, కౌఁసల్య వంటి పదాలను ముక్కు ధ్వని కలిపి చక్కగా పలికేవాళ్ళం.

ఇక అచ్చుల్లోని ఐ, ఔ లు అత్యవసరం కావు. పద్యకవుల ఛందస్సు విషయం వేరు. వాటిని అయి అవు అని రాయవచ్చు. రాస్తున్నం. సంస్కృతం, హిందీ భాషల్లోనయితే ఏ ఐ ఓ ఔ లే ఉన్నవి. ఎ ఒ పొట్టి అక్షరాలు లేవు.

హల్లులు, క నుంచి హ వరకు సరి.

సంస్కృతం నుంచి వచ్చిన అక్షరాలు 19 అన్నరు. అవి ఇవి–

ఋ ౠ ఌ ౡ ఖ ఘ ఛ ఝ ఠ ఢ థ ధ ఫ భ శ ష క్ష ౄ ః

వీటిలో మొదటి 4 అచ్చులు. చివరి విసర్గ ఉభయాక్షరం. చివరి నుంచి రెండవది 'ౄ' అక్షరం కాదు. ఆది ఋత్వం–గుణిత రూపం. ఌౡల వాడకం లేదు. సంస్కృతం మంత్రాల్లో ఉందిట. క్లుప్తము, క్లప్తం అని రాయాలట. ఋ ౠ లను రు రూలుగనే రాస్తూ పలుకుతున్నరు. కాబట్టి ఈ 4 అచ్చులు తొలగించుకోవచ్చు. ఋత్వాది క్రావడితో సరిపుచ్చుకోవచ్చు.

క్ష ఒక అక్షరం కాదు. అది క, ష రెండక్షరాల సంయుక్త రూపం. కానీ రిక్షాలోని కషల ధ్వనితోపాటు క్షలో చకార ధ్వని అదనంగా ఉంటుందనేది మనం గమనింపవచ్చు. ఉదాహరణకు రక్షకుడు, రాక్షసుడు.

చ జ లకు పలుకుబడిలో రెండేసి రూపాలు గుర్తించిన్రు, మన వ్యాకరణవేత్తలు. చ చ..జ జ ట్చ త్చ దగ్గర ధ్వనులు. మన చీమ, వచ్చు–గుంజ, జల్లెడ పదాలలో వాటిని గమనింపవచ్చు.

ం సున్నకు కూడా నకార మకార రెండు ధ్వనులున్నవి. కంచము (న్చ), సంబరము (మ్బ). వీటిని తప్పుగా పలుకుతున్నరు మన యాంకర్లు. సంస్కృతం Sanskrit తప్పే. ఇక సంసుక్రుతం మన పత్రిక ప్రయోగమే.

రచయితల అభిప్రాయాలను పత్రిక ప్రచురిస్తున్నది. సంపాదక హృదయం తప్ప తక్కిన రచనలన్నిటినీ రచయితల అభిప్రాయంగానే తీసుకోవాలి. –సం.

ఒత్తు అక్షరాలు (ఖ, ఛ..) సంస్కృత పదాల్లోనే ఉంటాయి.

అవి లేని సంస్కృత పదాలు అనేకం– జయం, అన్నం, దీపం, మాత, దేవి...ఎట్లా తెలువాలె? అంటే–కష్టపడి గుర్తుంచుకోవాలి.

తెలుగులో ఒత్తక్షరాలను తొలగించాలనే వాదన ఉంది. తమి ళంలో అవి లేవు. పైగా గజడదబలు లేవు. పదాది కచటతపలే పదాల నడుమ గజడదబలుగా పలుకుతున్నరు. బాల, పాల, గాంధి/కాంతి –కాంతి, మతం– మదం.. ఇట్లనే వాళ్ళ మాటల తీరు.

భార్య, భయం, బాధ, ధర్మం అనే పదాల ఒత్తులు పోతే బాధ లేదు. కానీ ఖరం–కరం, కళ –కల అంటే అర్థభేదం వస్తుంది. అప్పుడు దుఃఖం దుక్కం అని రాస్తారు. లెక్కను లెఖ్ఖ అని రాసుడు వింతే మరి. మంచిని మంఛి, బంగారంను భంగారం, నకోను నఖ్కో (హిందీ) అన్నట్లే ఇది.

శ ష లు సంస్కృతం. స ఒక్కటే తెలుగుది. ద్రవిడ భాషల్లోనే కాక ప్రాకృతంలోనూ అది ఉంది. స–మనది కాబట్టి కాబోలు, శ్మశానంను స్మశానం అంటున్నారు మన వాళ్ళు. శేషసాయి శబ్దో చ్చారణ ఎంత కష్టమో స sa, ష sha సరే, శను ఎట్లా రాయాలె ఆంగ్లంలో. కొందరు sa, కొందరు sha అని రాస్తున్నరు. sri, shree రెండూ ఒప్పులే. అందుకేనేమో విశ్వామిత్ర, అశోక పదాలను విస్వామిత్ర, అసోక అంటున్నరు సీమాంధ్రులు. ఆంగ్ల ప్రభావం! ఈ శ శబ్ద రూపాలైన పేర్లను రమేష్, గణేష్ అని రాస్తున్నరు. మన సినిమాల పేర్లు చూడండి. నిజానికి శ ను స–ష రెండు అక్షరాల మధ్య ధ్వనిలో పలకాలి. ఈ బాధంతా తప్పన్నంటే మనం సషల ఉంచుకొని శ ను విడిచి పెడితే సరి. ళ, ఱలు సంస్కృతంలో లేవు. అవి అచ్చంగా మన ద్రవిడ భాషలవే. తమిళంలో మరో వింత అక్షరముంది. .....ధ్వని. పళంలో వాడతరు.

సంస్కృతం, ఇంగ్లీషు, ఉర్దూ, కన్నడ, తమిళ, ఒరియా, మరాఠీ పదాలు మన తెలుగులో కల్సి, చాలా తెలుగు పదాలు మాయమైనవి. ఎంతో పొడవైన సముద్రతీరమున్న మనకు సముద్రానికి ఉన్న పదం ఒక్కటే. కడలి. ఇక, నీటికి సంస్కృతంలో కం, అంబువు, అప్, నీరము, వనము, జలము, ఉదకము, పయస్సు ఇన్ని పేర్లుండగా తెలుగులో ఉన్నది ఒక్కటే మాట– లాల! నీరు(నీరులు, నీళ్ళు) నీరము నుంచే వచ్చి ఉండవచ్చు. ఇటుదే అటు వెళ్ళిందో–తన్నీర్!

తెలుగుభాషా స్వరూపాన్ని కాపాడుకోవన్నంటే, ఇతర భాషల మాటల అదీ ముఖ్యంగా సంస్కృతాంధ్ర భాషల పదాల వదలి మన తెలుగు నుడుల వాడుకోవలె. కానీ, అన్నం అనుటకు బదులుగా కూడు, బువ్వ, ఓగిరం అనగలరా మనవాళ్ళు. అనాగరికం అను కోరూ! భార్యకు పెండ్లాము సరే. గృహిణికి ఇంటిది (ఇల్లాలు)మాట ఉంది. వాడరే మనవాళ్ళు.

ఏ భాష కానీ అభివృద్ధి చెందేది ఇతర భాషల కలయికతోటే. పరభాషల పదాల విడిచిపెడితే మన భాష సొంత రూపు నిలిచినా, పెంపొందదు. అయితే సాంకేతిక పదాల రూపకల్పనలో మన తెలుగు పదాలు ఎక్కువగా వాడవచ్చు. జీవశాస్త్రంలో అకశేరుకాలు,

సకశేరుకాల కంటే వెన్నెముక కల ప్రాణులు, వెన్నెముక లేని జీవులు అంటే అందం సరళం కదా, అట్లాగే గణితం లోని (సంగీతంలో కూడా) ఆరోహణ అవరోహణ అనే పదాలను పైకి-కిందికి-ఎగుడు-దిగుడు, ఎక్కు దిగు విధానం అని చక్కగా వాడుకోవచ్చు.

అయితే మనవాళ్ళకు నాగరిక చాదస్తం జాస్తి. అర్థం తెలువ కున్నా అనుకరించి తప్పుగానైనా సంస్కృత పదాలు వాడుతరు. ఇప్పుడు ఆంగ్ల భాషావ్యామోహం అధికమైంది. భాష రాకున్నా పదాలు మాత్రం వాడుతున్నారు.

ఇంతకూ ఈ చర్చంతా మనది- విద్యావంతులదే. జానపదులు కదా మన భాషా సంస్కృతుల సంరక్షకులు. దిశానిర్దేశకులు. వాళ్ళూ మారుతున్నరు.

ముఖ్యంగా మనం విద్యావంతులం. మన మాతృభాషను కాపాడుకొని చక్కని రూపంతో పెంపొందించుకోవాలి. అందుకు మన తెలుగు అక్షరాలు తగ్గించుకోవచ్చు. పెంచుకోవచ్చు. ముఖ్యంగా పరభాషల వ్యామోహాన్ని, ప్రభావాన్ని వదులుకుంటే మన భాషకు సుస్థితి, ఉన్నతి సాధ్యం.

**-డా॥మలయశ్రీ,** కరీంనగర్, 98665 46220

## తెలుగును ప్రేమించు

భాష ఎంత గొప్పదైనా వాడుక లేనిచో అది నశించి పోతుంది. నిరంతరమూ అది వాడుకలో ఉండాలంటే దాని అవసరం ప్రజలకుండాలి. అంటే సాధారణ జీవనవిధానం నుండి అన్ని రంగాల్లోనూ ప్రతిక్షణం అది కదుల్తుండాలి. అప్పుడే అది బ్రతికుంటుంది. అలా కావాలంటే పాఠశాల స్థాయి నుండి, ప్రభుత్వ పరిపాలన వరకు, వ్యాపార, వ్యవహార, వగైరా అన్ని కార్యక్రమాల్లోనూ అది సున్నితంగా తేలుతుండాలి.

తెలుగు కానీ, ఏదైనా స్థానిక భాష గానీ జీవించి ఉండాలంటే దానికి ప్రభుత్వ, రాజకీయ నాయకుల అండ, ప్రోత్సాహం చాలా అవసరం.

వారికి మాతృభాష యెడల ఆసక్తి లేనే లేదు. విధి లేక ప్రభుత్వం పాఠశాలలను నడుపుతుంది. కానీ శ్రద్ధతో మాత్రం కాదు. పాలకులకు లేదా రాజకీయ నేతలకు అధికారం, డబ్బు మీద తప్ప వారికి దేనిమీదా దృష్టి లేదు. కాబట్టి అన్నిరంగాలూ నత్తనడకనే సాగుతున్నాయి.

రాజ్యాన్ని పాలించే రాజకీయ నాయకుల అండ లేనిదే ఏ మాతృభాషా నిలదొక్కుకొని బ్రతకలేదు.

ఏ కొన్ని పత్రికలు తెలుగుభాష పునర్జీవం గురించి వ్రాసినా అడుగు నుండి మీది వరకు ప్రాకులాట కష్టము.

పైగా మాతృభాష అయిన తెలుగు గురించి ప్రభుత్వం బైటికి భేషుగ్గా మాట్లాడినా ప్రభుత్వ కార్యక్రమాలన్నీ ఇంగ్లీషు భాషలోనే నడిపిస్తున్నది.

ప్రభుత్వ విద్యాసంస్థలకు ప్రాధాన్యతనిచ్చి ప్రోత్సహిసే, మాతృభాష అయిన తెలుగును బోధనా మాధ్యమంగా చేస్తే పాలన తెలుగులో నడిపితే మాతృభాష బ్రతుకుతుంది.

కానీ కార్పొరేట్ విద్యాసంస్థలు, అన్నీ డబ్బున్నవారి చేతిలో ఉండుటయేగాక అధికారయుతంగా ఆయా శాఖలకు వారే మంత్రులై ఉంటే ఇంకేం చెప్పగలం? అవన్నీ ఇంగ్లీషు మాధ్యమంలోనే నడుపుతున్నారు. ఇంగ్లీషును ప్రోత్సహిస్తున్నారు.

**-బందలుప్పి జగన్మోహనరావు,**
ప్రభుత్వ విశ్రాంత ఉపాధ్యాయులు,
విజయనగరం, 94927 36410

## క్షమయా ధరిత్రి...

పచ్చదనమే ప్రాణాధారంగా
జీవకోటిని బ్రతికించే అమ్మ..ధరిత్రి..
సహనానికీ, సహజీవనానికి కర్తవ్య దీక్షకూ, దక్షతకూ ప్రతీక
నిన్నటి "పచ్చదనం, పరిశుభ్రత, ప్రగతిబాట" నానుడి
నేటి "పట్టణమూ పరిశ్రమ, ప్రగతిపథం"
నినాదానికి తలొగ్గి దారి ఇచ్చినా
ఆకాశ హర్మ్యాల వేటలో అభివృద్ధి పేరుతో
అనాలోచిత ఆక్రమణకు, తన ఆకుపచ్చదనం కరిగి పోతున్నా
'అమ్మ ధరిత్రి' మాత్రం నిరపేక్షగా, నిబద్ధతగా
తన పనిని నిశ్శబ్దంగా చేసుకొని పోతూనే వుంది.
మానవాళికి జవజీవాలు అందిస్తూనే వుంది
ఆధునిక నాగరికత మోసుకొచ్చిన జీవనశైలిలో
అనాదరణకు గురి అవుతూనే వున్నా
తన సంతాన సౌభాగ్యమే తన సర్వస్వంగా
'అమ్మ' పాటు పడుతూనే వుంది
'అమ్మ'కూ, 'ధరిత్రి'కీ ఎంత సారూప్యత..!
గోరుముద్దలతో గారాము చేసినా
అల్లరి హద్దులు దాటితే, దండించి దారినపెట్టే అమ్మలా
తన ప్రాణమూ సర్వస్వమూ అయిన హరితం
బలి అయినప్పుడు
ఆక్రమణ అవధులు దాటుతున్నప్పుడు
తల్లడిల్లిన అమ్మ ధరిత్రి గుండె ఉచ్ఛ్వాస నిశ్వాసాలే
ఆమె ప్రకోపం..ప్రకంపనలు
కనువిప్పుగా ఝుళిపించే 'దండన'మే
'కత్రినా'లూ కడుపుకోతలూ
'హుద్‌హుద్'లూ, హృదయవేదనలూ
క్షమకూ, సహనానికీ ప్రతిరూపమే అయినా
అమ్మ ధరిత్రి నిక్కచ్చిగా అమలు చేసే
సమతుల్యపు త్రాసు మాత్రం
తన పనిని నిర్మొహమాటంగా చేసుకుపోతూనే వుంటుంది
ఈ ధరిత్రీ దినోత్సవ ప్రతిన పూనుదాం
అమ్మ ధరిత్రిని సంరక్షించుకుందామని..
సమతుల్యాన్ని కాపాడుకుందామని..
పచ్చదనమూ పాడి పంటల సమృద్ధితో జీవిద్దామని
నిజమయిన ప్రగతిపథంలో పయనిద్దామని
ప్రకృతితో సహజీవన పాఠాన్ని పునఃశ్చరణ చేసుకుందాం!
అమ్మకూ, అమ్మ ధరిత్రికీ తలవంచుకొని నమస్కరిద్దాం!

**-జంజనం ఈశ్వరబాబు,** 96180 29508

## వేమన వేదవాణి




సమాజాన్ని సన్మార్గంలో నడపటానికి యోగులు అవతరిస్తుంటారు. వీరి బోధనలు ఆలోచన రేకెత్తించేవిగా వుంటాయి. అవి కొన్ని శతాబ్దాలు గడచినా ప్రయోజనకరంగానే వుంటాయి. ప్రస్తుతం దొంగబాబాలు దర్శనమిస్తున్నారు. వేమన ఒక యోగిగా జీవించి జీవిత సత్యాలను హృదయాన్ని హత్తుకునేటట్లు మన ముందు వుంచారు.

ప్రస్తుతం మన సమాజం ఎదుర్కొనే సమస్య ఒకటుంది. యువతను ప్రభావితం చేసేవారే లేరు. 'గురువు' పదానికి అర్థమే మారిపోయింది. యువతను సన్మార్గంలో పెట్టే గురువులు కరువయ్యారు. వేమన మాటల్లో (పుట 4), గురుని శిక్ష లేక గురు తెట్లు కలుగునో/ అజునికైన వాని యబ్బకైన/ తాళపు చెవిలేక తలుపెట్టు యూడునో

మంచివారితో స్నేహం వ్యక్తి వికాసానికి తోడ్పడుతుంది. అయితే వాస్తవంగా మంచి ప్రభావం కంటే చెడు ప్రభావమే బలంగా వుంటుంది. వేమన ఇలా అంటారు (పుట :122), తుమ్మచెట్లు ముండ్లు తోడనే పుట్టును/ విత్తులోన నుండి వెడలునట్లు/ మూర్ఖునకును బుద్ధి ముందుగానే బుట్టు.

వేమన రచనల ప్రభావం అన్ని వయసుల వారిపైన తరతరాలు వుంటుంది. వేమన గురించి వీరబ్రహ్మేంద్ర స్వామివారు ఇలా అంటారు. (పుట : 132). చిక్కు విప్పి కటిక చీకటి పోగొట్టి/టక్కునిక్కు తెలిపి నిక్కమైన/వెలుగు చూపు యోగి వేమన్న మాయన్న/ కాళికాంబ! హంస! కాళికాంబ.

ప్రస్తుతం వివాహేతర సంబంధాలు హత్యలకు దారితీస్తున్నాయి. వీటిని తీవ్రంగా పరిగణించాలి. వీటిపై వేమన ఇలా అంటారు (పుట : 152) ఇంటియాలి విడిచి ఇల జారకాంతల/వెంట తిరుగువాడు వెర్రివాడు పంట/చేను విడిచి పరిగి ఏరిన యట్లు.

ఈ గ్రంథంలో 280కి పైగా పద్యాలు ఉన్నాయి. ఇవి మానవాళి మనుగడకు ఉపయోగపడతాయి. ఆచరణ యోగ్యమైనవి కూడా.

రచయిత శ్రీ చిర్రావూరి సుబ్బయాచారి. 1929 సెప్టెంబరు 16న జన్మించారు. ఈ వయస్సులో కూడా పుస్తకాలు వ్రాసి ప్రచురిస్తున్నారు.

శ్రీ వేమన యోగీంద్ర స్వాముల వారి వేదవాణి. పుటలు : 77+223, వెల రు.150/-లు. ప్రతులకు : రచయిత, 699, ఇందిరాకాలనీ, 5వ లైను, సంగడిగుంట, గుంటూరు-522 003.

## ఎందుకీ ప్రగతి? (వచన కవితలు)




ప్రతి దేశం అభివృద్ధిని సాధించాలి. అయితే ఒక సమస్యను పరిష్కరిస్తే,మరొక సమస్య వచ్చిపడుతున్నది. దీనిని అసలైన ప్రగతి అనగలమా? ఈ పరిస్థితిని రచయిత రెండు పంక్తులలో ఇలా వివరించారు. (పుట : 4) ఇల్లు పాడుబడ్డ, పాతబడ్డ/దోమల నివారణాయుధాల మ్యూజియమైంది. వేరొకచోట (పుట : 13) రచయిత అంటారు-సెల్‌ఫోను తరంగాలకు బిక్కసచ్చిన పక్షులన్నీ/పూలూ ఆకులు లేని చెట్లమీద సంతాప సమావేశాలు పెడ్తున్నవి. మనం కాస్త ఆలోచిస్తే ఎదురయ్యే సమస్యలను తప్పించుకోవచ్చు. లేక తేలికగా పరిష్కరించుకోవచ్చు. ఈ విషయంలో రచయిత ఒక చురక వేశారు (పుట : 15). నరకానికి గొయ్యి తవ్వకుంటావెందుకురా! ప్రక్కనే స్వర్గానికి నిచ్చెన ఉన్నప్పుడు!

ముందుచూపు లేకుండా ప్రవర్తిస్తే భవిష్యత్తులో పరిష్కారం లేని ప్రమాదాలను ఎదుర్కోవాలి. జబ్బుకు ముందు వెదకటం కంటే అసలు జబ్బే రాకుండా చూసుకోవటం మంచిది కదా. రచయిత వైద్యుడుగా ఇచ్చిన సలహా ఇదే!

వృత్తి రీత్యా వైద్యుడయిన రచయిత ఇప్పటి వరకు 60కి పైగా గ్రంథాలు రచించారు.

మరణ శాసనం : దీర్ఘకావ్యం, డా॥లంకా శివరామప్రసాద్, పుటలు : 60, వెల : రు.100/-లు, ప్రతులకు : రచయిత, సృజనలోకం, ప్రశాంతి హాస్పిటల్, శివనగర్, వరంగల్-506 002, చరవాణి - 88978 49442.

-డా॥ఇమ్మానేని సత్యసుందరం

అమ్మనుడిపై నెనరు లేనివాడు
కన్నతల్లినీ, పుట్టిన నేలనీ ప్రేమించలేడు..

సృజనకు విత్తు సొంతభాష... రచనకు సత్తువ ప్రజల భాష

కవిత

# తరంగాల్లో చిక్కుకున్న సూర్యకిరణాలు

వేడి సెగల్లో కాలుతున్న నేల
సూర్యునివైపు చూడలేక
ఆ పడతి తలదించి నడుస్తుంది
ఆ తోటమాలి ఆ సన్నజాజులను
ఎండల్లో పూయిస్తున్నాడు
తడారకుండా నీళ్ళు జల్లుతున్నాడు
తాను ఎండలో నిలబడినా
ఆ పువ్వులను వాడనివ్వడం లేదు
ఆ తల్లి పొత్తిళ్ళలో బిడ్డ చల్లదనాన్ని వెతుకుతోంది
సముద్రం సాయంత్రం చల్లదనాన్ని మోసుకొస్తుంది
ప్రతి నీటి చుక్కలో ఏవో జీవన శ్రుతులు
కానుకలు కళ్ళను మెరిపిస్తాయి
అభినందన జీవన సౌందర్యం
ఒక సన్నని రాగం కదలి తీరంలో వినిపిస్తూనే ఉంది
ఆ తాడిచెట్టు నిటారుగా నిలబడింది
నిశ్శబ్దంగా అది ఏదో మాట్లాడుతోంది
ఆ ఈత చెట్టుకు కాసిన గుత్తులపళ్లు
సంధ్యవేళకు వెలుగుతున్నాయి
ఆ తాటాకుల సందుల్లో నుండి సూర్యకిరణాలు
ఆ జవ్వని కురుల మీద సువర్ణ కుసుమాలు తొడుగుతున్నాయి
ఇసుక తిన్నెల మీద పడుతున్న ఆమె అడుగులు
భారంగా దిగి దిగులు ముద్రలు వేస్తున్నాయి
ఆమె ఎవరికోసమో ఎదురుచూస్తూ నడుస్తుంది
మునివేళ్ళు ఇసుక పొరలతో ముచ్చట్లాడుతున్నాయి
జ్ఞాపకాలన్నీ రాగ రంజితమౌతున్నాయి
నక్షత్రాలన్నీ అక్షరాల గుత్తులవుతున్నాయి
ఎందుకో! కొందరు మనుషులు సజీవ శిల్పాలవుతారు
భావతరంగాలు అవుతారు
తీరప్రాంతం అంతా వారిని ఉత్తేజం చేసింది
అవును! ఎన్నో కొండలను సముద్రం రాపిడి పెట్టింది.
శిలాకృతులు ఏర్పడ్డాయి జీవధాతువులు ఊపిరులయ్యాయి
మనుషులు శిలలుగా శిలలు మనుషులుగా
పడవల్ని నడిపారు
అవును! మనుషులు కలసి వుంటే సముద్రం ఓడిపోతుంది
అది సన్నాయి ధ్వనిలా మారుతుంది
శంఖారావం చేస్తుంది
చిన్నగుడిసె అంతఃపురం అవుతుంది
అంతఃపురం చిన్నగూడు అవుతుంది
తెరచాప ప్రయాణ వాహిక అవుతుంది
జ్ఞాపకాల పందిరి అవుతుంది
తోడు ఓ జీవన సౌందర్యం కదా
నిజమే! సూర్యుడు వెంటపడినా
చంద్రుడు వెంటపడినా వాళ్ళమీద చిరాకే మరి
మళ్ళీ వాళ్ళే ఉదయాలు, వాళ్ళే సాయంత్రాలు
వీరు దేన్ని నిరాకరిస్తున్నారు
వెన్నెల చీకటి చిరురాగం
సన్నని అల, వికసించే పువ్వు
అన్నీ వీరికి జీవన పరిమళాలు ఇవ్వడం లేదా!
అయినా మోళ్ళు వికసిస్తున్నాయి
బండ సందుల్లో నుండి వల్లీ పుష్పాలు వికసిస్తున్నాయి
ఎండ చల్లబడుతుంది, తోడు బలపడుతుంది
ప్రకృతి జీవన సూత్రాలు పల్లవిస్తాయి సుమా!

**–డా॥కత్తి పద్మారావు,** 9849741695

**సక్సెస్ పాఠశాలలు....** 40వ పుట తరువాయి

బడి అమలు జరిగితే, తెలుగుమాధ్యమం విద్యార్థులు తమకు ఇష్టం లేని, ఆపైన కష్టమైన ఆంగ్లమాధ్యమంలోనైనా చేరాలి లేదా ఆ పాఠశాలనైనా విడిచిపెట్టాల్సి ఉంటుంది. వసతులులేని, అభివృద్ధి అవకాశాలు లేని నాన్ సక్సెస్ పాఠశాలకు వారు వెళ్ళవలసి ఉంటుంది. నిజానికి అవి కూడ 5 కిలోమీటర్ల దూర పరిమితిలో లేవు. ఆంగ్లమాధ్యమం వారికి స్వంత ఊరిలో సక్సెస్ పాఠశాల, తెలుగు మాధ్యమం వారికి దూరాభారాన నాన్ సక్సస్ పాఠశాల! ఇందులో కులవర్గ దృక్పథం లేదని చెప్పడం కష్టం. ఆంగ్లమాధ్యమానికి సిద్ధంకాని మొదటి తరం విద్యార్థులే నాన్ సక్సెస్ పాఠశాలలకు వెళ్ళవలసి ఉంటుంది. మాతృభాషలోనే చదువుకోవాలని కోరుకునే వారు కూడా గ్రామంలో ఉన్న పాఠశాలను విడిచిపెట్టవలసి ఉంటుంది.

ఈ ఇంగ్లీషు తుఫానులో తెలుగు మాధ్యమ విద్యార్థులు శరణార్థులుగా మారబోతున్నారు. మొత్తం భవనాలను, వనరులను, సౌకర్యాలను 31 శాతంగా ఉన్న ఆంగ్లమాధ్యమ విద్యార్థులకు విడిచిపెట్టి 68 శాతంగా ఉన్న తొమ్మిది లక్షలకు మించిన తెలుగు మాధ్యమ విద్యార్థులు రోడ్డున పడవలసి ఉంటుంది. బ్రిటీష్ పాలనలో కూడా ఇంత అన్యాయం జరగలేదేమో! విశ్లేషణాశక్తిని, సృజనాత్మకతను, సామాజిక స్పృహను పెంపొందించే శక్తి మాతృ భాషామాధ్యమానికే ఉంటుందన్న విషయం అంగీకరించకపోయినా, ప్రభుత్వ పాఠశాలల నుంచి మాతృభాషా మాధ్యమం విద్యార్థులను గెంటివేసే జీ.వో. 53/2015ను వెంటనే రద్దు చేయడం కనీస న్యాయం.

రచయిత–
కన్వీనర్, ఆంధ్రప్రదేశ్ విద్యాపరిరక్షణ కమిటి, గుంటూరు,
ఫోన్ : 94409 80396

Owned, printed & published by Samala Lakshmana Babu (9440448244) and printed at Sri Mahalakshmi Offset Printers, 16-7-20, Veera Raghavulu Street, Sharabu Bazaar, Tenali, Guntur Dist. and published from 8-386, Jivaka Bhawan, Angalakuduru Post, Tenali Mandal, Guntur Dist. - 522211. Editor: Dr. SAMALA RAMESH BABU (9848016136)
RNI-APTEL/2015/62362















# తెలుగు ప్రజలకు గర్వకారణమైన ఛాయాచిత్రకారుడు తమ్మా శ్రీనివాసరెడ్డి

(వ్యాసం లోపలి పుటల్లో..)







AMMANUDI (Telugu Monthly)
April 2016, Vol.2, Issue 2

RNI-APTEL/2015/62362
Postal Reg. No.TEN/12/2015-17